ఆంధ్రసచిత్రవార

# పత్రిక

4-1-1963

'పన్నీరు - కన్నీరు'
కొత్త సీరియల్ ప్రారంభం!

25 నయాపైసలు




మీ అభిప్రాయం ఏమిటి డాక్టర్?

# వస్తున్నది !

నరనారాయణుల
**సైన్యము • వీర్యము • కార్యము**
నభూతోనభవిష్యతి అన్నట్లుల
నవరసభరితముగా సృష్టించిన
మహోత్తర పౌరాణిక
**చిత్రము**




# శ్రీ కృష్ణార్జున యుద్ధము

నిర్మాత • దర్శకుడు • కె. వి. రెడ్డి B.Sc., (HONS)

BARTHA

వాహిని విడుదల

TARAKA

# ఉత్తరాలు

## ముఖచిత్రం

మా అభిమాన నటుడు శ్రీ ప్రభాకరరెడ్డి పరిచయం చదివి చాల ఆనందించాము. వీరిని పరిచయం చేసినందుకు మీకు మా అభినందనములు. కాని, ఒక సందేహం. వారి అడ్రసు తెల్పరు. వారు సమ్మతించరా, లేక మీకు ఇష్టంలేదా! దయచేసి తెలియజేయండి.

తటపర్తి శరభరాజా (రాజోలు)

* * *

మీరు ప్రతీవారం నూతన నటీ—నటులను మాకు పరిచయం చేస్తున్నారు. బాగుంది. అలాగే మన పెద్ద నటీ నటులను అంటే రామారావు, రంగారావు, గుమ్మడి, సావిత్రి, జమున మొదలగు వారిని కూడా మాకు త్వరలో పరిచయంచేస్తే ఇంకా బాగుంటుంది. మా కోర్కె నెరవేరుతుందని అనుకోవడంలో పొరపాటు లేదనుకుంటాను.

బి. ఎస్. రావు (హైదరాబాదు)

## కథలు• సీరియల్ కథలు

"అమరమిత్ర" గారు వ్రాసిన 'సంధ్యా సమాగమం' వాస్తవానికి అతి దగ్గరగా సృష్టించడం వల్ల నిజంగా నా హృదయానికి హత్తుకుంది. ఎంతసేపూ ఏ ఆనందరావుమీదో వ్రాసిన కథలు చదివి, విసుగెత్తిన నాకు సంధ్యా సమాగమం, ఒక కథేనా, నిజమా అనిపించింది. చివరవరకు మేస్టారు చచ్చిపోకుండాఉంటే బాగుండును అనిపించింది.

చింతవారి రాజారావు (విజయవాడ)

* * *

సంధ్యా సమాగమం" కథ కన్నీరు కార్పించింది. వేదనాపూరితమైన మేస్టారి జీవితంలోని అంతిమ దశలో, తన ప్రియశిష్యుల సేవల్లోనూ, అంతమ్మల అడ్డంకులతో జీవితంలో విడిపోయిన తన ప్రేమమయి 'అలక' సాన్నిధ్యంలోనూ మేస్టారి అంతిమయాత్ర! ఎంత చక్కగా ఉంది కథ ముగింపు!!

పావ (బిలాస్‌పూర్)

* * *

'బంగారు పంజరం' వంటి అత్యుత్తమ నవలను మా పాఠక లోకానికి మీ పత్రిక ద్వారా అందజేసిన "శ్రీమతి కోమలాదేవి"కి నా ధన్యవాదాలు. కథ మొదటినుండి చివరివరకు బహు పటుత్వముతో నడచినది. మీ వారపత్రిక పరిచయం చేసిన ఉత్తమ నవలలలో 'బంగారు పంజరం' ఒకటి.

కె. బి. రాజేంద్రప్రసాద్ (విజయవాడ)

* * *

"పి. గణపతిశాస్త్రిగారు వ్రాసిన సీరియల్ కథ చాలా బాగుంది. చదువుతున్నకొద్దీ ఇంకా చదవాలనిఉంది. కాని, త్వరలో ముగించారు.

జె. వి. రమణయ్య (పాట్నా) ★

పైవారం

ఆంధ్రసచిత్రవారపత్రిక

సంక్రాంతి ప్రత్యేక సంచిక!

# ధన్యవాదాలు — నేను కూడా సిజర్సు మాత్రమే కాలుస్తాను

ఈ యిద్దరేకాదు — ఏభై సంవత్సరములకు పైగా పల్లె పల్లెలలోనూ వాడ వాడలలోనూ దేశమంతటా అనేక తరహాల వేలాది ప్రజలు 'సిజర్సు' సిగరెట్టును కాల్చి కొనియాడుచున్నారు. దినదినాభివృద్ధి చెందుచున్న దాని వాడకమే 'సిజర్సు' యొక్క విలువకు తార్కాణము. 'సిజర్సు' నాణ్యమైన సిగరెట్టు —దాని రుచి మరచి పోరానిది— దాని సువాసన అద్భుతము. చలికాలమైనా. వేసవి కాలమైనా. వర్షాకాలమైనా సరే 'సిజర్సు' ఎల్లవేళలయందును సంతృప్తి పరచును.




IWTS 228D

ఆంధ్రసచిత్రవార
పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
*
శుక్రవారం: 4—1—63
శుభకృన్నామ సం॥ పౌషమాసం॥ శు॥ నవమి
సంపుటము : 55 సంచిక : 13
స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకులు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకులు :
శివలెంక రాధాకృష్ణ
*
ఒక సంవత్సరం చందా
వివరాలు
ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు—రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)
*
విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1




శోభన్ బాబు.

# మనలో మాట

ఈ సంచిక 1963 సంవత్సరంలో మొదటిది మా పాఠకులందరకూ నూతన సంవత్సర శుభాభినందనలు!

* * *

వచ్చే వారం సంచిక సంక్రాంతి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. మామూలుకన్నా ఎక్కువ కథలు, శీర్షికలు గల ఈ సంచిక పేజీల సంఖ్య కూడా కొంచెం ఎక్కువగా ఉంటుంది.

* * *

ఈ వారంతో 'విచిత్రవివాహం' అయిపోయింది. త్వరలో 'యు' వ్రాసిన కథలే కాక, ప్రపంచమంతటా నుంచీ సేకరించిన అపరాధ పరిశోధక యథార్థగాథలు కొన్ని ప్రచురించబోతున్నాము!

* * *

'విచిత్రవ్యక్తులు' శీర్షిక అయిపోవచ్చింది. మరి రెండు వ్యాసాలతో ముగించివేస్తాము కాని, ఈ సంచిక తర్వాత, లోపలి వ్యాసానికి సంబంధించిన ముఖచిత్రం వెయ్యాము. ఇంతకుముందే వ్రాసినట్లు సినిమా శీర్షికలు వ్యక్తులను గురించి ఉంటాయి కాబట్టి ఎక్కువ కాలం రావు!

## లోకంపోకడ



"ఒరే అబ్బాయిలూ! ద్రోహ బుద్ధికి ఉదహరణ ఏదైనా చెప్పండిరా!"
"చైనా సార్!"

## విషయానుక్రమణిక


బాబూ! కాస్త జాగర్తగా
వుండుమా! ఈ పర్వతాల
మాటున దుష్టులూ
ద్రోహులూ తారాడు
తున్నారు ...
కొత్తఏడాది 1963
హిమాలయాల మీద
ప్రమాద సమస్య


జిన్నా
అయూబ్
నెహ్రూతో మాట్లాడ్డానికి
ముస్తాబు సరిగ్గా వుందా?


ప్రపంచ కమ్యూనిస్టు
ఆధిపత్యం
ఒకే ఒరలో రెండు కత్తులా?
ఒకే ఆసనంపై రెండు ఆధిపత్యాలా?"


ఏమిటిదంతా?
ఎటు చూసినా ఫొటోలన్నింటా నెహ్రూ
ఒకడేనా?
నామాటేమిటి?



బొంబాయిలో డిసెంబర్ 20వ తేదీన భారతీయ విద్యాభవన్ రజితోత్సవాలు జరిగాయి. రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణ ప్రారంభం చేశారు. చిత్రంలో శ్రీయుతులు రాజాజీ మున్షీలనుకూడా చూడనగును.

# ప్రజల 'త్యాగనిధి' సద్వినియోగం కాగల పంథాల పథకాల ఆవశ్యకత

## శ్రీకృష్ణ

ప్రణాళికా సంఘం ప్రస్తుతం తృతీయ పంచవర్ష ప్రణాళికను యుద్ధోన్ముఖం చెయ్యాలనే పనిలో మునిగిఉంది. జాతీయ అభివృద్ధి మండలి పోయిన సమావేశంలో రాష్ట్ర ప్రభుత్వాల పథకాలను యుద్ధ అవసరాల దృష్ట్యా రూపొందించాలనే ఒక సిద్ధాంతాన్ని చేసింది. అలాంటి నిర్ణయమే ఒకటి కేంద్ర పథకాల గురించి కూడా జరిగి అమలు కాబోతున్నది.

అసలు ప్రణాళికా రచన అంటే అత్యవసర వస్తువులకు ఉన్న సదుపాయాలలో ఎక్కువ అవకాశాలను కలిగించి రూపొందించడమే అనుకుంటే పై విధానం సార్థకమవుతుంది. దేశవ్యాప్తమైన చైతన్యం దేశంలోని కాంగ్రెసు నాయకులను ఒక రకమైన కనువిప్పుకు గురిచేసింది. కేవలం సైనిక సాధన శక్తి సంపత్తులు లేనిదే ఆర్థిక సంపద విజయాకాంక్షలు దేశ జీవన విధానాన్నే గాక, దాని స్వతంత్ర స్వేచ్ఛా సంపత్తులను కూడా ప్రమాదానికి ఎర చేయగలవని వారు గుర్తించారు. చైనా వారితో శాంతి—మంతనాల్లాంటివి సాగనిచ్చినా, రక్షణ ఉద్యమం విపరీతంగా, అత్యంత ముఖ్యంగా పెంచడం చేస్తామని ప్రధాని చెప్పడం ముదావహం. రక్షణ దశావసరాలను ఆదుకొనే విధంగా పారిశ్రామిక సదుపాయాలను సాధ్యమైనంత ఎక్కువగా వాడుకోడమే ప్రస్తుత ప్రధాన కార్యక్రమం.

చైనాను మక్‌మోహన్ కవతలికట్టి ఉంచాలి అంటే అస్సాం ఎలాంటి బలమైన ఒత్తిడినైనా నెట్టివేయగల రక్షణ స్తోమత కలిగి ఉండాలి. దాని రవాణా, వార్తాప్రసార సదుపాయాలను బాగా పెంచాలి. మీటర్‌గేజ్‌ను బ్రాడ్‌గేజిగా మార్చితే, అది వ్యాపార దృక్పథంలో మంచిదికాదులాంటి అడ్డుపుల్లల నవతలికి నెట్టేయాలి. అక్కడది సరిహద్దు రక్షణకు ముడిపడ్డ పన్నాగమే గాని, అభివృద్ధి ఆదాయాల లేఖజాలు వేసుకొనే పథకం కారాదు.

చైనాను మక్‌మోహన్ రేఖ కవతల నిలబెట్టాలి అంటే, కాశ్మీర్ లోయలో మనం గ్రుమ్మరించిన సొమ్ము కంటే చాలా ఎక్కువ వ్యయప్రయాసల అవసరం ఎంతైనా ఉన్నది.

ఒక ఫ్రెంచి సామెత ఉన్నది లెండి. "ఎంత అందాలభరిణ అయినా తనకున్న దాని కంటే ఎక్కువ ఇవ్వలేదూ" అని. అలాగే 'దేశ' మైనా అంతే. ఇవాళ విదేశీమారక ద్రవ్యంతోపాటు రూపాయల కటకట కూడా ఉంటున్నది. గనుక భోగలాలసతను యిముడించే పథకాలు అంటే, వాటిల తయారీలాంటివి మానేయవచ్చును. ఆఖరికి నౌకానిర్మాణం కూడా సబబైనదా ? అని యోచించవల్సిందే!

ఈ విషయంలో "భారత వాణిజ్య మండలుల సమాఖ్య" ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తి చేస్తూ ప్రభుత్వాన్ని కార్యనిర్వాహకనైపుణ్యాన్ని దోహదించి, అక్కరకుమాలిన పొరశాఖా ఖర్చులు మానేయుమని కోరింది.

ఆ "ఫెడరేషన్" యిలా పేర్కొన్నది:

పారిశ్రామిక ఉత్పత్తిని దోహదించాలి; పెంచాలి. ముఖ్యంగా దేశరక్షణకు, వ్యూహ రచనకు అవసరమైన రంగాన్ని, ఎగుమతికి అవకాశాలు గల వస్తు రంగంలోను ఉత్పత్తిని బాగా పెంచాలి. 'రెడ్ టేపు', అనవసర తాత్సారాలూ ప్రభుత్వ విధానాల మీద సవారీ చేస్తుండేవి యిదివరకు. ఇది మళ్లీ జరగరాదు.

నిర్ణయాలూ, వాటి అమలూ చకచకా జరగాలి. అభివృద్ధికి అవసరంగాని ఖర్చులు ప్రభుత్వ

50-వ పేజీ చూడండి

## శ్రీ 'యు'

"సుమారు ఇరవై యేళ్ల క్రిందట ఈ రాజుతో నా వివాహం జరిగింది. అప్పుడు నేను మామగారింట్లోనే ఉండేదాన్ని. ఈయన తరచుగా బయట ఊళ్లకు వెళ్తుండేవాడు. వెళ్ళేటప్పుడుమాత్రం చేతిలో ఏమీ ఉండేవి కావు. వచ్చేటప్పుడు ఏవో సూట్‌కేసులు, ఇంకా తదితరమైన వస్తువులూ చాలా ఖరీదుగలవి తీసుకొస్తుండేవాడు. నాకు ఇదంతా విచిత్రంగా ఉండేది. ఆ పెట్టెల్లో ఏముందో చూద్దామనే ఉబలాటంతో ఎప్పుడన్నా అడిగితే, రాజు మాట తప్పించేవాడే కాని, ఎప్పుడూ నన్ను చూడనిచ్చే వాడుకాదు. అందులో చెప్పనన్నా చెప్పేవాడు కాదు. అదేమంటే 'ఆడవాళ్ళు వంటిట్లో ఉండాల్సిందే! నీ కనవసరమైన వాటిల్లో జోక్యం కల్పించుకోకు' అని కసుర్తుండేవాడు. అయితే సాంసారిక జీవనానికి మాత్రం ఏమీ భంగంలేకుండా సాగిపోతోంది. ఇల్లు గడిపేందుకు, బట్టలు మొదలైనవి కొంటానికి, ఎంతో డబ్బు ఇస్తూనే ఉండేవాడు. ఈ విపరీతమైన ఆదాయం కష్టపడి సంపాదించింది కాదనీ, ఏదో గూడుపుఠాణిలో లాభా వచ్చిందేమో అనే అనుమానంవేసింది. కాని ఏమన్నాఅంటే ఈమాత్రం కూడా ఉండదేమోనని భయపడి నోరు మూసుకుని ఊరుకునేదాన్ని. ఒకరోజున రెండుమూడు రోజుల్లో వచ్చేస్తానని ఒకరోజున వెళ్ళిపోయాడు రాజు. అంతేమరి. నాలుగేళ్ళవరకూ కంటబడలేదు!

ఈ నాలుగేళ్ళ నా బ్రతుకు ఎలా గడిచిందో వచ్చి నన్ను చేపట్టకపోతాడా అనే ధైర్యంతో జీవితం గడుపుతుండేదాన్ని.

"ఇదివరకు మేమున్నవాడకు దగ్గర్లోనే వేరే ఒక చిన్న ఇల్లు తీసుకుని ఉండేదాన్ని. నన్ను చెడగొట్టాలని ప్రయత్నించిన వాళ్లెవరూ జయం పొందలేదు."

"నాలుగేళ్ళ తర్వాత ఒకరోజున ఉదయాన్నే రాజు నే నెక్కడున్నది తెలుసుకుని మా యింటికి వచ్చాడు. నిన్ను వెతుక్కుంటూ వచ్చాననీ, నీకోసమే జీవిస్తున్నానని ఏమిటేమిటో చెప్పాడు! అతని మాటలు నమ్మాను. నమ్మక, చేయగల్గిందిమాత్రం ఏముంది?"

"నాకు మంచి ఉద్యోగం దొరికింది. హాయిగా ఉండొచ్చు ర"మ్మని రాజునన్ను రంగూన్‌కు ప్రయాణం చేశాడు. ఒంటరి జీవితంలో ఎన్నో దెబ్బలు తినబోయి తప్పించుకున్న నాకు ఆ మాటలు ఎంతో మంచిజీవితం గడపవచ్చుకదా అనే ఆశ కల్గించాయి. ఆయన-మాట కాదనలేక రంగూన్‌కు బయల్దేరాను.

"ఈ ప్రయాణం కొన్నాళ్ళపాటు సాగింది. నేను సంపాదించుకున్న కొద్ది ధనం, ఓడలో వివిధమైన తినుబండారాలుకు, బట్టలకు ఖర్చయిపోయింది. రంగూన్ చేరేటప్పటికి నాకు మళ్లీ వట్టిచేతులు, ఉపవాసాలే కలుగతాయేమో అనిపించింది. పైగా ఓడఎక్కడం అదే మొదటి తడవేమో నాకు వాంతులు, తలనొప్పి ప్రారంభించాయి.

సులో నేనున్న మురికివాడ ఎంతో అందంగా శుభ్రంగా కన్పించింది. అంతవరకూ మా ఆయన ఏదో పెద్ద ఉన్నత సంప్రదాయ కుటుంబంవాడనుకున్నాను. ఇక్కడకు వచ్చింతర్వాత మొదటిసారిగా తెలిసింది; ఆయన బర్మా ఆటవిక జాతికి చెందినవాడని. జీవితంలో అన్నివిధాలా మోసపోయా ననుకున్నాను. నాలో నేనే కుమిలిపోయాను. ఎటువంటివాడైనా తాళికట్టింం తర్వాత భర్త! నా మొహాన ఆ భగవంతుడు అదే రాసిపెట్టాడేమో అని సమాధానపడ్డాను. ఊరుకాని ఊళ్ళో, భాషకాని భాషలో పదిమంది మధ్య ఒంటరితనం అనుభవిస్తున్నానని ఏడిచే ఓపిక్కూడా లేకపోయింది.

అక్కడ కూడా నా జీవితం నరకప్రాయమే ఐపోయింది. ఎంతో గొప్ప ఉద్యోగం చేస్తున్నానని ఆశ చూపించి తీసుకువచ్చిన ఆయన ఆ ఊళ్ళో వెలగబెడ్తున్నది బంట్రోతు ఉద్యోగంట. అదీ ఓ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ దగ్గరట!

ఇవన్నీ ఎలాగోలాగు సమాధానపడచ్చు! పడగలిగాను. కాని నా జీవితానికి పెద్ద అవరోధంగా నిల్చిన వ్యక్తి ఆయన మేనకోడలు. రాజు ఆమెను ఇదివరకే వంచించి లోబరచుకున్నాడట. ఇంకేం ఇక్కడ నాకు సవతిపోరు ఏర్పడింది. ఇలా తొమ్మిది నెలలు అవస్థపడ్డాను.

"రాజు బంట్రోతుగా పనిచేస్తున్న ఇంటా ఆ భగవంతునికే ఎరుక! రాజు ఇల్లువిడిచి పోయిన దగ్గర్నుంచి, నేను మామగారి దయాదాక్షిణ్యాలపైన ఆధారపడాల్సివచ్చింది. అసలే ఆయనకు మా ఆయన రాజంటే ఇష్టంలేదు! రాజు వెళ్ళిపోయింతర్వాత కొంతకాలంపాటు నన్ను పోషించారు. కొడుకు దగ్గ్రేనప్పుడు ఈ పిల్లమాత్రం ఎందుకిక్కడ అనుకున్నారో ఏమో ఆయన నన్ను వెళ్ళగొట్టేశారు!

పరిస్థితి రోజురోజుకీ దుర్భరంగా మారిపోయింది. ఏం చేయటానికి దిక్కుతోచిందికాదు. కొన్నాళ్ళు ఏదో మిల్లులో కూలిపని చేశాను. ఆ కూలిపని చేస్తున్నన్నాళ్ళుకూడా నా బ్రతుకు అధ్వాన్నంగా మారిపోయింది. వయస్సులోని పోకిరి—పిల్లలు నా జీవితాన్ని భగ్నం చేయాలని, నన్ను యీమాత్రంగా కూడా ఉండలేని వృత్తికి దింపాలని ఎన్నో విధాల ఇంటిచుట్టూ ప్రదక్షిణలు చేస్తుండేవాళ్ళు. ఈ ఆపదలోనించి మంచి మనిషిగా తప్పుకోవటం ఎలాగా భగవంతుడా అని రోజూ నాలో నేనే కుమిలిపోయేదాన్ని. ఒక్కొక్క రోజున ఎందులోనన్నాపడి... విరగడ చేసుకుందామని అనుకునేదాన్నికూడా; కాని ఏదో....నాకు తెలియని ఆశకు లోబడి, ఈ ఇబ్బందుల్ని నెట్టుకొస్తుండేదాన్ని. ఏనాటికైనా నా రాజు

నాలాగా చాలామంది బాధపడ్డారు. ఏదన్నా మందు కొనుక్కుందామన్నా, చేతిలో చిల్లిగవ్వలేని పరిస్థితి ఏర్పడింది. మా ఆయన రాజుమాత్రం ఇదంతా మామూలే అనే ధోరణిలోనే గడిపేసేవాడు. మేం కొన్నది తక్కువతరగతి టిక్కెట్టుకావటంవల్ల ప్రయాణం చేస్తున్నంతకాలం క్రిందిభాగంలో కూపాల్లాంటి గదుల్లో మగ్గిపోవాల్సిందేతప్ప, ఓడపై పైభాగానికి పోనిచ్చేవారుకాదు. సరే రంగూన్‌చేరాం. అప్పుడుకూడా పై తరగతి ప్రయాణికులను ముందర వదిలివేశారు.

దొంగ—రవాణా అరికట్టేందుకనీ, ఆరోగ్య నిబంధనలు పాటించడం జరిగిందో, లేదో చూడాలనీ, కస్టమ్స్ అధికార్లు, ఆరోగ్య శాఖాధికారులు. ఈ క్రింది తరగతి ప్రయాణికులందర్నీ ముళ్ళ కంచె చుట్టూ వేసిన మైదానంలోకి తోలి పరిశోధన ప్రారంభించారు. ఆడ, మగా భేదం లేకుండా అందర్నీ నానా అల్లరి చేశారు. సుమారు రెండు రోజులు ఈ నరకంలో గడిపిన తర్వాత మేం రంగూన్ అంటే ఏమిటో చూసే అవకాశం దొరికింది.

రాజు నన్ను ఆ మహాపట్నంలో అలగా అలవాట్లు గల ప్రజలుండే ప్రాంతానికి తీసుకుపోయాడు. ఆ ప్రాంతం చూచిం తర్వాత మద్రా

యన కొడుకు బ్రిటిష్ ఇంజనీరింగ్ సర్వీస్‌లో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా బోర్నియో వెళ్తున్నాట్ట; రాజును కూడా వెంట వెళ్లమన్నారు.

ఇంట్లో పోరు భరించేకన్నా ఆయన వెంట ఉండటమే నయమనుకుని నేనూ బయల్దేరాను. నాతోపాటు రాజు మేనకోడలు కూడా తోడైంది. సరే, ముగ్గురం బయల్దేరాం. అక్కణ్ణించి నా బాధలు ఎక్కువైనాయి.

రంగూన్‌కు దగ్గరగా ఉన్న పట్నానికి రాజు నాతో చెప్పకుండా తన మేనకోడలుతో పారిపోయాడు.

'ఆ కొత్త పట్నంలో పేరు కూడా నాకు సరిగ్గా నోరు తిరగని ఆ పట్నంలో, తింటానికి తిండి లేక, కట్టుకోటానికి ఇంకో బట్ట లేక, సుమారు రెండు రోజులపాటు ఎలా నిలవగల్గానో నాకు తెలియదు. ఉన్నదాంట్లో సర్దుకునే అలవాటు నేర్చుకున్న నేను పదిమంది పెట్టిన ముష్టితో ఏదో కనిపించింది తింటూ గడిపాను. ఇంకా ఒక్కరోజు ఇక్కడుంటే ప్రాణం సంగతెలా ఉన్నా, మానం పోవటం ఖాయ మనిపించింది.

మూడ రోజున వీసా లేకుండా ప్రయాణం

53—పేజీ చూడండి



"నవ్యసాహిత్యం కదు సంగీత శ్రవణంకాబోలు" — శోభన్‌బాబు.

# ఉత్సాహం గల యువ నటుడు 'శోభన్‌బాబు'

బడుల్లోనూ, కాలేజీల్లోనూ చదువుకునే కుర్రాళ్ళకు— కేవలం చదువే ప్రధానం కాదు. ఇతర కార్యక్రమాలు కూడా ముఖ్యమైనవే. ఆటలు, పాటలూ, నాటకాలు—వంటివి. ఐతే కొందరు, చదువును విడిచిపెట్టి, వీటినే పట్టుకోవటం కూడా చూస్తున్నాము. ఇది తప్పు అని కూడా వారికీ తెలుసు. ఐతే, వాటిల్లో ఉన్న ఉత్సాహమూ, ఆనందమూ కలిసి వాళ్ళచేత ఈ పని చేయిస్తున్నదని చెప్పుకోవలసివస్తోంది.

శోభన్‌బాబు చదువును విడిచిపెట్టి ఎప్పుడూ ఇతర కార్యక్రమాల్లో పాల్గొనలేదు గాని, చదువుకంటే అవి కూడా ముఖ్యమైనవే అని భావించేవాడు. అతన్ని ఆకర్షించినది—నాటకం! ఈ ఉత్సాహము అతనిలో చిత్రంగా ప్రవేశించింది. నాటకాల్లో, సినిమాలూ చూడటం అతనికి బాగా అలవాటయిందంటే, అందుకు కారణం—ఈ ఉత్సాహమే.

శోభన్‌బాబు పధ్నాలుగో యేట అతను వాళ్ళ ఊళ్లో ఒక నాటకం చూశాడు. ఆ నాటకంలో ఉన్న ఒక ముసలి పాత్ర అతనికి బాగా నచ్చింది. ఆ పాత్ర ధరించిన వ్యక్తి ఎంత మంచి నటుడోనని అనుకున్నాడు. నాటకం ఐన తర్వాత అతన్ని చూడాలని ఊహించుకున్నాడు. ఆ ఊహతోనే శోభన్‌బాబు, నెమ్మదిగా గ్రీన్ రూము చేరుకున్నాడు. ఆ పాత్రధారి కోసం చుట్టుప్రక్కలంతా గాలించసాగాడు. అతను ఒకింతకు ఊడిపడడే! నాటకం ఐపోయినా కూడా ఇంకా స్టేజిమీదే ఉన్నాడా ఏమిటని, శోభన్‌బాబు స్టేజిమీదకు వెళ్లాడు. అక్కడ లైట్లూ, కర్టెన్లూ తీసేస్తున్నవాళ్ళు తప్ప, ఇంకెవరూ కనిపించలేదు. శోభన్‌బాబుకు బాగా విచారం కలిగింది. అటువంటి మంచి నటుని చూడాలని తాను ఎంత ఆశతోనో వస్తే—ఇట్లా నిరాశ ఎదురైందేమిటని బాధపడ్డాడు. అతను ఎంతలో,ఎట్నుంచి ఎటు వెళ్ళిపోయాడో అతని ఊహకు అందలేదు. శోభన్‌బాబు మళ్ళీ గ్రీన్‌రూమ్ ప్రవేశించి — అటూ ఇటూ చూడసాగాడు. నటులంతా రంగులు తుడుచుకుంటూ కనిపిస్తున్నారు గాని— అతను లేడు.

"ఏమండీ, ఇందాక నాటకంలో ముసలాయన వేషం వేసిన ఆయన ఇక్కడ లేరాండీ?" అని అడిగాడు శోభన్‌బాబు, రంగుతుడుచుకుని, దుస్తులు వేసుకుంటున్న ఒక యువకుడిని. ఆ యువకుడు, శోభన్‌బాబును ఎగాదిగా చూసి—"ఏం?" అన్నాడు.

"ఏంలేదు, చూదామని."

"చూశారుగా."

"లేదండీ."

"ఇప్పుడు చూస్తున్నారుగా."

"ఎక్కడండీ?"

"ఇక్కడేనండీ."

శోభన్‌బాబు, అటూఇటూ అగమ్యంగా చూడసాగాడు.

"నేనేనండీ" అంటూ ఆ యువకుడు, పకపకమని నవ్వాడు. శోభన్‌బాబుకు కళ్ళు దిమ్మెత్తినట్లు కమ్మాయి. అతనెక్కడ? ఇతనెక్కడ? అతని రూపంవేరు, మాటవేరు! ఇతని పద్ధతివేరు. ఒకవేళ ఇతను తనను చూసి హేళన చేస్తున్నాడేమోనని కోపంకూడా వచ్చింది అతనికి. ఆ యువకుడు, తనేనని నమ్మించడానికి, మళ్లీ ఒకసారి అతని ముందు నటించవలసి వచ్చింది — అపుడు గాని శోభన్‌బాబుకు నమ్మకం కుదరలేదు.

"ఐతే మీరు నిజంగా ముసలివారు కారా?" అని ఆశ్చర్యపోయాడు శోభన్‌బాబు, మరో సారి.

"కాదన్నమాటేగా."

"ఐతే, ఈ వయస్సులో ఉన్నవాళ్ళుకూడా అటువంటి వేషాలు వెయ్యవచ్చునన్నమాట!"

"నిరాక్షేపణీయంగా వేయవచ్చును" అన్నాడా యువకుడు. శోభన్‌బాబుకు చాలా ఆశ్చర్యం వేసింది. ఈ వయస్సెక్కడ? ఆ వయస్సెక్కడ? ఒక్కసారి ఈ వయస్సునుంచి, అంతటి వయస్సుకు పోవడమే! 'నటన'లో ఇంత మహత్తర శక్తి ఉన్నదన్నమాట. ఆ శక్తే తనను నమ్మించింది— భ్రమింపజేసింది! తనుకూడా అట్లా ఒక ముసలి వేషం వేస్తే? — అనుకున్నాడుకూడా అతను.

ఆ మర్నాడే, అతను తెల్లమీసాలు తగిలించుకుని నడుం వంచుకుని, అద్దంలో చూస్తూ, ముసలి సంభాషణ ఒకటి చెప్పాడు. అది అతనికి బాగానే ఉన్నట్టు కనిపించింది. అతనిమట్టుకు అతనికే ఆశ్చర్యంకూడా కలిగింది. ఐతే పర్వాలేదనుకున్నాడు. అతను ఊహించినట్టుగానే, అతనికి ఒక్క నాటకంలో ముసలిపాత్రను ధరించే ఛాన్సు తగిలింది. శోభన్‌బాబు ముందు ఎగిరి గంతులేశాడు కాని— తర్వాత భయపడ్డాడు. తనకు ఇంకా పధ్నాలుగేళ్ళు. ఈ వేషం చూస్తే యాభై ఏళ్లది. తను వెయ్యగలడా? పైగా తనకు రంగస్థలం ఎక్కటంకూడా ఇదే మొదటిసారి. ఏమైతే ఐందని— తెగించి, అతను ఆ పాత్రను ధరించాడు. రిహార్సల్సులో ఏమీ అనిపించక పోయినా, స్టేజీమీదమాత్రం ఒళ్లుతెలియని స్థితిలో పడ్డాడు. ఏం చేస్తున్నాడో, ఏం జరుగుతున్నదో అతనికే తెలియదు. నాటకం పూర్తయిన తర్వాత, "బాగా చేశావురా" అని అతని మిత్రులు కొనియాడుతున్నప్పుడుమాత్రం— ఈ లోకం కనిపించింది.

ఆ విధంగా శోభన్‌బాబు 'నటుడు'గా మారాడు. ఆ ప్రోత్సాహాన్ని పురస్కరించుకుని, అతను అక్కడినుంచి చాలా నాటకాల్లో పాల్గొంటూ వచ్చాడు. ఆ 'పిచ్చి' ఎంత దూరం వెళ్లిందంటే— అతను పై చదువులకోసం దగ్గరున్న కాలేజీని విడిచిపెట్టి — నాటకాలు బాగా ఆడే గుంటూరు ఏ. సి. కాలేజీలో జాయినయినంత దూరం వెళ్లింది.

ఏ. సి. కాలేజీలో శోభన్‌బాబు ఆ పాఠాలతో పాటు, నటనలోకూడా చాలా 'పాఠాలు' నేర్చుకున్నాడు. నాటకాల్లో పాల్గొనడంద్వారా అతను అందరి అభిమానాలూ సంపాయించుకోగలిగాడు.అక్కడే

—47వ పేజీ చూడండి

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండా కూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని, దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియనియనంతటా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చురుకైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లతోము కొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల సేపు ఉండే దాని పిప్పరమెంటు వంటి రుచి అంటే వారికి ప్రీతి!

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే
- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




మీకు పౌడరు కావాలంటే, ఈ లాభములన్నిటని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు ...ఒక డబ్బా నెలలు వస్తుంది!

నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు



మన గవర్నర్ శ్రీ నగేష్ శ్రీశైలస్వామి దర్శనం చేశారు.

# శీతాకాలపు అసెంబ్లీ సమావేశం విశేషాలు

శీతాకాలపు అసెంబ్లీ సమావేశం ముగిసింది. షుమారు రెండువారాలపాటు నిరాఘాటంగా చర్చలు కొనసాగినాయి. చైనా దురాక్రమణ భారీయెత్తున సాగినతర్వాత, యిదే మొదటి సమావేశం. శాసన సభ్యులందరూ, దేశసరిహద్దులను కాపాడటానికి శాయశక్తులా కృషిచేస్తూ ఎంతటి త్యాగాలైనా సరే, చేయటానికి సంసిద్ధులమని ప్రకటించారు. మూడురోజులపాటు చర్చకూడా జరిగింది. ఈ దురాక్రమణను ప్రతిఘటించటానికి తీసుకురాబడ్డ తీర్మానాన్ని, అన్ని పార్టీల సభ్యులు ఏకాభిప్రాయంతో బలపరచటం, ప్రభుత్వానికి అండదండలుగా ఉంటామని ప్రతిన పూనటం, హర్షించతగ్గ విషయము. శాసనసభలో ప్రవేశపెట్టబడిన ఏ తీర్మానం కూడా, భేదాభిప్రాయం లేకుండా ఆమోదించబడటంలేదు. అయితే ఈ తీర్మానం అలాంటిదికాదు. కేవలం, దేశాన్ని రక్షించుకోవలసిన ఆవశ్యకతను, వ్యక్తుల యొక్క బాధ్యతలను సూచిస్తున్నది. దేశభక్తి ప్రభోధితమైన యీ తీర్మానాన్ని, హృదయపూర్వకంగా అందరూ—బలపరిచారు.

తర్వాత, అదనపు భూమిశిస్తుచట్టము, సవరణలతో ప్రవేశపెట్టిన బిల్లు, చర్చలకు వచ్చింది. ఈ చట్టానికి ప్రతిపక్ష సభ్యులందరూ వ్యతిరేకమే! ఈ వ్యతిరేకతను గత సమావేశంలో వ్యక్తపరిచిందే. అయితే ప్రభుత్వంవారు మాత్రం యీ చట్టాన్ని అమలుపరచితీరాల్సిందే అనే ధోరణిలో ఉన్నారు. వ్యవసాయం, లాభసాటిగా ఉండటంలేదు. ఖర్చులు అపరిమితంగా పెరిగిపోయినాయి; వచ్చే రాబడి అంతంతమాత్రమే. ఏడాది పొడుగునా కష్టపడి పండించే రైతుకు మిగిలేదేమిటో, అందులో, కుటుంబాన్ని పోషించేదేమిటో, యీ అదనపుశిస్తులు కట్టేదేమిటో అర్థంకావటంలేదు. యీ బిల్లును, చట్టంగా మార్చేముందు ప్రజాభిప్రాయాన్ని సేకరించక, బిల్లును ప్రవేశపెట్టటం, ఆ సమావేశంలోనే చట్టరూపంగా ఆమోదింపచేయటం ప్రజాస్వామ్య సూత్రాలకు విరుద్ధం అని, ప్రతిపక్ష సభ్యులు ఎన్నివిధాల నచ్చచెప్పటానికి ప్రయత్నం చేసినా ప్రయోజనం లేకపోయింది. చివరకు అది చట్టంగా రూపొందింది. దీనిప్రకారం, యీ సంక్రాంతి ధాన్యంరాగానే, రెట్టింపుకు రెట్టింపు శిస్తు కట్టితీరాల్సిందే!

మొట్టమొదట యీ బిల్లును ప్రవేశపెట్టగానే, రాష్ట్రమంతటా గగ్గోలు పుట్టింది. రైతుమీద యింత ఘోరంగా పన్నుభారం మోపటం అక్రమం, అన్యాయం అని, నాలుగుచోట్లనుంచి హాహాకారాలు వినిపించాయి. అయితే ప్రభుత్వంవారు పెడచెవిన పెట్టటం జరిగింది. తర్వాత చిత్తూరు బై ఎలెక్షన్ రావటం, దాంట్లో కాంగ్రెసు అభ్యర్థి ఓటమితో, యీ చట్టాన్ని ప్రజలు నిరసించినట్లు భావించాలని, ప్రభుత్వదృష్టికి తీసుకురావటం జరిగింది. అయినా తమ పట్టుదల వదల్లేదు. ఇది చట్టరూపంగా రావాల్సిందే అన్నారు. అయితే, దీనిపట్ల, తీవ్రమైన వ్యతిరేకతను గమనించి కొంతవరకు శాంతింపచేయటానికేమో అన్నట్లు, కొన్ని సవరణలు తెచ్చి, కొన్ని ప్రాంతాలవారికి, కొన్ని తరగతుల రైతులకు సదుపాయాలు కలుగచేస్తామని ప్రకటించారు. ఆ విధంగానే తెచ్చిన, ఈ సవరణలతో ప్రవేశపెట్టబడిన యీ బిల్లుయొక్క సమగ్రస్వరూపం యేమిటో విస్పష్టంగా తెలియపరచలేదు. దీని విషయమై, అసెంబ్లీలో వాగ్వివాదాలు బాగా చెలరేగినాయి, ప్రతిపక్ష సభ్యులు తీవ్రంగా మాట్లాడారు. ఆర్థిక మంత్రి బ్రహ్మానందరెడ్డిగారు సగర్వంగా చెప్పుకున్నారు: యీ సందర్భంలోనే, యీ సవరణలైనా రైతులు యేదో ఆందోళన చేస్తారని భయపడి కాదు; అవసరమయితే కొన్ని సదుపాయాలు కలిగిస్తామని తొలగడ వాగ్దానం చేశాం; దాన్ని నిలబెట్టుకోవటానికే అని. అదీగాక, యింకో విషయం కూడా వాక్రుచ్చారు, దేశమంటే కేవలం మనుషులూ కాదు. భూమికాదు; మనుషులూ, భూమి కలిసిందే దేశమన్నారు. ఇది గురజాడవారి ప్రబోధ వాక్యానికి సవరణ ఏమో మరి!

ఇంతకీ చెప్పొచ్చిందేమంటే, యీ అత్యవసర పరిస్థితి దృష్ట్యా, ధనం అవసరంకదా; అందువలన అదనపుశిస్తు చట్టాన్ని అమలుపరుస్తున్నాం అనే విషయంలో యెంత సత్యం ఉందో చూడాలి. దేశంలో యీ పరిస్థితి, యీ చట్టాన్ని మొట్టమొదట బిల్లు రూపంగా ప్రవేశపెట్టినతర్వాతనే యేర్పడింది. రెండోది, యీ చట్టంవలన శాశ్వతంగా, రైతుమీద మోయలేని భారంపడుతుంది. చైనా దురాక్రమణను ఎదుర్కొనటానికి, డబ్బుకోసం ప్రవేశపెట్టబడిన బిల్లుకాదు. ఈ తేడాను ప్రజలు గ్రహించే ఉంటారు. దేశరక్షణనిధికి, శక్త్యనుసారం, ఎవరికి తోచిన రీతిన వారు డబ్బు యిస్తూనే ఉన్నారు. ఇంకాకూడా కావాల్సిందే! అందువలన ఎకరానికి యింత డబ్బనో, పుట్టిగింజలకు ఇంత డబ్బనో విధిస్తే సంతోషంగా ప్రతిరైతూ, రక్షణనిధికి యివ్వటానికి సంసిద్ధుడవుతాడు; అలాంటి ఉత్సాహాన్ని రేకెత్తించాలి. ఏమైనప్పటికీ, సవరణలతో కూడా అదనపు భూమిశిస్తుచట్టం అమలులోనికి వచ్చినట్లే!

తర్వాత, పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులకు సంబంధించిన బిల్లు, మోటారుబండ్లకు సంబంధించిన బిల్లు, యింకా ఇతర చిల్లరవి కూడా యీ సమావేశంలో చర్చకు వచ్చినాయి. అధికారవర్గం ప్రవేశపెట్టబడిన బిల్లులు కాబట్టి, కొంత తర్జన భర్జనలు అయినా, చివరకు, మెజారిటీ మాత్రం ప్రకారం ఆమోదింపబడి తీరతాయి; ప్రజాస్వామ్యం అంటే యిదేగా మరి!

48-వ పేజీ చూడండి



# ఉజ్జయిని పర్వం-9

ఆచార్యాణి గృహములో ప్రవేశించగా ఆమె మందహాసములో శ్రీకృష్ణదేవుని ప్రసన్ని నవ్వులో వెల్గులై మందిరమునం దంతట వ్యాపించినవి. ఆ వెల్గులలో అచ్చవెల్గువంటి మహానందుని ఆమె చూచినది. వీడు మహానందుడా! తాను కాశికలో ఎరిగియున్నవా డితడేనా! ఆమెకు ఆమెకే ఆశ్చర్యమైనది. అప్పుడు తాను ఎరిగిన మహానందుడు చామన చాయవాడు. ఇప్పుడు తాను చూచుచున్న మహానందుడు పిశంగచ్ఛవి మచ్ఛరీరుడు. అప్పుడు తాను ఎరిగియున్న మహానందుడు పల్లని గోష్పదమంత నడినెత్తిన కేశములు గలవాడు. ఈ మహానందుడు ముండిత శిరస్కుడు. యజ్ఞోపవీతము లేనివాడు. కౌపీనము మాత్ర మాచ్ఛాదనముగా గలవాడు. ఆచార్యాణికివి యన్నియు నేమియు ననిపించలేదు. వాని శరీర వర్ణ మట్టుల మారుటయే విచిత్ర మనిపించింది. ఆ శరీరము విచిత్రములైన కాంతుల నీనుచున్నది. అతడు నవ్వినచో అది సూర్యుడో, చంద్రుడో ఉదయించినట్లు కాంతులు గిలకొట్టబడుచున్నవి. అతని ముఖ మిప్పుడు శాంతమై, దివ్యమై వెల్గుచున్నది. తాను లోపల ప్రవేశించగా, నాతడు తన్ను చూచియు చూడనట్టు లుండెను. నవ్వుచుండెను. ఆ నవ్వుట తన్ను చూచుటగాని, పల్కరించుటగాని కాదు. అతని కన్ను లేమైనవి! అందరి చూపులు బహిర్గతములగుచున్నట్లు లేదు. తన్ను తాను అంతర్ముఖముగా చూచుకొనుచున్నట్టు లా చూపులు బహిర్గత బహిర్ముఖములయ్యి నట్లుగా కన్పించుటలేదు. వీడు ఎవడో, అంతర్ముఖుడు. వీడెవడో విచిత్రధీసంపన్నుడు. వీడెవడో బుద్ధిమత్ప్రతిభా సంపన్నుడు. కానిచో అతని ఆ రూప మిట్టులుగా నెట్లు మారిపోవును. ఆచార్యాణి వానిని పల్కరింతమనుకొన్నది. పల్కరించలేకపోయినది. భగవంతు డామె వెనుక నున్నవాడు గల్లున నవ్వెను. మహానందు డటు చూచెను. ఇట్లు లనెను.

యథా శివమయో విష్ణుః
ఏవం విష్ణుమయ శ్శివః
తథాంతరం నపశ్యామి......

భగవంతుడు మరల నవ్వెను. ఇదియంతయు ఆచార్యాణికి విడ్డూరముగ నున్నది. వాకిట పాఠములు వల్లెవేయుచున్న బ్రహ్మచారులందరును ఈ చోద్యమేమియో చూడగా గుమ్మమువద్ద గుమిగూడిరి. కొందరు లోపలకే వచ్చిరి. సుదాముడు శ్రీ కృష్ణదేవునకు ప్రక్కగా నిలబడెను. భగవంతు డాతనితో నిట్లనెను:

"ఆచార్య సుదామ!......'

సుదాముడు కన్నులెత్తి చూచెను.

"శ్రీ కృష్ణ! మహారాజ నరే! నీవును నన్ను అట్లు సంబోధింతువా!"



"రేపటినుండి నిన్ను మామాట విందువా అని నేడే నిన్ను ఆచార్యులను చేసినాను."

ఆచార్యాణి అంతటి ఆశ్చర్య సముద్రములో మునిగినది పైకి తేలినట్లయినది.

"శ్రీకృష్ణ!"

"ఏమి తల్లీ!"

"ఇతడు మహానందుడేనా!"

"వారినే అడుగుదము"

ఆచార్యాణి మహానందుని సంబోధించినది: "మహానంద! సోదరా!" అన్నది. అతడు పల్కలేదు. కన్నులెత్తి చూచెనే గాని, అది చూచుట కాదు. ఆత్మను ఆత్మ చూచుటవలె నున్నది అనుకొనినాడు సుదాముడు. ఆచార్యాణి వానిని సమీపించినది. చేతితో నతనిని తాకినది. "మహానంద! నేను ఆచార్యాణిని! పల్కవేమిరా!" యన్నది. మహానందుడు తనలో నేమో మాటలాడుకొనుచున్నట్లుండెను. ఆయన కీ మాటలు, ఈ సంబోధనము వినిపించలేదో! అతని కర్ణము లేమి చేయుచున్నవి? బాహ్య ప్రపంచమునుండి అతని సర్వేంద్రియములు నుపరతిని పొందినవో! అతడు అతడుకాదు.

"మహానందా!" అన్నది మరల ఆచార్యాణి. అతడు మరలను మాటాడలేదు. భగవంతునకు నవ్వాగలేదు. ఆయన నవ్వినాడు. 'తల్లీ! మహానందులవారికి మైమరపు కల్గినట్లున్నది. నేను పల్కరించి చూతునా! దారుకు డాయనను గుర్తుపట్టెను గాని, దారుకు నాయన గుర్తుపట్టలేదు. దారుకుడు 'స్వామీ!' యనగా, నాయనయు "స్వామి" అనినాడట! నాకు అదే విచిత్రమైనది. ఇంటికి వచ్చుటయు, ఆ కూర్చుండుటయు—అంతియే తప్ప, మమ్ముల నెవరిని ఆయన పల్కరించలేదు. ఇప్పుడు నేను పల్కరించి చూచెదను" అనెను. అని, మహానందుని సమీపించి, "ఓయి! మేలుకున్న ఆత్మా! ఓయి సంబుద్ధ!" ఓయి! సచ్చిదానందములు మూడును రూపమైనవాడ! ఓయి! అచ్చమైన మహానంద! నా పిలుపు వినుపించుచున్నదా! స్వామి! తమ రెవ్వరు! మహానందులేనా! మా తల్లి మిమ్ములను పల్కరించుచున్నది! వినిపించుటలేదా!......"

అన్నంతలో మహానందుడు కన్నులు తెరచెను. అంతవరకును మేలుకొనియున్నవాడు సమ్మోహితుడై, తెరచిన కన్నులుగా, నిద్రకు పడినట్టులా చూపులు భాసించెను. అతడు శ్రీ కృష్ణదేవుని చూచెను. మందహాసము చేసెను. "భగవన్! మేలుకొనినవానిని నిద్రపుచ్చుచున్నావు. నీవు సర్వసమర్థుడవు. సర్వ నియంతవు. నేను పశువను. నీవు కాపరివి. తండ్రీ! నన్నేల మరల ఈ మోహాటవిలో త్రిప్పెదవు. నన్ను నాలో నుండనిమ్ము. నన్ను నీలో నుండనిమ్ము. భగవన్! నిన్ను నేను జయించెదను. ఇదిగో! మరల మేల్కొనుచున్నాను. నేను ఎవ్వరను? పురుషుడను. అజుడను. శాశ్వతుడను. దేవతలును మహర్షులును నా ప్రభావము తెలియజాలకపోవుచున్నారు. దేవతలకు, మహర్షులకు ఆదికారణమైనవాడను నేను. నేను సర్వలోక మహేశ్వరుడను. అసమ్మూఢుడను. బుద్ధిని. జ్ఞానమును. అసమ్మోహమును. సత్యమును. దమమును. శమమును. సుఖమును. దుఃఖమును. భవమును. భావమును. భయమును. అభయమును, అహింసను. సమతను. తుష్టిని. తపస్సును. దానమును. యశస్సును. అశయస్సును. మునులు, మహర్షులు నావలన పుట్టుచున్నారు. నేను లేక ఈ లోకములు లేవు. సర్వ జగత్తులు నా వలన కల్గుచున్నవి. నా వలన ప్రవర్తించుచున్నవి. నేను సర్వభూతాశయ స్థితుడను. ఆదిమధ్యాంతములు నేను. ఆదిత్యులలో విష్ణువను. జ్యోతిర్గణములలో అంశుమంతుడైన రవిని. నక్షత్రములలో చంద్రుడను. మరుత్తులలో మరీచిని. వేదములలో సామవేదమును నేను. ఇంద్రులలో వాసవుడను నేను. ఇంద్రియములలో మనస్సును నేను. భూతములలో చైతన్యమును నేను. నేను రుద్రులలో శంకరుడను. యక్షరక్షస్సులలో విత్తేశుడను. పురోధసులలో బృహస్పతిని. సేనాములలో స్కందుడను. సరస్సులలో సముద్రమును. మహర్షులలో భృగువును. వాక్కులలో అక్షరమును. యజ్ఞములలో జపమును. స్థావరములలో హిమాలయమును. వృక్షములలో అశ్వత్థమును నేను. దేవర్షులలో నారదుడను నేను. గంధర్వులలో చిత్రరథుడను నేను. సిద్ధులలో కపిలుడను నేను. గుర్రములలో నేను ఉచ్చైశ్శ్రవమును. గజములలో నేను ఐరావతమును. నరులలో నేను నరాధిపుడను. దైత్యులలో ప్రహ్లాదుడను నేను. నేను మృత్యువను. లక్ష్మిని. కీర్తిని. వాక్కును. బుద్ధిని. ధృతిని. క్షమను. బలమును. మరియును నేను ఎవ్వరను? వృష్ణులలో వాసుదేవుడను. పాండవులలో ధనంజయుడను. మునులలో వ్యాసుడను. కవులలో శుక్రుడను....."

ఆచార్యాణి ఇక వినలేక పోయినది. 'అయ్యో!' అన్నది. శ్రీ కృష్ణ డామెను తన చేతులలోనికి తీసుకొనినాడు. మహానందు డింకను అట్టులే మాట్లాడుచు పోవుచున్నాడు. ఆచార్య సాందీపనియు, మహానందుని భార్యయు, వామాక్షియు వచ్చినారు. యప్పు డెవ్వరును వారిని గమనించలేదు. ఆచార్యు డీ విచిత్ర సంఘటనమును చూచుచు, వాకిటనుండే నిలబడి యుండిపోయెను. మహానందుని భార్య తన భర్తను చూచియు, గుర్తుపట్టియు, అప్రతిభురాలై పోయినది. వామాక్షి కాయనను చూడగా నేమి భావము కల్గినదో తెలియుటకే యక్కడ ఎడములేదు. ఆమె తండ్రియున్న దిక్కునకై పరుగు పెట్టుటయు, ఆమె తల్లి "అహహాబత!" యని మూర్ఛ కూరుటయు, ఆచార్యాణి, "తండ్రీ! వీడు పిచ్చివాడైపోయినా"డని శ్రీ కృష్ణునితో ననుటయు నొక్కసారిగా జరిగినవి.

శ్రీ కృష్ణదేవుడు మాటలు విని మందహాసము మాత్రము చేసినాడు.

ఆచార్య సాందీపని తనలో తానుగా, ప్రకాశముగా నిట్లనినాడు:

"ఎవరు పిచ్చివారైపోయినది? మనమైతివిన్ని వాడును, కృష్ణుడును మాత్రము కాలేదు."

మహానందు డిప్పు డెవ్వరివంకను చూచుటలేదు. తన్ను తానే చూచుకొనుచుండెను. తనలో తానే మాటలాడుకొనుచుండెను. వామాక్షి వచ్చి, తన్ను తాకగా, తన యొడిలో వ్రాలగా, సజాతీయ

—56 వ పేజీ చూడండి




త్తమరు కాబట్టి, ఆ బూమాలొచ్చి తాటోరు కాబట్టి .... నువ్వనాతిలాంటి ఆ కోడలు పిల్లతో ఈడుసుకొత్తున్నారు కాని నాలాంటి దయితే ఈ పాటికి ఇటో అటో తేల్చేసుకోకపోనా పెద్దమ్మగోరూ! అయినా నా కొరిక వేదుగాని ఏటి నూనుకునండి మన బుల్లెమ్మాయిగోరికంత గరవం ? తనంత వక్కానుక్క వేదనా ? తన పుట్టింటోరు పెద్ద బాగ్గెమంతులనా ? తమరేటంటే అనుకోండిగాని పెద్దమ్మగారూ! సిన్నబ్బాయిగోరు బుల్లెమ్మగోర్ని మరీ నెత్తి కెక్కించేసుకుంటున్నారు సూడండి .... మా కోడలు ఉంది మరి. మా గుంటడూ ఉన్నాడు... ఇలా అద్దు దాటనిత్తాడా మరి ; మొన్న మాపటేల అది ఇలాగే నామీద ఇంతంత గుడ్లు సేసుకుని ఎగర బోయింది .... అప్పుడు మా గుంటడు ఏం సేసే డనుకున్నారు ?'

'ఏం చేశాడే? ఏం చేశాడే ?' అని ఆతృతగా అడక్కుండా ఉండలేకపోయింది రుక్మిణమ్మ. అడుగుతూ తల పైకెత్తింది.

'అలా తల కదిపితే [illegible] గోరూ ! సేతికొచ్చిన సేను ఎక్కడో జర్రిపోనాది. తలొంచుకు కూకోండి మరి ....' అని కోప్పడింది కాములు. కోప్పడుతూనే విసుక్కుంది.

"అయినా ఓ పంరచ్చనా వల్లకాదా ? ప్రతి నారం తను పోసుకున్నప్పుడు మీ తలనీ యింత నూని మొక్కేడితే బుల్లెమ్మాయిగారి సేతు లడిపోతాయా కాబోలు .... నా నోరు సరిగా రాదు మరి ...'

రుక్మిణమ్మ పెద్ద నిట్టూర్పె విడిచింది.

'అయ్యో రాత ! అంత అదృష్టం ఉంటే, ఇంత

42-వ పేజీ చూడండి

# కొన్ని సమస్యలు

ఎమ్. సుందరి

స్త్రీలు అనగానే ఏం సమస్యలు వచ్చాయి? మగవారితో సమంగా చదువుకోటంలేదా? ఉద్యోగాలు చేయటంలేదా? రాజకీయాలలో పాల్గొనటం లేదా? ఎందులో తక్కువ? అనచ్చు. చదువుకొని, ఉద్యోగాలు చేసి, ఆస్తిలో భాగాలు పంచుకున్నంత మాత్రాన వీరి సమస్యలు తీరటంలేదు. నిజానికి ఆలోచించి చూస్తే, స్త్రీకి ప్రతిదీ సమస్యగానే తోస్తుంది.

అవకాశాలు కానీండి, ఆడపిల్లలు కూడా చదువుకోవాలన్న ఉద్దేశం కానీండి, మగవారితోపాటు సమంగా నేడు ఆడపిల్లల్ని చదివిస్తున్నారు. తగ్గట్టుగానే, వారు డిగ్రీలు పుచ్చుకుంటున్నారు కూడా. ఆడపిల్లలను కన్నతల్లి తండ్రులు వీలయినంతవరకు చదువు చెప్పించి, పెళ్ళి చేయాలనే ఉద్దేశంతోనే వీరిని చదివిస్తారు. ఈ చదువులవల్ల వివాహం ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా జరుగుతున్నదా అంటే, అదీ లేదు. వివాహమన్నది ఈ రోజుల్లో గట్టి సమస్య అయింది. కొందరు ఎక్కువ చదువుకున్నమ్మాయి అక్కర్లేదంటే, మరికొందరు డిగ్రీ ఉన్న పిల్లను తప్ప చేసుకోం అంటున్నారు. చదువుకు చదువు చెప్పించి, అన్నేసివేలు గుమ్మరించాలంటే ఆ తల్లితండ్రులకు ఎంత బాధో ఆలోచించండి. ఎక్కడో కాని, డిగ్రీతోపాటు కట్నం పైమెట్టు ఎక్కుతున్నదే కాని తగ్గటంలేదు.

పోనీ .... ఇన్నేసి వేలు అప్పుచేసి—ఇంత శక్యాత్తిగా పెళ్ళి చేయటం ఎందుకు? ఎటూ మగపిల్లలతో సమంగా చదువుకుంది, ఉద్యోగంలో చేర్పిద్దాం; అన్నీ సానుకూలం అయినప్పుడే వివాహం అవుతుంది అనుకోరు సరికదా, పైగా ఆ విషయం చిన్నతనంగా భావిస్తారు. ఇది పూర్తిగా తల్లిదండ్రుల తప్పు అనటానికే లేదు వారు ఉంటున్న వాతావరణమే అటువంటిది. బస్తీలలో అయితే ఆడపిల్లలు ఉద్యోగాలు చేయటం అనేది సర్వసాధారణమైనది. అదే ఓ .. మాదిరి ఊళ్లో అయితే ఉద్యోగం అనేది కష్టమైన పనే! ఎందువల్లనంటే ఇరుగుపొరుగు అడిగే చొప్పదంటు ప్రశ్నలకు సమాధానం చెప్పటం వీరి వశం కాదుగదా, వీరిని పుట్టించిన బ్రహ్మతరం కూడా కాదు. పెళ్ళి, [illegible] అమ్మాయికి పెళ్ళి చేయరా? ఉద్యోగంలో చేర్పించారేం? ఉద్యోగం చేస్తున్న పిల్లకు సంబంధం కుదరటం అంటే మాటలా? దీనికి అలవాటు పడ్డ అమ్మాయి సంసారం సరిగా నిర్వహించగలదా? ఇలాంటి ప్రశ్నలు సవాలక్ష. అందుకే నేడు చాలాచోట్ల డిగ్రీ ఉండి కూడా ఏమీలేకుండా వివాహం కోసం కనిపెట్టుకున్న ఆడపిల్లలు ఉన్నారు. ఇటువంటి వారి పట్ల డిగ్రీ నామమాత్రంగానే ఉండిపోతోంది. అందువలన ప్రయోజనం కాని, వివాహ సమస్య కాని తీరటంలేదు.

వివాహ సమస్య ఇలా ఉంది. ... పోనీ ఉద్యోగం సంగతి చూద్దామంటే అదీ ఆడపిల్లలపట్ల సమస్యగానే తయారయింది ఇప్పుడిప్పుడు కొందరు తల్లిదండ్రులు తమ పిల్లలు ఉద్యోగం చేయటానికి అంగీకరిస్తున్నారు. అదీ ..... ఎటువంటి పరిస్థితులలో అంటే ఉన్నవాళ్ళు అయితే ఎలాంటి అభ్యంతరము ఉండటములేదు. పోనీలే .... 'చదువుకొని, గోళ్ళు గిల్లుకుంటూ ఇంట్లో కూర్చుండే బదులు ఏదో చేస్తూ ఉంటుంది. ఆ చదువుకు సార్థకతా ఏర్పడుతుంది. వివాహం కుదిరినప్పుడే చేయచ్చు" అనుకుంటారు. ఈవిధంగా ఆ పిల్లలకు దోహదం ఇచ్చినందుకు వారిని అభినందించాల్సిందే!

కాని .. ఇక్కడా ఒక చిక్కు ఎదురవుతోంది. ఉన్న ఊళ్లో ఉద్యోగం అంటే ఇష్టపడుతున్నారు కాని, పొరుగూరు అనేప్పటికి అదీ—ఒక ప్రశ్నగానే ఉన్నది. తల్లిదండ్రులు పొరుగూరు అయితే ఎన్నో సమస్యలను ఎదుర్కోవలసివస్తుంది. స్త్రీ పురుషులు సమానం అని ఎంత ఘోష పెట్టినా, లోకం దృష్టిలో వారికన్న మనం కొంచెం తక్కువ అనే చెప్పాలి ఈ విషయంలో వాదించి లాభంలేదు; ఒక్క కంఠశోష తప్ప నేడు వారితో సమంగా సైకిలు తొక్కచ్చు. కారు డ్రైవ్ చేయచ్చు స్కూటర్ నడపొచ్చు అంతమాత్రం చేత లాభంలేదు. చూడండి. మగపిల్లవాడైతే ఒంటరిగా ఉండటానికి అంగీకరిస్తారు. వారిని [illegible] ఇంత బాధపడరు కూడా. అదే ఆడపిల్లలను ఒంటరిగా పంపి ధైర్యంగా ఉండలేరు.

ఆ మధ్య మా బంధువుల అమ్మాయిని కలుసుకున్నప్పుడు "ఇప్పుడు ఎక్కడన్నా వర్క్ చేస్తున్నావా?" అని అడిగితే — ఉన్న ఊళ్లో అయితే ఉద్యోగిని, పొరుగూరులో అయితే నిరుద్యోగిని అని సమాధానం చెప్పింది. నేను అలాగే చూస్తుంటే "సరి—సరి నీకింకా అర్థం కాలా! అన్నయ్యలతోపాటు డిగ్రీ తెచ్చుకున్నా, ఎంత చిన్న ఉద్యోగమయినా ఇక్కడే అయితే ఒప్పుకున్నారు కాని, పొరుగూరికి మాత్రం పంపనన్నారు. పైగా మగపిల్లవాడైతే పర్వాలేదు" అన్నారని సమాధానం చెప్పింది

ఆలోచించి చూస్తే అదీ నిజమేనేమో అని తోచింది మగపిల్లలయితే ఎక్కడికన్నా పోగలరు. అక్కడ ఎలాగయినా నిర్వహించుకో గలుగుతారు. ఎవరన్నా ఏదైనా అనటానికి కూడా ఆస్కారం లేదు. కాని అదే ఆడపిల్ల విషయంలో లక్ష సమస్యలు తలెత్తుతాయి. పెళ్లయి అదృష్టం కలిసివచ్చి భార్యాభర్త లిద్దరూ ఒకే ఊళ్లో ఉద్యోగస్తు లయితే బాధే లేదనుకోండి. వివాహంకాని ఆడపిల్లలకే కష్టం. ఆ అమ్మాయి ఎంత మంచిదయినా, అంటే ఇంటివాళ్లను సమాధానపరచేటప్పటికి తల ప్రాణం తోకకు వస్తుంది. "మీ ఇంటిపేరేమిటి? మీవాళ్లందరికీ పెళ్లిళ్లు అయినయ్యా? నీకు కూడా ఎక్కడన్నా సంబంధాలు చూస్తున్నారా? నిన్ను ఒంటరిగా పంపారేం? అమ్మాయి ఇలా అడిగానని ఏమనుకోకు" అని ఇలా ఏవేవో ఆరాలు తీస్తారు ఆ అమ్మాయి కాస్త నెమ్మదయింది అయితే వాళ్లను సంతృప్తి పరుస్తుంది. కాని కొంచెం నిక్కచ్చిగా సమాధానం చెప్పేదే అనుకోండి. ఇహ దానితో ఉన్నవీ—లేనివీ 'కల్పించి' ప్రచారం చేస్తారు. అలాంటివారు అడుగడుగునా ఇరుగు పొరుగు అవహేళనలను ఎదుర్కోవాల్సిందే! అదే మగపిల్లవాడు అయితే ఇన్ని ఆరాలు తీయరు. ఏదో మనకు కాస్త తోడుకన్నా ఉంటాడు అనుకుంటారు. ఒక్కమాట—ఉద్యోగం చేసే ఆడపిల్లలకు ప్రభుత్వంవారు తగినన్ని సదుపాయాలు కల్పిస్తే బాగుంటుంది. ఈ విషయంపై తోటి సోదరీమణులు ఏమంటారో?






## బంధువులూ-బంధాలూ

కుమారి బి. యస్ ఇందిరాదేవిగారు వ్రాసిన బంధువులూ, బంధాలూ—సహజముగానే యున్నది ఇది పెండ్లిండ్లు చెడగొట్టే ఆడవాళ్ళకు ఎంతో నీతిబోధగా ఉపకరిస్తుంది

ఇందులో 7వ పేరాలోని 6వ వాక్యములో "ఆమెకు ఒక్క కూతురే కావటంవల్ల, వెనకాముందు ఎవరూ లేకపోవటంవల్ల (భర్తగారితోసహా) ఒక బి. ఏ కిచ్చి చేశారు" యిది అర్థరహితంగా ఉన్నది. "ఒక బి. ఏ ప్యాసయినతనకిచ్చి వివాహము చేశారు" అని నా ఉద్దేశ్యం

కృష్ణమూర్తి (కాంగో)

*　　*　　*

మరికొన్ని మంచి ఉదాహరణలిచ్చి విపులీకరిస్తే బాగుండేది అయినా సహజత్వానికి దగ్గరగా వ్రాసి, పాఠకుల మనస్సుకు హాయిని చేకూర్చారు ఈ రోజుల్లో "బాంధవ్యం, ఆత్మీయత" బంధువుల్లో కన్నా, స్నేహితుల్లో ఎక్కువగా కనిపిస్తుందని నా అభిప్రాయం.

శ్రీమతి జి జయలక్ష్మి (తుంగతుర్తి)

*　　*　　*

ఈ వ్యాసం లోగడ ప్రచురించిన బంధువులు—ఇబ్బందుల సశేసమే గాని బంధాలకి, అనుబంధాలకి తావు తక్కువ

బంధుప్రేమ, సోదర ప్రేమ చవిచూడాలంటే సొంత బంధువులే కావవసరంలే దన్నారు. అది పొరపాటు ఉదాహరణమునకు, విదేశాలకు పోయారు; అప్పటివారు చూపేది సోదరప్రేమే గాని బంధుప్రేమ ఏమాత్రం కాదు ప్రయాణికులు చూపేది ఇటువంటిదే బంధుప్రేమ కేవలం ఆత్మబంధువులే చూపగలరు

శ్రీమతి భవాని వెంకట్రామయ్య (రాజోలు)

## చదువుకొన్నవారికేనా గర్వం?

మాటలు అనేవారు కొందరు, వారుకూడా విద్యావంతులనే విషయం మరచి చదువుకొనే వారిని, చదువుకున్న వారినికూడా ఆక్షేపిస్తారు; హేళన చేస్తారు. ఇలాగే పోయిన సంవత్సరం ఒకావిడ నన్నుకూడా అన్నది. ఏమిటంటే ఒకనేల ఎంత చదువుకుంటే మాత్రం అంత మిడిసిపాటా! మహా ఈవిడ గాబట్టి చదువుకుంటున్నది పేరంటానికివస్తే ఏమి! అని వ్యాఖ్యానం. మొదటినుండి కేవలము చదువుకొన్నవారిని ఆక్షేపించువారు ఈ వ్యాసం చదివింతర్వాతైనా ఆ విధంగా ఆక్షేపించరని తలుస్తాను గర్వము అనేది చదువుకొననివారికి కూడా ఉంటుందని సోదరి చక్కగా వివరించారు

కుమారి సుమిత్ర, కుమారి సహోర్తనమ్మ (కోట)

*　　*　　*

సాధారణంగా ప్రతిస్త్రీలో ఉన్న దుర్గుణం ఇదే, 'అబ్బో ఆవిడగారు మనతో కలుస్తారా! చదువుకొన్నదిగదూ; అందుకే ఆ గర్వమున్ను, మిడిసిపాటున్నూ. అయినా ఈ కాలంలో ఆడపిల్లలకు చదువులు చెప్పిస్తే అంతేనమ్మా!' అంటారు లక్ష్మిగారు చెప్పినట్లు చదువుకొన్నంత మాత్రాన గర్వం ఉద్భవించదు. అది వారివారి మనస్తత్వాలపై, వారు పెరిగే వాతావరణంపై ఆధారపడి ఉంటుంది కనీసం ఈ వ్యాసం చదువుకొన్న స్త్రీలైనా ఇకముందు అలా తప్పు అభిప్రాయాన్ని చెంది తోటి సున్నిత హృదయులైన స్త్రీల మనస్సులనునొప్పించకుండ మాట్లాడగలరని భావిస్తూ ఆశిస్తున్నాను చదువుకోని వారి సంగతి సరేసరి; చదువుకొన్నవారు కూడా అలా తప్పుడభిప్రాయాన్ని పొందడం శోచనీయం.

ఎస్. రత్నమాల (భిలాయి)

## సభ్యత

ఒక్క సంఘటనతో వ్యాసం వ్రాయటం ఏమీ బాగా లేదు. బహుశా "పురుషులు" అనేవారికి "సభ్యత అనేది ఉండదని సిద్ధాంతమేమో! నిజానికి స్త్రీలలో మాత్రం ఎంతమంది సభ్యతగా ప్రవర్తిస్తున్నారు. ? వ్యాసంలో వ్రాయబడిన ఘట్టాన్ని రచయిత్రిగారికి వారి స్నేహితురాలు ఉత్తరంద్వారా తెలిపిందట! ఇటువంటి విషయాలను నలుగురితో చెప్పుకోవడమె సభ్యతేమో, వారి దృష్టిలో! డాక్టరు అన్నది అసభ్యం కావచ్చు. అయితే అది అతనితోటే అంటే సరిపోయేది కదా! సభ్యత అనేది చిన్నప్పటినుంచీ రావాలి

ఇ ఉషాహేమచందర్ (హనుమకొండ)

*　　*　　*

సినిమాహాలులో ఆడవారిని ఏదో వింత పశువును చూసినట్టు ఎగాదిగా చూడడము, రోడ్డుమీద వెళుతుంటే పళ్ళు ఇకిలించటము మొదలగు అసభ్య ప్రవర్తనలవలన యువతులకు ఎంతో ఇబ్బందిగా ఉంటుంది నొప్పించక తానొవ్వక అను సూక్తి ననుసరించి ఎదుటివారి మనస్సు అతో చెలగాటమాడక ఎంతో సభ్యతగా మాటలాడేవారిని ఎంతో గౌరవించా లనిపిస్తుంది

కె. సుశీల (సూర్యాపేట)

# వంటలు

## రాగిబుట్టలు

| | | |
|---|---|---|
| రాగిపిండి | ... | 1 అరాకు |
| కొబ్బరికోరు | ... | ¼ కప్పు |
| బెల్లము | ... | 7తులాలు (లేక 3 అవున్సులు) |
| ఏలక్కాయలు | ... | 3 |
| ఉప్పు | ... | చిటికెడు |
| నీరు | ... | ¼ కప్పు |

బెల్లము నీటిలో కలిపి, ఉప్పు, కొబ్బరికోరు చేర్చాలి. ఏలక్కాయలు పొడిచేసి కలపాలి. ఆ తర్వాత రాగుల పిండితో కలిపి సిద్ధంగా ఉంచుకోవాలి. అరటి ఆకులు సుమారు 6 అంగుళాల చదరాలుగా కోసి, కొద్దిగా నెయ్యిరాసి ఒక స్పూనులో పట్టేటంత పిండిని ఆకు మీద వేసి వత్తాలి; ఒక చెంచా నూనె వేడిచేసిన పెనం మీద పిండి వత్తిన ఆకును బోర్లాపరచి కాలిన తర్వాత ఆకు తీసివేసి అవతలవైపు కూడా కాల్చాలి.

*　　*　　*

ఇది మీకు తెలుసా?: బంగాళా దుంపలు ఉడకపెట్టాలంటే మొదట నీళ్ళు మరిగించి అందులో దుంపలు వెయ్యాలి. కాని, ముందస్తుగా నీళ్ళు పోసి దుంపలతో పెడితే అంత రుచిగా ఉండవని - ఈసారి చేసి చూడండి.

*　　*　　*

కూరలు ఉడకబెట్టేటప్పుడు మరుగుతున్న నీళ్ళలో కాస్త ఉప్పు కూడా వేస్తే ఆసక అవి మంచి రుచినిస్తాయి.

*　　*　　*

టీ కాచిన తేయాకుతో గిన్నెలు కడుగుతారు చాలామంది. అది చెడ్డది కాదు. గిన్నెలు శుభ్రంగా ఉంటాయి.



# మనమూ - మనదేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

# డువోడీనవ్రణములు

జీర్ణకోశములో కొన్ని భాగములు విస్తరించి ఉంటవి మరికొన్ని గొట్టములలాగా ఉంటవి జీర్ణకోశంలో మొదటి భాగము నోరు అది విస్తరించి ఉండే భాగము తరువాత వచ్చేది ఈసొఫెగస్ గొట్టమువంటి భాగము ఈసొఫెగస్ చివరన ఉండే జఠరాశయము మళ్ళీ విస్తరించి ఉండే భాగము జఠరాశయము క్రింది కొనన ఉండే పైలోరిక్ స్ఫింక్టరు (Pyloric Sphincter) నుండి చిన్నప్రేగు ఆరంభమవుతుంది. ఇది గొట్టము వంటి భాగము. మనిషి జీవించి ఉన్నప్పుడు చిన్న ప్రేగు పొడుగు అయిదు మీటర్లు ప్రేగును ఆయుర్వేద పరిభాషలో అంత్రము అంటారు చిన్న ప్రేగును క్షుద్రాంత్రమనీ, పెద్ద ప్రేగును స్థూలాంత్రమనీ అంటారు చిన్నప్రేగుకూ, పెద్ద ప్రేగుకూ నిర్మితిలోనూ, ధర్మములోనూ కూడా ముఖ్య భేదములు ఉన్నవి

చిన్న ప్రేగులో (1) డువోడినం (2) జెజునము (3) ఇలియము అని మూడు ప్రధాన భాగములు ఉన్నవి అందులో డువోడినము గుర్రపు నాడము ఆకారము కలదిగా ఉంటుంది కుడివైపున దీని మొన లివరు క్రిందివైపుకు అంటి ఉంటుంది కొంత భాగము కుడి కిడ్నీని అంటి ఉంటుంది లివరు క్రిందవైపున ఉండే పిత్తాశయము (Gall Bladder) కూడా డువోడినమును అంటిఉంటుంది డువోడినము వంపులో పేంక్రియస్ గ్రంధి ప్రథమభాగము ఉంటుంది. ఈ అవయవము లన్నింటికీ మధ్య నైతిక సంబంధము లున్నవి అందువల్ల నాభికి పైగా బాధ ఆరంభించినప్పుడు ఏ అవయవంలో రోగస్థితి ఏర్పడి ఆ బాధ కలుగుతున్నదో నిర్ణయించడం కష్టసాధ్యమైన పని

డువోడినం గోడలో, తక్కిన క్షుద్రాంత్ర భాగములలో లాగే, నాలుగు పొరలున్నవి. అవి పైనుంచి లోపలకు వరసగా (1) సీరస్ పొర (2) కండరముల పొర (3) మ్యూకస్ పొరకూ, కండరముల పొరకూ మధ్య ఉండే పొర, (4) మ్యూకస్ పొర ఈ మ్యూకస్ పొరలో చాలా గ్రంధు లున్నవి అవి ఎక్కువగా పైలోరస్ సమీపంగా ఉండే డువోడిన భాగములలో ఉంటవి ఇవి, క్షారగుణం కల రసములను స్యందిస్తవి. డువోడినంలోకి పసరూ, పేంక్రియస్ గ్రంధిలో తయారయ్యే రసమూ వాటి వాటి నాళముల ద్వారా వచ్చి చేరుతవి ఇవీ క్షారగుణం కలవే.

డువోడినంలో జరిగే జీర్ణ కార్యక్రమమంతా ఇక్కడ ఉండే యీ క్షార వాతావరణం మారకుండా ఉన్నప్పుడే జరుగుతుంది. జఠరాశయంలో దీనికి కేవలం వ్యతిరేకంగా జరుగుతుంది. అక్కడ అమ్ల గుణం గల వస్తువులుంటవి ఈ రెంటికీ మధ్య సరిహద్దులాగా పైలోరస్ ఉంటుంది డువోడినంలోకి అమ్లగుణం గల వస్తువులు ప్రవేశించినా, జఠరాశయంలో క్షారగుణం గల వస్తువులు ప్రవేశించినా, ఆ ప్రదేశములలో ఉండే మ్యూకస్ పొర చిట్లి నెరి విచ్చుతుంది. అందులో ఏర్పడిన పగుళ్ళమీద, విరుద్ధములయిన పదార్థములు పడ్డప్పుడు అవి మరీ పెద్దవై చివరకు అల్సర్లుగా పరిణమిస్తవి ఈ అభిప్రాయమే చాలా కాలం వైద్య ప్రపంచంలో వ్యాపించిఉండేది కాని, ఈ పరిస్థితులకు తోడుగానో, ప్రత్యేకంగానో మానసిక వ్యథలు జఠరాశయంలోనూ, అంత్రభాగముల లోనూ ఉండే కండరములలో సమన్వయమూ, క్రమమూ లేని సంకోచ వ్యాకోచములను కలిగించి, మ్యూకస్ పొరను చిట్లింపజేసి, ఈ అల్సర్లను కలిగిస్తవనే భావన వ్యాప్తిచెందుతున్నది. నైరిక విజ్ఞానము అధికమైనకొద్దీ వ్యాధులకూ, మనఃస్థితికీ ఉండే సంబంధము బలవత్తరమైనదని తెలుస్తున్నది మనస్సు ప్రభావం, ఒక్క జీర్ణకోశ వ్యాధులకు మాత్రమే పరిమితమై ఉండదు. శరీరంలో అన్ని భాగములమీద, ముఖ్యంగా సింపథెటిక్, పేరా సింపథెటిక్ నరములచే శాసించబడే అనిచ్ఛాధీన కండరములు, గ్రంధులూ ఉన్న అవయవము లన్నింటిమీద, మనస్సు ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తూ ఉంటుంది ఈ సందర్భంలో వెనుకటి సంచికలలో, పేరా సింపథెటిక్, సింపథెటిక్ నరములను గురించి వ్రాసిన విషయాలు పాఠకులు మననం చేసుకోడం అవసరం.

డువోడినంలో అల్సర్లు స్త్రీలలో కంటె పురుషుల్లోనే అధికంగా ఏర్పడతవి అయితే ఈ పరిస్థితి, క్రమంగా మారిపోతున్నది ఒకప్పుడు సంసార పోషణ, సంరక్షణ—ఆ విషయంలో బాధ్యత పురుషులకే ఉండేది ఈ బాధ్యత నిర్వహించడానికి ఏదో వృత్తియో, వ్యాపారమో కావాలి. ఆధునిక కాలంలో జీవన—రంగం కేవలం పోటీమయంగా ఉంది ఉన్నతాశయాలూ, అధమ పరిస్థితులూ, అధికమై "మనకు విజయం ధ్రువ"మనేవారి సంఖ్య తగ్గిపోతున్నది చంచలచిత్తులు, స్వామిద్రోహం, మిత్రద్రోహం అధికమై హృదయక్షతులు అధికమౌతున్నవి ఈవిధంగా, ఎన్నో విధాలుగా మనస్సు క్షుభితమవుతున్నది స్త్రీలు స్వతంత్రులైనకొద్దీ బాధ్యతలు వారి నెత్తిన సమానంగా పడుతున్నకొద్దీ, నైసర్గికమైన క్షమా—తత్వాన్ని, శాంతి ప్రియత్వాన్ని, క్షేమవాంఛనీ వదలి, వారూ జీవన రంగంలో పోటీలో ప్రవేశించినకొద్దీ, వారిలోనూ జీర్ణాశయ వ్యాధులు అధికం అవుతవని సందేహించడానికి వీలున్నది. ఆందోళన, అశాంతి అనే దేవతలకు బ్రతుకులు దేవాలయాలయినకొద్దీ, అంత్రప్రదేశాల్లో అల్సరు స్వయంభూ—లింగాల్లా ఉద్భవించి వృద్ధి చెందుతవి

డువోడినంలో అల్సరు, జఠరాశయంలో కంటె ఎక్కువగా తటస్థిస్తూ ఉంటుంది సాధారణంగా డువోడినం— అల్సరు పైలోరస్‌కు రెండు మూడు అంగుళముల దూరంలో ఏర్పడుతూ ఉంటుంది. ఇందుకు కారణం, జఠరాశయంలో అమ్లత అధికమైనప్పుడు ఆ అధికామ్ల పదార్థములు ఈ ప్రదేశంమీదనే ముందుగా పడడం కారణం కావచ్చు. జఠరాశయంలో అనేక అల్సర్లు ఏకకాలంలో ఏర్పడవచ్చు త్వరగానే మానిపోనూ వచ్చును కాని డువోడినంలో అల్సరు సాధారణంగా ఒకటిగానే ఉంటుంది దీనిలో కేన్సరు లక్షణములు ఉండవు. అల్సరు చుట్టూ ఉండే ప్రదేశం గుండీలాగా గుండ్రంగా, గట్టిగా ఉంటుంది. డువోడినంలో అల్సరు ఏర్పడడానికి సరియైన కారణము ఇదీ అని యింకా తేలలేదు నోటిలోనూ, శరీరంలో యితర భాగములలోనూ క్రిమిదోషము ఉండి, ఆ క్రిములు రక్తం ద్వారా డువోడినమును చేరినప్పుడు ఈ అల్సర్లు ఏర్పడవచ్చునని కొందరి భావన.

డువోడినంలో అల్సరు ఏర్పడగానే, దాని అంకురావస్థలో, కడుపు నిండుగా ఉండడం, ఒకమాదిరి అసౌఖ్యం, ఏర్పడుతుంది. భోజనంచేసిన మూడు గంటల తరువాత ఈ విధంగా ఉంటుంది. జఠరాశయ వ్రణములలో యిట్లు కాదు భోజనం చేయంగానే గాని, కొద్ది కాలానికి గాని అక్కడ బాధ ఏర్పడుతుంది క్రమంగా ఈ బాధ దుర్భరమైన శూలగా పరిణమిస్తుంది అల్సరున్న స్థితినిబట్టి భోజనంచేసిన తరువాత ఒక గంట నుండి 4 గంటలలోగా, అలారం కొట్టినట్లుగా ఈ బాధ ఏర్పడి తీరుతుంది మొదట్లో ఈ బాధ చాలా ఎక్కువగా తిన్నప్పుడు మాత్రమే కలుగుతుంది. జఠరాశయంలో అర్ధ జీర్ణమైన ఆహారం, డువోడినంలోకి పోయినప్పుడు అల్సరుమీద ఆ ఆమ్ల పదార్థములు పడి, మండి ఈ బాధ ఏర్పడుతుంది భోజనానికీ, బాధకీ మధ్య ఉండే కాలం, జఠరాశయంలో ఆహారం ఎంతసేపు ఉంటున్నదీ అనే విషయంమీద ఆధారపడుతుంది సాధారణంగా భోజనంచేసిన రెండు మూడు గంటల తరవాత ఈ బాధ ఏర్పడుతూ ఉంటుంది. ఉదరభాగంలో ఎప్పుడు బాధ ఏర్పడినా రోగి ఆహారానికీ, ఆ బాధకూ ఉన్నసంబంధాన్నీ, ఆహార—బాధలకు మధ్య ఉండే కాలమును గమనించి వైద్యుడికి తెలియచేయాలి పగలు ప్రతి మూడు గంటలకూ ఏదో తింటూ ఉంటాము. రాత్రి భోజనం అయిన తరవాత ఏ ఆహారమూ తీసుకోము అందువల్ల రాత్రి రెండు మూడు గంటలకు రోగి, విపరీతమైన బాధతో గంట కొట్టినట్లుగా, బాధతో నిద్రాభంగమై లేచి కూర్చుంటాడు ఆ బాధ ఏమైనా తింటే తగ్గుతుంది. అందువల్ల వీటికి "ఆకలినొప్పులు" అనే పేరు వచ్చింది. అల్సరువల్ల, ఆహార — గతికి ఆటంకం కలిగే పరిస్థితులు ఏర్పడినప్పుడు తప్ప వాంతి సాధారణంగా ఏర్ప

39 — వ పేజీ చూడండి

SISTA'S-SG-179A TEL



# టినోపాల్ మాత్రమే బట్టలను అదనంగా తెలుపు చేస్తుందని తెలివైన తల్లులకు తెలియును!



టినోపాల్ యిచ్చే మెరుగును పెట్టండి

తళతళలాడే తెల్లని యూనిఫార్మ్ తొడుగుకొన్న మీ పిల్లలను చూడడానికి ఎంతో ముచ్చటగా ఉంటుంది తెల్లని దుస్తులకు కళ్లు మిరుమిట్లు గొలిపే అదనపు తెల్లదనము కలిగించుటకే టినోపాల్ ప్రత్యేకముగా తయారు చేయబడినదని తెలివైన తల్లులకు తెలియును.

ఎంతో పొదుపు కూడ

టినోపాల్ మెరుగు పెట్టుకొనుటకు మీకు ఏమీ ఎక్కువ ఖర్చు కాదు. ఒక వార్పుకు బట్టలను తెల్లగా చేయుటకు టీ చెంచాడో నాలుగోవంతు టినోపాల్ మాత్రమే చాలును. టినోపాల్ యిచ్చే తెల్లదనము శాశ్వతముగా పోదు; మీరు బట్టలను ఉతుక్కొనే ప్రతిసారి టినోపాల్‌ను ఉపయోగించ నక్కరలేదు.)

జ్ఞాపకముంచుకోండి—




టినోపాల్ జె ఆర్ గెయిగీ ఎస్ ఎ బాసిల్, స్విట్జర్లెండ్ వారి రిజిష్టరు చేయబడిన ట్రేడ్ మార్కు.

ఉత్పత్తి దారులుగా
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా





డిస్ట్రిబ్యూటర్లుగా
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్ట్ బాక్స్ 965, బొంబాయి-1 బి ఆర్




## జరిగినకథ

దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావు కుమారుడు; భార్య అనసూయమ్మను హింసిస్తూ ఉంటాడు దుర్గాప్రసాద్ కుమార్తె శ్రీదేవి జగన్నాథం వద్ద సంగీతం నేర్చుకుంటూ ఉంటుంది సంపన్న కుటుంబీకుడే అయినా దుర్గాప్రసాద్ పిల్లలను, భార్యను ఉపేక్షించి, త్రాగుడూ, స్త్రీలోలతలకు అలవడతాడు. ఒకనాడు అనసూయమ్మను పొడిచి గాయంచేసి వెళ్లిపోతాడు. గాయం మానాక, విశ్వేశ్వరావుగారి విధవప్ప చెల్లెలు; సుభద్రమ్మ అనే ఆమెను శ్రీదేవికి అత్తయ్య అని పరిచయం చేసింది

సుభద్రమ్మ తను మళ్ళీ రెండురోజుల్లో వస్తానని చెప్పి, జయమ్మదగ్గర సెలవు తీసుకొని, శ్రీదేవితో కలిసి అనసూయమ్మ దగ్గరికి వెళ్లింది శ్రీదేవి వారిద్దరికీ జరిగిన సంభాషణబట్టి, సుభద్రమ్మ తమకు దూరపు చుట్టమనీ, ఇన్నాళ్లూ వాళ్లు మద్రాసులో ఉంటున్నారనీ, రెండేళ్లక్రిందట సుభద్రమ్మ భర్త చనిపోయాడనీ, అందువలన మద్రాసు వదిలి వాళ్ళు రాజమండ్రీ వచ్చేశారనీ, ఇక్కడ వాళ్లకు ఇల్లూ, పొలం ఉన్నాయనీ తెలుసుకుంది.

భూములమీద వచ్చేఆదాయం ఇవ్వకుండా రైతులు అల్లరి పెట్టడంవల్ల విశ్వేశ్వరరావుగారి సహాయం అర్థించటానికి వచ్చిందామె విశ్వేశ్వరరావుగారు ఆమె తరఫున కేసు నడిపించటానికి ఒప్పుకున్నారు. సుభద్రమ్మకు ఆర్యాపురంలో ఒక చిన్న ఇల్లు ఉంది. ఇంతకుముందు అది అద్దె కిచ్చేవారు. కాని, మద్రాసు కాపురం ఎత్తేసి, తనూ, ఇరవైఏళ్ల మరిదీ, ఇద్దరు పిల్లలతో రాజమండ్రీ వచ్చేసి తమ ఇల్లు ఖాళీచేయించి తామే ఉండనారంభించారు భూముల విషయంలో తను స్త్రీ కాబట్టీ, మరిది చిన్నవాడవడంవల్లా రైతుల్ని లొంగదీయటం కష్టమని, తమకు దూరపు బంధువైన విశ్వేశ్వరరావుగారి పలుకుబడి వినియోగించదల్చింది

సహజంగా ఆమెకు ఎదుటివారిని మంచి చేసుకోగల నేర్పుంది దానికితోడు జయమ్మకు బంధుప్రీతి హెచ్చు. అందువలన జయమ్మ, సుభద్రమ్మకు అన్నివిధాలా సాయపడదల్చింది. ఆ ఇంట్లో ఎవరి మనస్తత్వానికి అనుగుణంగా వారితో మాట్లాడి, సుభద్రమ్మ తన మొదటి రాకలోనే అందరి మనస్సులూ ఆకర్షించింది

శ్రీదేవితో ఎన్నో సరదా కబుర్లు చెప్పింది. ఆమెకు కూడా వీణ వాయించడంవచ్చు. అల్లికలూ, కుట్లూ, ఎంబ్రాయిడరీ మొదలైనవన్నీ తనకి వచ్చుననీ, శ్రీదేవికి అన్నీ నేర్పుతానంది. ఏ యే గుడ్డలమీద ఎలాటి డిజైన్లు వెయ్యాలో, ఏ యే వస్తువులు ఎలా అలంకరించాలో మొదలైన విషయాలు చెప్పి, శ్రీదేవికి వాటన్నిటిమీద ఉత్సాహం కలిగించింది సుభద్రమ్మ తన ఇంట్లో కుట్టుమిషను

—35 వ పేజీ చూడండి



సిరిపాలెం

రాజమండ్రి నించి గోదావరి కట్ట మీద పదిమైళ్లు వెళ్లి అక్కడ కట్టనించి మళ్లీ దగ్గిర దగ్గిర పది హేనుమైళ్లు వెడితే వస్తుంది సిరి పాలెం.

కాలినడకన ప్రయాణం చేసే వాడికి ఊరింకా కోసెడు దూర ముందనగా ఒక దివ్యదర్శనం అవు తుంది. తూర్పు దిక్కుకి ఎర్రగా పచ్చగా తెల్లగా సుద్ద కొండలు. మరి రెండు పక్కలికి చిన్న చిన్న ఎర్ర కంకరకొండలు. మధ్యనంతా పచ్చని పచ్చిక బయళ్లూ, చేలూ, చెట్లూ చేమలు. మధ్య నెక్కడో చిన్న ఊరు. సృష్టికర్త అద్భుతమైన పంచ రంగుల పానపాత్ర ఒకటి సృష్టించి ఇక్కడ మరచిపోయి ఉండాలి. ఆ పాత్రకి మధ్య నుంచిన చిన్న బంగా రపు పువ్వులా ఊరు.

అరుణోదయ సమయంలో ఊగు ప్రవేశించినవాడు ఏ జన్మంలోనో మహోత్సవం చేసుకొని ఉండాలి. అది ఒక మహత్తరానుభూతి.

ఎక్కడ చూసినా కెంపుల కాంతులే! పల్లవాధర అరుణిమలే! గోరంటాకు దాల్చిన లేత తమల పాకుల చేతులే! మందారాలే! దానిమ్మగింజలే!

ఎర్రనిసూర్యకాంతి రంగురంగుల సుద్దకొండల మీదనుంచి ప్రసరిస్తూ ఆ ప్రదేశాన్నంతటనీ గరంజి తం చేస్తుంది. తక్కిన రంగుల నన్నింటిని జీర్ణం చేసుకుని, మిట్ట మధ్యాహ్నం [illegible]

**కళ్లు మిరుమిట్లు గొలిపే పురాణాల్లోని దేవతలంతా శరీర కాంతుల్ని వెద జల్లుతూ ఇక్కడ విహారాని కొచ్చారా? అనిపిస్తుంది.**

సంజీవి పర్వతం హనుమంతుడు ఆకాశంలోంచి తీసికెళ్లుతూంటే కొన్ని ముక్కలు విరిగి ఇక్కడ పడ్డాయేమో ననిపిస్తుంది. పిట్టలారే సాయం త్రంవేళ చూశామా— బంగారు మలామా సాయం సూర్యుడు జల్లే బంగారు కళ్లాపునీళ్లు పులుము కున్న కొండచరియల మనోహర దృశ్యం అతి లోకోత్తర మైనది. ఆ దృశ్యసౌందర్యాన్ని కొన్ని మాటల్లో ఇముడుద్దా మనుకోడం హాస్యాస్పదం.

ఆనకట్ట కట్టి గోదావరిని కాలువల్లోకి మళ్లించి ఆంధ్రదేశాన్ని ధాన్యప్రదాయిగా చేస్తున్న రోజులవి. అప్పటికింకా సిరిపాలేనికి సిరిపట్టలేదు పేరులో తప్పించి. ధాతేశ్వరం కరువులధాటికి బాగా దెబ్బతిన్న ఊళ్లల్లో అదొకటి. ఆనాటికింకా తేరుకోలేదు. ఊరు చూడ్డానికి పచ్చగానే ఉంటుంది కాని కాలు వలు రాకముందు నీటివసతి సరిగా లేకపోవడంతో పచ్చిక బయళ్లు ఎక్కువా, పంటచేలు తక్కువాను. ఊళ్లో పశుసంపద మాత్రం బాగానే ఉంది మహాఉంటే మాటయాశ్లో గడుప ఉంటుంది ఊళ్లో

ఆ రోజుల్లో ఆ ఊళ్లో కొంచెం స్థితి పోమతూ కొద్దో గొప్పో అక్షరజ్ఞానం కలిగిన కుటుంబాలు సూరపరాజుగారిదీ, కరణం సూర్యనారా యణగారిదీను సూరపరాజుగారి ఇంటిపేరు ఆచంట వారు ఇంటినిండా ఇంటెడు బలగం. నాలుగు తరాల వాళ్లు వాళ్ల బామ్మ అక్కగారొకావిడ ఉండేది ఎనభైఏళ్లు దాటినా కళ్లూ పళ్లూ గట్టిగాఉండి శనివారాలకీ, ఏకాదశులకీ జంతికల దొంతరలు ఫలహా రాలు చేస్తూనూ ఆవిడపేరు తెలిసినవాళ్లు చాలా తక్కువ. అందరూ ఆవిణ్ణి పెద్దబామ్మగారని పిలు స్తుండేవారు. ఆవిడ అందరితోనూ చాలా ఆప్యా యంగా మాట్లాడేది ఎవరేనా ఇంటికి వస్తే ఆవిడ పలకరించడం తీరు "అదేవిట్రా ఆఆఆ అక్కడే ఉండిపోయావూ ఊ ఊ ఊ ? లోపలకొచ్చి కూచోరా ఆఆఆ ?" ఎవరేనా పైవాళ్లు వింటే, ఈవిడనించే గోదావరిజిల్లాలవాళ్లు దీర్ఘాలు అలవాటు చేసుకున్నారు అనుకునే అవకాశం లేక పోలేదు అప్పటికింకా ఆవిడ పదిమందికి వండి వడ్డించగలిగిన దృఢకాయంతో ఉండేది ఆవిడ రోజుల్లో (ఆయనున్నప్పుడు) ఆవిడ బంధువుల్నీ అతిథుల్నీ చేసినమర్యాద అందరూ చెప్పుకుంటూ ఉంటారు అయితే వాళ్లది ఉన్న సంసారం కాకపోవ డం, ఉన్న ఒక్కకొడుకూ అక్కరకు రాకుండా సన్యాసుల్లో కలిసిపోవడంతో, ఆవిడ చెల్లెలి మనవ డైన సూరపరాజుగారింటికి చేరవలిసొచ్చింది, ఆ యిల్లొక దివాణంలాగుండేది కనక ఇంక సూరప రాజుగారి తల్లి లక్ష్మమ్మగారు ఆవిడ ఆ ఇంట్లో వాళ్లందరికీ అదికారి పై విషయా లెలాఉన్నా, ఇంట్లో జరిగే ప్రతిపనీ చిన్నదైనా, పెద్దదైనా ఆవిడ ఇష్టప్రకారం జరగాల్సిందే. మంచి వాగ్ధాటి కలమనిషి. ఎటువంటి వాణ్ణయినా మాటల్లో నిలబెట్టేసి తనన్నది అవుననిపించగలదు

సూరపరాజుగారి సతీమణి సీతమ్మగారు కొంచెం మేధకురాలు. ఎవరెల్లా చెబితే అలా నడుచుకోటం ఆవిడకి లక్షణం. సూరపరాజుగారు తన వెంప్ప్య పనుల్లో, వినోదాల్లో ఎప్పుడో వీలుచిక్కినప్పుడు ఒక్క మంచి మాటాడితే ఆవిడ ఏనుగెక్కినట్టు సంబరపడేది. తనకి భార్యకివ్వవలసిన సంపూర్ణ స్థానం ఇవ్వలేదని కాని, భర్త చూపగలిగినంత అను రాగం చూపటంలేదని కాని ఆమె మధనపడలేదు. ఒకవేళ పడినా, అది ఆమె అంతరాత్మకీ, భగవంతుడికీ తప్ప మరొకరికి తెలియదు అప్పటికి వాళ్లకి ఇద్దరు పిల్లలు. పెద్దవాడికి మూడోఏడు. రెండోపిల్ల పొత్తిళ్లలోది. వీళ్లుకాక ఆ యింట్లో సూరపరాజు గారి విధవ అక్కగారూ, కొడుకూ, దూరపుచుట్టం బాబాయిగా రొకాయన ఉండేవారు. ఆయన పని ఇంట్లోనూ, బయటా అవసరంఉన్నా లేకపోయినా అజమాయిషీ చేస్తుండడం. "వాడి మొహం సూరి గాడి కేం తెలుసు. నేను చెప్పి రసంగులు మానిపించి అక్కుళ్లు వేయించాను కనుక ఈ ఏడాది తిండికిన్ని గింజలున్నాయి వాడికి" "మొన్న ఇనెస్పెక్టరొస్తే మనవాడు నీళ్లు నమిలాడు నేను వెళ్లి టకటకా నాలుగు ముక్కలు మాట్లాడి పన్నుల వ్యవహారం నిమిషంలో పైసలా చేశాను." "ఇదో దివాణమైపోయింది. అడ్డమైనవాళ్లూ ఇక్కడే బైఠాయింపు మళ్లీ అందరికీ అన్నిరకాల రోగాలూ, అడ్డెడుగిన్నెకిమాత్రం శోకరా లేదు" ఇలా ఉండేది ఆయన ధోరణి లక్ష్మమ్మగారు రంగంలోకి దిగితేమాత్రం ఆయన మంచినీళ్లడక్కుండా నిష్క్రమించేవారు

ఆపైన ఊరికి వచ్చిన ప్రతి ఆఫీసరూ, రెవెన్యూ ఇనస్పెక్టరూ, తాసిల్దారూ, కాలవల ఓవర్సీలు— అందరూ వారింట్లోనే మకాం ఊరి కే హరిదాసు గారొచ్చినా కథ జరిగినన్నాళ్లూ వాళ్లయింటి జనా భాలో లెక్కే ఇదికాక పాలేళ్లూ, పాలికాపులూ, చాకలాళ్లూను

సూరపరాజుగారు ఒడ్డూ పొడుగూ, మంచి ఆజానుబాహు మనిషి. నిండైన విగ్రహం స్వత హాగా మంచి సరదా మనిషి ఎప్పుడూ లేమి అంటే చవిచూడని జన్మమో, డబ్బంటే అసలు లక్ష్యే ముండేదికాదు అందులో ఊరు ఆట్టే కలిమి కలిగి ఉండని రోజుల్లో ఊళ్లో ఉన్న నలుగు రైదుగురు స్థితిమంతుల్లో ఒకరవడం, అప్పటి కింకా ఊళ్లో పార్టీలు లేకపోవడం, మునసబు, కరణం మొదలైనవాళ్లుకూడా ఈయన్ని చిన్న వాడైనా, కాస్త చదువుకున్నవాడూ, ప్రపంచ జ్ఞానం కలవాడూ అని గౌరవించడం, స్వతహాగా ఆ రోజుల్లో బ్రాహ్మలంటే ఉండే గౌరవానికి తోడై ఆయనొక సామంతరాజులా వెలిగేవాడు ఆ ఊళ్లో ఏ పండగ వచ్చినా, ఏ ఉత్సవంచేసినా ఆయనదే నాయ కత్వం భోగం మేళం ఊరికి వస్తే ఆయనది ప్రథమ తాంబూలం. దీపావళికి కటిన బాణసంచా ఒక గది నిండేది వారింట్లో ఊళ్లో అందరికీ అందులో భాగమే ఆయనకి సరదా పుడితే ఒకప్పుడు ముందూ వెనకా ఆలోచించేవారు ... ... ...

కొంచెం మేథకుడిగా నా అన్నవాళ్లు లేకుండా తి తుండే ఒక నాగంబొట్లని పెళ్లి చేయిస్తానని ఏర్పాట్లూ చేయించి ఒక పాలేరు కుర్ర ఆడవేషం వేయించి, పురోహితుణ్ణి తీసు లక్షణంగా పెళ్లి చేయించేశారు. మూడువ రూపాయలు ఖర్చైంది ఆ రోజుల్లో. అలా ఉ ఆయన సరదాలు. పిల్లలంటే విపరీత గారా వాళ్లు ఏది కావాలంటే అది ఇచ్చేవారు. కొండ కోతి కావాలన్నా తెచ్చేవారు. అసలు బిడ్డ కడ పడిందనగానే భార్యనికూడా అమిత ఆపురు పెట్టేవారు. నెలలు నిండుతున్నాయనంగా బంగారపురేకులు వేడివేడి అన్నంమీదవే సి పించేవారు; ఆవిడ ఆరోగ్యంకోసం, పిల్లలు తె ఉండటంకోసమూను. అన్నివిధాలా, వేసి వె కుండా ఉండేది సంసారం

సూర్యనారాయణగారు ఊరి కరణంగారు. లోతైన మనిషి. ఎప్పుడూ మాటజారేవాడు దాయన. ఆయనకీ తగినంతఆస్తి ఉంది; నలు పిల్లలూ. ఆయన సూరపరాజుగారికి చాలా హితుడూ, అయితే సూర్యనారాయణ ముందుచూపు, జాగ్రత్త కలవాడు. సూరపరాజు సరదాల్లో పాల్గొంటూ చేయూతనిస్తూనే తన చమురు వదలకుండా చూసుకునేవాడు. వీళ్లు ఆ ఊరి మునసబు వీరన్నగారు, రాయుడుగా రంగరాజుగారు ఆ ఊరికి మోతుబరులు. వీరం అన్యోన్యంగానే ఉండేవారు పెద్దలు నలుగురూ త్రాటిమీద నిలబడ్డం, మిగిలిన సన్నకారు జనమం వారి ననుసరించుకుని నడవడం, ఆ పల్లెలో జీవి కష్టాలతోనైనా సాఫీగానే గడిచిపోయేది

ఆ సమయంలో రెండు విశేషాలు జరిగాం గోదావరికి విపరీతమైన వరదలొచ్చి గండిపడిం సిరిపాలెం ఊరంతా అడుగులోతు వరద నీళ్ల మునిగి నాలుగురోజులుంది. ఆ నాలుగు రోజుల ప్రజలు అష్టకష్టాలుపడ్డా గోదావరి—మాత వెనకి తగ్గుతూ ఒక వరమిచ్చి వెళ్లింది. ఎక్కడ చూసి ఆరంగుళాల దళసరివి అతిసారవంతమైన ఒండ్ర మన్ను వదలి వెళ్లింది. సమయానికి ధవళేశ్వ దగ్గర మొదలైన కాలువల త్రవ్వకం ఊరుదాకా చేరింది ఒక పంటకాలువగాను. ఆ ఊ దశ అంతటితో మారిపోయింది.

రెండో విశేషం ఆ ఊరికి నరసింహంగా రావడం.

## 2

## గంగావతరణం

నీళ్లు నీళ్లు వాననీళ్లు వరదనీళ్లు. నది పొంగి నీళ్లు. గోదావరికోపం! ఎవ్వరి దీపాపం? ఏరుపొంగిం కట్టలు తెగాయి పొంగిన నీళ్లు. ఉప్పొంగినవాళ్ల తెప్పున్న ఎగసిన నీళ్లు. కళ్లు చెదరేనీళ్లు. కుళ్ల కడిగే నీళ్లు

వానొచ్చిందమ్మా వాన వరదొచ్చిందమ్మా

39—పేజీ చూడండి





చిట్టితమ్ముడు చిత్రంలో 'సుబ్బులు'గా రాజసులోచన.

చిత్రసమీక్ష :

# 'మంచి' చిత్రం తియ్యాలనే ప్రయత్నంగా సాగిన "చిట్టితమ్ముడు"

**నిర్మాణం : విజయగోపాల్ ప్రొడక్షన్స్. దర్శకత్వం : తిలక్, రచన : కొండేపూడి, పాటలు : ఆరుద్ర, సంగీతం : పెండ్యాల, నటీనటులు : చిరంజీవి వెంకటరమణ, రాజసులోచన, రమణారెడ్డి, సంధ్య, జగ్గయ్య, దేవిక, రాజనాల, కాంతారావు, సి. ఎస్. ఆర్, కె. వి. ఎస్. శర్మ, సూర్యకాంతం, చదలవాడ మొ. వారు.**

ప్రధానమైన కథావస్తువులో కొత్తదనమున్నా చిత్రీకరణలో జనరంజకమని భావించే పాత సినీ మాటిక్ పద్ధతులనే అనుసరించిన "చిట్టితమ్ముడు" చిత్రం ఒకవిధంగా మంచి చిత్రం తీయాలనే ప్రయత్నమే అయినా అది 'చిన్న' దే నని మనం భావించవచ్చును. ఒక "అనాథశిశువూ", "శరణాలయాలూ" "ఆదరించగల ఉదార గృహస్థు" లూ కేవలం స్వార్థంతో బతుకుతెరువు నేర్పి మసలించే దొంగల "ముఠా" లూ మొదలైన వికృత స్వార్థ పాంఘిక శక్తులమధ్య ఎలా నలిగిపోతాడో చిత్రించగల కథావస్తువులో, ఇతరత్రా జనామోదంపొంది రక్షించే ప్రజాకర్షణ పొందగల సన్నివేశాలు, సంఘటనలు, పాటలు, ఆటలూ జొప్పించి (దర్శక రచయిత సాంకేతిక బృందమంతా) కృతకృత్యు లయ్యారు ఒక దశ తర్వాత చిత్రంలో కరుణరసం వెనుకపడిపోతుంది

'చిరంజీవి' ని ('చిట్టితమ్ముడి' పేరు) అతని తల్లి (దేవిక) అతని తండ్రి తనను గుళ్లో పెళ్లాడి వెళ్లిపోయాడనే బెంగతో ధర్మాసుపత్రిలో కని వదలి మరణిస్తుంది ఇటే తండ్రి (జగ్గయ్య) ఆమె కోసం వెతుకుతూ విఫలుడై, జబ్బుతో తీసుకుని మరణిస్తూ 'ఆస్తి' నంతా చిరంజీవి పేర రాసి పవర్ ఆఫ్ అటార్నీగా తన 'బావ' గారిని (రమణారెడ్డి) నియమించుతాడు అయితే ఆ ఆస్తి కాజేయాలనే ఆశతో తమ్ముడు శ్రీహరి (కాంతారావు) విలన్ అవుతాడు

అనాథాశ్రమంలో పెరిగిన చిరంజీవి (వెంకటరమణ) విధివశాత్తు ఒక దొంగలముఠావలలో చిక్కుకొని, అందులో సుబ్బుల' నే (రాజసులోచన) నాట్యకత్తెకు చిట్టితమ్ము డవుతాడు ఆతర్వాత ఒకసారి యిద్దరు దొంగలతో బయటికిపోయి ఒకానొక సన్నివేశంలో ప్లీడరు" మేనమామ" గారి ఇంటికే చేరుకుంటాడు జ్యోతిష్యం లోక జ్ఞానం రెండూ జోడించిన ఆ ప్లీడర్ దంపతులు 'చిరంజీవి' ని ఆస్తికి వారసుడుగా నిర్ణయించి 'ఆరా' లు తీస్తారు కాని శ్రీహరి చిరంజీవిని చంపేద్దామని కుట్రం చేస్తాడు చివరికి శ్రీహరికి కృష్ణ జన్మస్థానము చిరంజీవికి తండ్రి ఆస్తి, మేనత్త (సంధ్య) పెంపకం లభ్యమవుతాయి

ప్రధానమైన కథకన్నా యితర పాత్రలకు ఎక్కువ అవకాశం 'ఎంటర్టయిన్మెంట్' వాల్యూకు ఎక్కువ శ్రద్ధ చూపిన ఈ చిత్రంలో రమణారెడ్డి (మంచి మోతాదైన హాస్యం) (సంధ్య పాత్రలో చిత్రమైన పిండుతనం) రాజసులోచన (చురుకైన నృత్యాలు) సూర్యకాంతం (సహజసిద్ధమైన 'టచ్' అన్నిటికనా వింతగా ఉండే వేషంలో (కె వి ఎస్ శర్మ) "విపరీతమైన స్టంటు" సీనులో అప్పు ఇతరత్ర కాంతారావు 'రాజనాల' ల (పాత్రోచిత) నటనా దీనిని జనరంజకమైన చిత్రంగా చేశాయి తేటగా మాటిగా కొండాకచో నాటుగా సాగిన ఆరుద్ర పాటల సాహిత్యం, కొండేపూడి మాటలూ ఈ చిత్రాన్ని ఉత్సాహంగా నడిపిస్తాయి ముఖ్యంగా చిరంజీవిగా చిరంజీవి వెంకటరమణ ప్రశంసలు పొందుతాడు కరుణారసపూరితమైన ఈ చిత్రంలో చివర ఆనవాయితీగా భీభత్సరసంతో సెట్లు ధ్వంసం చేశారు నిర్మాతలు అది వినా చురుకుగా సాగిందీ చిత్రం జనం దీనిని బాగా నమ్ముతారు ఈ ఉత్సాహంలో నిర్మాతలు మరో మంచి కథ గట్టిగా ఎన్నుకుంటే 'మంచి చిత్రం తియ్యగలరు

పి కృష్ణానంద్ ★



కళోదయా వారి "వారసత్వం"లో రేలంగి కాంచనసర్వతి.

తెనుగు సినీమాలోకంలో-3

# శరవేగనిర్మాణాలవల్ల 'కథ' వధ ఔతూందా?

## పి. 'కృష్ణానంద్'

కథ అనేది సినిమా తీస్తూ ఉండగా క్షీరసాగర మథనంనుంచి చందమామ పుట్టినట్లు ఎప్పుడో అప్పుడు 'తళుకుమని' దానికదే రావాలిగాని, కథతో ప్రారంభించి, 'సెన్సార్'తో సినిమా ముగించి విడుదల చేయడం అనేది కేవలం 'శరవేగంతో' తప్ప మరో గమనంతో సినిమాలు తీయడం నచ్చని మన నిర్మాతలకు కిట్టదూ అంటారు. ఔనా?

### రొట్టెకు రేవేమిటి?

అసలు కొన్ని సీక్వెన్సులు తీసి, ఆనక వాటిని అతికి ప్పుడుకదా "బొంతం"లాగ కథావస్తువును గాదుకోవడం? పై మదహరించిన పిమెతను సినిమా వాళ్ళు స్పష్టించలేదు. కేవలం వాళ్ళ దాన్ని అనుసరిస్తారు. అంతా ఎక్కడో అక్కడ హీరో హీరోయిన్‌లతో ఒక సీక్వెన్సు, కమెడియన్‌తోను, మరో యింకా "పేరుపెట్టని అదపాత్రతోను, ఒక మ్యూజిక్ రెండు 'తోకు'లో మూడు "ఫైట్లు" పెట్టుకుని నలుగురు సెకండ్‌క్లాస్ స్టార్‌లతోనో ఆర్టిస్టులతోనో వాటికి రూపకల్పన చేసి ఆనక వీటిని అతికేసుకుని 'కథ' లేదా ఎడిటర్ చేతిలో పారేస్తే, దాన్ని నిర్మాత అభిరుచికి అనుగుణంగా అతుక్కుంటూపోయి మరికొన్ని 'సెట్'ల మీద మరికొన్ని "షాట్"లు తీస్తే చివరికి ఒక సినిమా అవుతుంది. అందుకనే "రొట్టె తినడానికి ఏ వేపునుంచి ప్రారంభించాలి అన్నది ఎలాగైతే ఆలోచించమో, సినిమా తీయడానికి కథ గురించికూడా లిప్పితంగా తేల్చుకోము"—ఇదీ సూత్రం. ఔనా? కాదా?

ఒక కథను సన్నివేశాలుగా విభజించి, తర్వాత షాట్‌లుగా భాగించుకుని సెట్‌లు వేసుకుని, అసలు కథా, దానిలోని పాత్రలను 'వాటిజాగా'లను, అసలు ఆ కథలలోని సన్నివేశాలలోను వుండగల అవకాశాన్ని మూసుకుని కంటిన్యూయిటీ; "వాస్తవికతకు దగ్గరతనం" యిత్యాదులను ఆలోచించడం అనావశ్యకంగా పనుకట్టేసి— అంటే పిడిగావున్న తారలను, ఉపతారలను బుక్‌చేశాం గనక వాళ్ళ(కి)'సెటప్' రావాలి అని దానికి ప్రాముఖ్యత యిచ్చేసి—సినిమా తీసేయడం (తెలుగు) నిర్మాత వ్యాపార రహస్యం.

ఫలానా నటుడికోసరం సినిమా తీస్తారా ? ఫలానా సన్నివేశం కోసరం కథను మార్చేస్తారా ? అని కొందరు కొందరు ఆశ్చర్యపోతారు కాని, ఆదేం అక్కర్లేదు. అక్కరాలా ఫలానా నటికోసరం, నటుడి కోసరం కథే? ఏం ఖర్మ కట్టూ బొట్టూకూడా మార్చేస్తారు. కావాలంటే లోకం తీరుతెన్నూ మార్చేస్తారు.

శరవేగానందయ్యో శిష్యులు వెనకటికి వెయ్యి గిన్నె నాశ్రయిస్తుందా, గిన్నె వెయ్యి నాశ్రయిస్తుం దాని సందేహ పడిపోయి కేవలం కథలపాలై పోయారు. నిర్మాతలు కథలలోని పాత్రలను 'స్టారులు' ఆశ్రయించరని 'స్టారు'నే 'పాత్రలు' అనుసరిస్తాయని, యిది సినిమాల పరంగా చెల్లగల నిజమని అనిపిస్తున్నారు

### ట్రేడ్ సీక్రెట్!

అసలు తెలుగుసినిమాలొక్కటేకాదు ; భారత దేశంలోనే ఒక సినిమా తీస్తున్నామూ ? అంటే అందులోని కథ కమామిషూ "ఒక్క నిర్మాత" 'కవి' పీఠికా ఎందుకూ (?) దానిలోని ఏ పాత్రధారికీ, ఏ టెక్నీషియనుకూ పూర్తిగా తెలీదని అదే ఒక ట్రేడ్ సీక్రెట్‌గా, సంప్రదాయ బద్ధంగా సాధారణంగా వుంటున్నదని, అంచేతనే యీ సినిమాలు వాస్తవికానికి దూరంగా వుంటాయని "సృష్టి" చేసిన పెద్దలు కొందరంటున్నారు. ఇందులో విస్మారంలేదు.

### పరిశ్రమే: శ్రమలేదు!

"ఓహో ! ఈమె ఇప్పుడు ప్రేయసి కదా. నాకు ఆనక ఇల్లాలవుతుందా ?" 'హీరోయిన్' తో తొలి సీక్వెన్సులో ఓం ప్రథమం 'షాట్' కి సిద్ధమై సెట్ రిహార్సల్‌లో అడుగుతాడు హీరో, తన పేరు ("పాత్రగా") (ఆనక) ఆమె పాత్ర పేరూ మననం చేసుకుంటూ.

"ఏమో మరి ! ప్రస్తుతానికి మీ కీ డైలాగు చెప్పండి .... ఆనక వీలైతే 'డ్రామా' కోసరం చివర్న సెకండ్ హీరోయిన్‌కు గ్రూప్ ఫోటోలో ఓ ఛాన్సు యిచ్చి హీరోయిన్ను చంపేద్దామని "థింక్" చేస్తున్నాం అంటారు పెద్దలు. (చివరగా



వా ...వారి మొదటి ( ... ) ...



ఆర్. ఆర్. వారి చిత్రంలో ఎన్. టి. రామారావు

ఉంటుందిగా ఆమె.)

"సరే! హీరోయిన్ (లేదా) హీరోను తాను 'లవ్' చేయడానికి కథలో "బేసిస్", "ఫౌండేషన్" ఇవేమీ ఎలా ఉంటాయా? అని అడిగే ఓపిక తెలియజేసే వోపికా యిరు పక్షాలకీ ఉండదు. అదంతా శ్రమ కాని, సిన్మా కేవలం పరిశ్రమ.

'చిలక పలుకులు' లాగ డైలాగ్ అనడం 'ఓ. కే' లు చెప్పడం—యీ రెండూ నేర్చుకుంటేనే పరిశ్రమలో రాణింపు. అదే "సీక్రెట్"

ఫలానా సీక్వెన్సు, ముందు సీనులో ఒక పాత్ర మరో పాత్రతో మాట్లాడిన ఒకానొక "డైలాగు" ఎటువంటి డెవలప్‌మెంట్" తీసుకొచ్చిందో ప్రింట్‌లో చూసి, దానిని సమర్థించుకోవడమే గాని—ఫలానా సన్నివేశం తర్వాత రెండు పాత్రల మధ్య ఇటువంటి డెవలప్‌మెంట్" రావాలి అనే నియమం గాని, లేదా ప్రయత్నంగాని సినీమాల్లో అరుదు. అది "శ్రమ" గా తోస్తుంది చాలామందికి.

మన సినిమాలు లేదా సినిమాల్లో కొన్ని, చాలా భాగం అతుకులబొంతలుగా తీర్చానికి తీర్థంగా ప్రసాదానికి ప్రసాదంగా అవడానికి కారణం 'స్క్రిప్టు', సినేరియోల మాట అటుంచి, కనీసం కథైనా పూర్తిగా పాత్రధారులకు తెలియకపోవటం; అంచేత వారు కేవలం "గాత్రధారు"లా "వేష ధారులుగా" ఉండిపోతారు. సినీమాకు పీరి హావ భావ భంగిమలన్నీ భావ ప్రకటనలుగా గాక—స్పెషల్ ఎఫెక్ట్సుగా ఉండిపోడమూ జరుగుతున్నది.." అదీ సంగతి.

(ఇంకా ఉంది).

* * *

## ఛార్లస్ లాటన్ మృతి

ప్రఖ్యాత హాలివుడ్ నటుడు ఛార్లస్ లాటన్ తన 63 వ ఏట డిసెంబరు 15 వ తేదీన కాన్సర్‌తో బాధపడి మరణించాడు. 1931 లో హాలివుడ్‌కు వచ్చిన ఈ నటుడు చాలామంది విమర్శకుల, విజ్ఞుల ప్రశంసలు పొందడమేగాకుండా, నటులకు కూడా "ద్రోణాచార్యుడై" ప్రశస్తి పొందాడు. "కేవలం నటుడా? కాదు "జీనియస్" అంటాడు. 'ఆల్ఫ్రెడ్ హిచ్కాక్' లాటన్ గురించి. ★

## సరాగమాల

కొద్దిరోజుల క్రిందట మద్రాసులో శ్రీ చిట్టిబాబు వీణ కచ్చేరీ జరిగింది. వీరు ఈమని శంకర శాస్త్రిగారి శిష్యులు. చిట్టిబాబు ఫలానా అని తెలియకపోయినా, మీలో చాలామంది వారి వీణావాద్యాన్ని వినేఉంటారు. 1951 నుంచి ఇప్పటిదాకా చిట్టిబాబు కొన్ని వేల సినిమా పాటలకు వాద్యగోష్ఠిలో వాయించి ఉంటారు. వాటిలో వీణను ఆధారంగా తీసుకొని చేసినవి కొన్ని మాత్రమే. వాటిలో ప్రతిష్ఠ కెక్కినవి "మాయింటి మహాలక్ష్మి" లో "మనమే నందనవనమే", "అన్నా తమ్ముడు" లో "మ్రోయించు హృదయవీణ", "మహామంత్రి తిమ్మరుసు" లో "తిరుమల తిరుపతి వెంకటేశ్వరా" మొదలగునవి.

కచ్చేరి ఆరుంబావుకు మొదలయింది. పది దాటిన కొద్ది నిమిషాలకు పూర్తయింది. ఈ నాలుగు గంటల కాలంలో ఒక్క క్షణం కూడా విసుగెత్తకుండా శ్రోతలు ఆ మోహన వీణానాదంతో సమ్మోహితు లయ్యారు.

ఆరోజు వాయించినవాటిలో మొదటిది "సరసుడా" అనే సావేరి రాగవర్ణం. సర్వసాధారణంగా ఇంత రక్తి కలిగించేదానిని ఆదినే వాయించడానికి చాలామంది యిష్టపడరు. ఎందుకంటే మొదట్లోనే ఇటువంటిది వాయిస్తే, దాని తరువాత వచ్చేవన్నీ ఆ రంజనను ఒక్కోమెట్టు పైకి తీసుకు వెళ్ళాలని. నాలుగు గంటల కచేరీలో యిది అశేష ప్రజ్ఞానిధులకే సాధ్యం. తమ వాదనపై తమకు గల నమ్మకంతో ఇటువంటి వర్ణంతో చిట్టిబాబు కచేరీని మొదలుపెట్టడమే కాకుండా, పూర్తయే సరికి శ్రోతలకు కూడా ఆ నమ్మకం కలిగేటట్టు చేశారు.

రెండవది అందరికీ తెలిసిన "వాతాపి గణపతిం భజే" హంసధ్వని. ఈ పాట పాడుతూ అందరు వేసి వేసి విసుగెత్తించిన సంగతులన్నీ చాలా మట్టుకు వదిలేసి, కొత్తగతులతో, కొంగ్రొత్త సంగతులు వేసి అలరించారు. ఆ తరువాత కన్నడ గౌళలో "ఓరజూపు"; బహుదారిలో "బ్రోవ భారమా" వాయించారు. కన్నడగౌళలో చిత్రమైనది, రమ్యమైనది గణాంతర ప్రయోగం "నిసగ్గగమ, గ్గమగరిస." ఈ ప్రయోగాన్నంత విరివిగా ఉపయోగించకపోయినా, తక్కిన ప్రయోగాలతో అంత రమ్యతనూ సాధించారు.

కడవ కుతూహలంలో (దాసుగారూ, ఏ మేళ కర్త ?!) "రఘువంశసుధ" వీరి వాదనంలో నవ్య సౌందర్యంతో ప్రకాశించింది. ఎవరైనా ఈ రాగంతో రక్తి కట్టించగలరు. ఈ రాగపు ప్రస్తారవిశేషాలటు వంటివి. దీనిని తీసుకొని చిట్టిబాబు చేసిన వింతలు, చూపిన కొత్తపుంతలు (అన్నీ అందమైనవే. కొన్ని అపూర్వమైనవి) గమనిస్తుంటే మనసు ఆ స్వర వశమై పోయింది. ఈ కృతి వాయిస్తున్నప్పుడే రెండు తీగలమా (మొదటిది, మూడవది) ఒకేసారి మీటుతూ, ఆ ధ్వనుల అపూర్వ లావణ్యంతో శ్రోతలను దిగ్భ్రాంతులను చేశారు. (కర్ణాటక రాగాలు అంతగా రుచించనివారుకూడా ఈ రాగాన్ని మెలభంగా ఆనందించగలుగుతారు. ప్రత్యేకంగా "రఘువంశసుధా" స్వరాలు పాశ్చాత్య ధోరణిలో ఉన్నట్టు వినిపిస్తాయి.)

ఆ తరువాత ఆనందభైరవిలో "మరివేరే" కేదారంలో "సకల కళావాణి", అమృతవర్షిణితో "సుధామయి" వాయించారు. ఆ నాటి కచేరికంతా ఒక దివ్యత్వాన్ని ఇచ్చింది హిందోళంలో "సామజ వరగమన", తోడిలో "కద్దనువారికి," షణ్ముఖప్రియలో రాగం, తానం, పల్లవి.

హిందోళం చాలా నిండైన రాగం. సినిమా సంగీత ప్రియులకు చిరకాలపు ప్రేయసి "ఆచార్యులతో" "రాజశేఖర", "స్వర్ణమంజరి"లో "మధురమైన గురు దీవెనా," "అన్నాతమ్ముడు"లోని "మ్రోయించు హృదయవీణా"—ఇవన్నీ ఆ రాగాన



వివేకవర్ధని కాలేజీలో జరిగిన విద్యార్థుల 'ఫిలిం బ్యాలట్‌లో' నెగ్గిన తారలకు బహుమతులు పంచిన మంత్రి శ్రీ చెన్నారెడ్డి ప్రసంగిస్తున్న దృశ్యం.



## నమూనా 'సంపాదకునికి ఉత్తరాలు':

[ఈ ఉత్తరాలు ఏ రచనకైనా పనికొస్తాయి. ఖాళీస్థలాలలో కావలసిన పేర్లు నింపితే చాలు.]

**కథలు:**

(1)"—పత్రికలో—గారు వ్రాసిన— కథ చాలా బాగుంది. పాత్రపోషణ బాగానే చేశారు. కథాగమనం చురుకుగానే సాగింది. వారికి నా అభివందనలు."

(2)"—పత్రికలో—గారు వ్రాసిన—కథ నాకు అంతగా నచ్చలేదు కాని, మొత్తంమీద బాగానే ఉందని పించింది. ఇకముందు కూడా మంచి మంచి కథలే వెయ్యగోరుతాను."

(3) "—కథ పాఠకులను ఆనందడోలికలలో ఓలలాడించిందంటే నమ్మండి. —గారికి నా అభినందనాలు."

**సీరియల్ నవలలు:**

(ప్రారంభించే సమయంలో) "—వంటి మహత్తర గ్రంథాలు పాఠకలోకానికి అందజేసిన—గారి—సీరియల్‌గా ప్రారంభించినందుకు మిమ్మల్ని అభినందించకుండా ఉండలేకపోతున్నాను."

(మధ్యలో)"— సీరియల్ చదువుతూవుంటే ముందు ముందు ఏమి జరుగుతుందా అనే భావం అధికం అవుతోంది. ప్రతి సంచికలోనూ 'సశేషం' అనేమాట 'చివి' నిరాశ చెందాను."

(అయిపోయిన తర్వాత) "—వంటి నవల ఇంత వరకూ చదవలేదేమో అనిపిస్తుంది. అశేష పాఠక జనాన్ని ఈ మహాకావ్యం దుఃఖ, ఆనందసాగరాలలో ముంచి తేల్చిందనటంలో సందేహమే లేదు. — గారికి నా అభివందనలు. ఇకముందు కూడా ఇటువంటి నవలలే ప్రచురించ ప్రార్థన."

**కార్టూన్‌లు:**

(1) "—గారి కార్టూన్ నన్ను కడుపుబ్బ నవ్వ చేసింది. వారికి నా అభివందనలు."

(2) "—పత్రికలో—పేజీలో—గారి కార్టూన్ వేశారు. దాని అర్థం ఏమిటో నాకు అర్థంకాలేదు. వివరించి చెప్పగలరా ?"

[ఇతర నమూనా లేఖలు వీలయినంత త్వరలో ప్రచురించగలను : రచయిత.]

పి. వి. ఆర్ (నెల్లూర్)

## సందేహాలూ - సమాధానాలూ!

బళ్లు ఆఫీసులూ
వదిలేటి వేళా
గుళ్లు గోపురాలు
తెరిచేటి వేళా
ఆ సందు మొగను
ఈ సందు కొసను
నిల్చేది ఎవరూ అర్రు
జాచి చూచేది ఎవరూ?

బియ్యేలు ఎమ్మేలు
చదివి చెయ్య'జాబు'లేక
దారికాచు యువకులో
తరుణులారా!
రాదారి కాచు యువకులో
భామలారా!!
గుమాస్తా పత్నులు ఇలు
పారేటి వేళా
సమస్తాఫీసులు వడి
మూసేటి వేళా
జెడలు విసురుతూ
మరులు గొలుపుతూ
కులుకుతూ వచ్చేటి
రంగురంగుల చిలక లెవరూ?
రింగురింగుల కన్నె లెవరూ?
ఫ్యాషన్‌లు గీసనులు
నేర్చినా భామలూ
రోషాలు వేషాలు
పెంచినా భామలూ
కళాశాల 'బాల'లే నయ్యా వారు
కళాశాల భామలే నయ్యా వారూ!

—పిరాజీ. ★

తెడవ స్టేషన్...మద్రాసు మెయిలు నిల్చి ఉంది·—"నా జీవితంలో అర్థం కనుక్కోవాలి రాజూ" అంది ఆమె. పెట్టెలోపల ఏదో చదువుతూ కూర్చున్న డాక్టర్ రావు చిరునవ్వుతో పత్రికా పఠనం ఆపి, వినసాగాడు.

"ఇంతదాకా అందర్నీ సంతోష పెట్టబోయాను. పూర్తిగా ఎవ్వర్నీ సంతోష పెట్టలేకపోయానని కనుక్కున్నాను. ఇక ఇది ఆఖరు. మరో ఊరు పోయి, క్రొత్త పరిసరాల్లో జీవించాలి. లేకపోతే నాకు పిచ్చెక్కిపోతుంది. అంతే" అందామె.

"నీ ఆనందంకోసం నీవు చేస్తున్న పని మంచిదే కాని, అన్నయ్యా, వదినా, అంతా ఎలా? ఆలోచించావా?" అన్నాడు కంపార్టుమెంటు కిటికీ దగ్గర నిలబడి, కిటికీలోకి చూస్తూ యువకుడు.

"రాజా, ఎన్నాళ్ళిలా గడపమంటావు? నా జీతం అంతా ఇంట్లో ఇస్తున్నాను—పైగా ట్రెవేట్లు మీద వచ్చేది కూడా ఇస్తున్నాను. నేను పెండ్లి చేసుకోలేదని వదినకు కోపం.......అమ్మకు అవమానం......అందుకే పోతున్నాను.......ఇంటర్వ్యూకు బాగా చదివాను రాజా—సెలక్టు అవుతానని అనుకుంటున్నాను.......కొన్ని రోజులు అందరికీ, దూరంగా కొంచెం ప్రశాంతంగా గడుపుతాను."

మాటల్లో ఆవేదనా, బాధా ఎంతగానో తోచాయి రావుకి. జాగ్రత్తగా తల త్రిప్పి చూశాడు ఆమె! వైపు......తల వంచుకుని కిటికీ దగ్గర కూర్చుని ఉంది.......దాదాపు ఇరవయి అయిదేండ్లు ఉంటాయి కాబోలు.......మనిషి చూడగానే ఏమంత కొట్టవచ్చే అందం కాదామెది—కాని మనిషి తీరులో, ఆత్మీయతా, సహృదయతా, గాంభీర్యం గోచరించాయి. ముఖంమీద మాత్రం బాధ—నిశి వలువు కలిపింది.

'ఇంత చిన్న వయస్సులో ఎందుకంత ఆవేశం?' అనుకున్నాడు రావు మనసులో......

రైలు కూత వేసింది.

"రాజా, అమ్మతో చెప్పు. పూనా చేరగానే జాబు వ్రాస్తాను.......వరిగ్గా ఆదివారం వచ్చేస్తాను......"

యువకుడు తలూపాడు......రైలు కదిలింది ఖాచుమంటూ.

"ఉంటాను మరి" అన్నా డతను అలాగే...... ఆమె తలూపింది.

"గుడ్‌లక్—జాగ్రత్త......" కిటికీ ఊచలు వదిలేశా డతను......మరి తర్వాత కన్పించలేదు..... ప్లాట్‌ఫారం దాటిపోయింది రైలు. ఆమె అలాగే అచేతనంగా కూర్చుంది కాస్సేపు.......తర్వాత తలెత్తి చూసింది చుట్టూ.......అంతా నిండిఉంది—చిన్న సెకండ్ క్లాస్ కంపార్ట్‌మెంటు......హెూల్డాలూ, పెట్టె చూచుకుంది ఓసారి.......చేతిలో పుస్తకం విప్పి చదువసాగింది.

రావు 'లైఫ్' పఠనంలో పడ్డాడు మళ్ళీ......

31-వ పేజీ చూడండి



# వారఫలాలు

## దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

### గ్రహస్థితి

కర్కాటకంలో అంగారక రాహువులు; వృశ్చికంలో శుక్రుడు; ధనుస్సులో సూర్యుడు; మకరంలో బుధ శని కేతువులు; కుంభంలో గురువు; మేష వృషభ మిథున కర్కాటకాలలో చంద్రుడు.

### 4-1-1963 శుక్రవారము మొదలు 10-1-1963 గురువారము వరకు

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారంలో మీరు క్రొత్త సమస్యలను ఎదుర్కొనటానికి సిద్ధంగా ఉండవలసివస్తుంది. అధికారులను మంచి మాటలతో మీ మార్గానికి తీసుకొని రావలసిన సమయం. అతి ముఖ్య సమయాలలో బంధుమిత్రులు చల్లగా జారుకొంటారు. వృత్తిలో పరిశ్రమ మాత్రం అధికంగా ఉంటుందే కాని, ప్రయోజనం సామాన్యం. వ్యవహార రంగంలో గాని, సంఘ కార్యాలలో గాని భారం పెరుగుతుంది. తరచూ పదిమంది ఆదరాభిమానాలను పొందుతూ గౌరవప్రదంగా వ్యవహరించ గలుగుతారు. స్వయంగా వాహనాలు, యంత్రాలు మొదలైనవాటిని నడపు సందర్భాలలో చాల జాగ్రత్తగా ఉండండి. 9, 10 తేదులలో అశాంతికరమైన వార్తలు, తలచిన పనులలో ఆటంకాలు.

*　*　*

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

దైవానుగ్రహం బాగున్నది. పాటివారివల్ల కలిగే చిక్కులను గ్రహించి జాగ్రత్తపడగలుగుతారు. ఒక సమయంలో మనస్సును నిగ్రహించుకొనలేని పరిస్థితి వస్తుంది. గౌరవము, ఆదాయము బాగుంటవి. మీ ధైర్య స్థైర్యాలను తగ్గించే మాటలను నమ్మవద్దు. మీ విద్యను, మనోబలంతో చక్కగా ఉపయోగించుకొంటారు. మీ ద్రవ్యమును లాభకరమైన అనేక కార్యములయందు వినియోగించగల సమయం. శుభకార్యములు నిరాటంకంగానూ, ప్రశాంతంగానూ జరుగుతవి. బంధువులవల్ల సుఖ, లాభాలు కనుపించవు. ఈవారంలో జరుగని పనులవల్ల విదానంగా మీకే మేలు కలుగుతుంది.

*　*　*

**మిథునం :**

(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఏ దారిలో పోదామనుకున్నా పరిస్థితులు మీకు ఎదురు తిరగగల సమయం. కొన్ని సమయాలలో ప్రత్యక్షంగా చూచిన విషయాని కూడా ఎరగనట్లు నటించవలసివస్తుంది. వ్యవహారం, వ్యాపార రంగాలలో మీ ధనం దుబారా కాకుండా చూచుకొనండి. అయితే ఆదాయం బాగుంటుంది సంఘంలో పెద్దరికం లభిస్తుంది. కుటుంబంలోని వారితో వచ్చే సంఘర్షణలు అంతరంగంలో చికాకును కలిగిస్తవి. దైవానుగ్రహంవల్ల బయటపడే అవకాశాలు లేవు. ధన విషయంలో గాని, వ్యవహార రంగంలో గాని ఇతరులను నమ్మటంవల్ల ఒక సమయంలో పశ్చాత్తాప పడవలసివస్తుంది. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. 6, 7 తేదులలో ప్రయాణ సూచన, విలాస ఖర్చులు.

*　*　*

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)

ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడు అన్నట్లుగా ఉంటుంది. మీకు సహాయం చేయవలసిన వారే మరొకరి సహాయమునకు ఎదురుచూస్తూ ఉంటారు. తలవనితలంపుగా నమ్మకమైన మిత్రులు తటస్థపడతారు. క్రమక్రమంగా ఆర్థిక సమస్యలు పరిష్కారం కాగలవు. ఏ కార్యక్రమంలోనూ ముందు నిర్ణయాలు చేసుకునే అవకాశం ఉండదు. వ్యవహార రంగంలో ఇతరులను నమ్మి, అశ్రద్ధగా ప్రవర్తించతగిన సమయంకాదు. శక్తికి మించిన శ్రమ పైన పడుతుంది. ఆత్మీయులతో ఎడబాటు కలిగే సూచనలున్నవి. 4, 5 తేదులలో వృత్తిలో అభివృద్ధి సూచనలు, అనుకోకుండా దేహ బాధలు

*　*　*

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ప్రస్తుతం మీ ఆలోచనలు తారుమారు అవుతున్నట్లు తోస్తుంది. అప్పుడప్పుడు విరుద్ధ వార్తలు తెలుస్తవి. అంతమాత్రంచేత నిరుత్సాహ పడవద్దు. ఏ వ్యవహారంలోను మీకు అపకారం జరుగుతుందని అనుకోవద్దు. పదిమందికి సంబంధించిన పనులలో ప్రముఖ స్థానం లభిస్తుంది. ఆదాయం పెద్దగా పెరగక పోయినా ఇబ్బంది పడకుండా పనులు జరుపుకో గలుగుతారు. ప్రయాణం చేయవలసివస్తుంది. నిర్మొహమాటంగాను, పట్టుదలతోను ప్రవర్తించవలసి రావటంవల్ల మనస్సులో కొంత అలజడి రేగే అవకాశా లున్నవి. న్యాయంతో జయం పొందగలుగుతారు. 5, 6 తేదులలో శుభ వార్తలు, క్రొత్తవారి స్నేహం.

*　*　*

**కన్య :**

(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)

ఒక విధంగా కలిసివచ్చిన అవకాశాన్ని సమయస్ఫూర్తితో వినియోగించుకో గలుగుతారు. వృత్తి వ్యాపారాలలో క్రొత్తవారివల్ల అనుకూలత ఏర్పడుతుంది. మీరు ఇంతకుముందుకన్నా శ్రద్ధతో పనులు జరుపుకో గలుగుతారు, ఇతరులవద్ద నుంచి రావలసిన ధనం సమయంలో వస్తుంది. ఇతరుల సలహాలను పట్టించుకోకుండా మీ దారి మీరు చూచుకొనటం అవసరం. కుటుంబంలో గతవారంకన్నా ప్రశాంత స్థితి ఏర్పడుతుంది. వారాంతంలో వస్తునష్ట సూచన లున్నవి. విలువగల వస్తువులు కొంటారు. లెక్కలు, యంత్ర సంబంధమైన పనులలో పొరపాట్లు రాగల అవకాశా లున్నవి. జాగ్రత్తగా ఉండండి. 8, 9, 10 తేదులలో ఆదాయభంగం, కలహ ప్రసంగాలు.

*　*　*

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

పై ఆడంబరాలు ఏమీ లేకుండా కాలం ప్రశాంతంగా జరుగుతుంది. వృత్తి ఉద్యోగాలలో క్రొత్తగా జరిగే మార్పులవల్ల వెంటనే ప్రయోజనం కనుపించదు. అయితే శత్రుబాధ, పోటీలు తగ్గుతవి. మీ క్రియా కలాపాలలో గాంభీర్యతను నిలబెట్టుకుంటారు. చిన్న చిన్న విషయాలలో నీచులతో కలహాలు రాకుండా ముందు జాగ్రత్తపడుతూ ఉండడం అవసరం. గతవారంకన్నా ఆదాయం పెరుగుతుంది. స్థిరాస్తులు వృద్ధిపరచుకునే ప్రయత్నాలు సుముఖంగా జరుగుతవి. ముందు ఎప్పుడో మీకు సహాయం చేస్తామని చెబుతూ, మిమ్ములను మోసం చేసేవారుంటారు. జాగ్రత్తగా ఉండండి. వృత్తిలో అశ్రద్ధ, సాహసము పనికిరాదు.

*　*　*

**వృశ్చికం:**

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

నిదానంగా ఆలోచిస్తేగాని, ఏవిషయంలోనూ ఒక నిర్ణయానికి రాలేకపోతారు. అందువల్ల ఒక సమయంలో అవకాశం చెయిజారి పోతున్నట్లు కనుపించినా, చివరకు మేలు పొందగలుగుతారు రాజకీయాలలోనూ, సాంఘిక కార్యాలలోనూ పేరు ప్రతిష్ఠలు బాగా పెరుగుతవి. శారీరకంగా సుఖము, సంతోషము లభించగల సమయం. ప్రస్తుతం జరుగవలసిన శుభకార్యాలు వాయిదా పడే అవకాశా లున్నవి. చేతిలోని ధనం దుబారా కాకుండా చూచుకొంటూ, ముందు ముఖ్యమైన పనులను గురించి జాగ్రత్త వహించటం అవసరం. వారం రెండవ భాగంలో ప్రయాణ సూచన లున్నవి. 4, 5 లలో అసౌఖ్య సూచన, విశేష ఖర్చులు.

### ఈ వారము ధరలు

4, 7 తేదులలో బంగారు ధరలో మందీని ఎదురుచూడవలసి ఉంటుంది. వెండి ధర వారం ఆరంభంలో మందీ, రెండవ భాగంలో తేజీ లక్షణం. వేరుశనగ పప్పు ధర పెరుగుదల ఆరంభం అవుతుంది. నూనె ధరలో చెప్పతగినంత మార్పు కనపడదు. నూవుల ధర 8, 9 తేదులలో తగ్గి, పెరుగుతుంది.

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ సమయంలో మీరు అనుకునేది ఒకటీ, జరిగేది మరొకటీ. ఏ విషయంలోనూ మాట తొందరపడకుండా జాగ్రత్త వహించండి. గతంలో ప్రయత్నించి ఆశ వదులుకున్న వ్యవహారాలు ఏదో విధంగా పరిష్కారానికి వస్తవి. ఆదాయంతోపాటు ఖర్చులు పెరుగుతవి. వ్యవహార రంగంలో జరిగే మార్పులను నిగ్రహంతో ఎదుర్కొన గలుగతారు. విలాస వినోద కార్యక్రమాలకు అంతరాయం వస్తుంది. ఈ సమయంలో మీరు నిర్వహించవలసిన ప్రత్యేక బాధ్యతలలో లోపం రాకుండా చూచుకొనటం అవసరం. బంధువులవద్ద నుంచి శుభ వార్తలు తెలుస్తవి. వారాంతంలో మిత్ర కలహం.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఈ వారం చేతినిండా పని లేకపోవటంవల్ల మనస్సు పరిపరివిధాల పోతూ ఉంటుంది. ధన సంపాదన బాగుంటుంది. కుటుంబ సమస్యలు మనస్సును నిరుత్సాహ పరుస్తవి. భారం తీరిపోయి నిశ్చింతగా ఉందామనుకున్న పనులే తిరిగి చేయవలసిన అవసరం ఏర్పడుతుంది. వృత్తిలో గౌరవము, ఆర్థికంగా ఫలితము పెరుగుతవి. ముందుగా మీరు జాగ్రత్తపడటంవల్ల రానున్న కలహాలు సర్దుమణిగి పోతవి. బంధుమిత్రుల వద్దనుంచి వచ్చే వార్తలు మిమ్ములను సందిగ్ధావస్థలో పెట్టగల అవకాశా లున్నవి. 6, 7 తేదులలో విలువగల వస్తువులు కొనటం, ఆదాయ వృద్ధి, మంచివారి స్నేహం.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

శారీరకంగా సుఖం తక్కువ. స్వల్ప విషయాన్ని కూడా పెద్దగా భావించి చికాకు కలిగించుకొంటూ ఉంటారు. ప్రయాణాలు సుఖంగా జరుగవు. వృత్తిలో ఆడంబరం, గొప్పవారితో కలయిక మొద లయినవి బాగుంటవి. పుణ్యకార్యాలు చక్కగా నెరవేరుతవి. రికార్డు రూపంలో మీరు ఇతరులకు వ్రాసే విషయాలలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి. వ్యవహార రంగంలో ధన వ్యయానికి సిద్ధపడి పరిష్కరించుకొనటం మంచిది. దైవానుగ్రహంవల్ల ముందు ఏమి జరుగుతుందో భయం తొలగిపోతుంది. కుటుంబంలో రోగ్యాలు వస్తూ పోతూ ఉంటవి. 5, 6 తేదు అనుకూల వార్తలు. ధ[illegible].

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవ**

మీరు ఈ సమయంలో పడే శ్రమకు సంతృప్తికరమైన ఒక మార్గం లభిస్తుంది. మీ మనస్సును కలవరపెట్టే ఈతిబాధలు క్రమ తొలగిపోతవి. స్వశక్తితో వ్యాపార వ్యవహారా విజయం సాధించ గలుగుతారు. వారం మధ్య అకస్మాత్తుగా దుర్వార్తలు తెలియగల అవకాశాలు కుటుంబ సమస్యలకు పరిష్కారమార్గం స్తుంది. ప్రయాణం చేయవలసి రావ డబ్బుకు ఇబ్బందిపడే సమయంలో ఎదురుచూ సహాయం దొరుకుతుంది. మీకు సంబంధంలేని యాలలో మిమ్ములను గురించి సందేహప రుంటారు. వృత్తి ఉద్యోగాలలో శ్రద్ధతో చేసి, పదిమంది ఆదరణ, లాభము పొందగ తారు.

---

మధ్య మధ్య ఆలోచనలు వెనక్కిపోతున్నాయి..... మళ్ళీ ఎప్పుడో?

మరీ రెండేళ్ళు—కనీసం ఏడాదిపైనే బాబును చూచేది—తన బాధ్యత అలాంటిది.

రైలు ఊగుతూ, పొగ లేపుతూ సాగిపోతూ ఉంది.

* * *

రాత్రి తొమ్మిదిన్నరకి ఒక్కొక్కరే కళ్ళు మూయ నారంభించారు.....ఆమె చుట్టూ చూచింది. కూర్చునే తూగటం మొదలెట్టింది.......కిటికీలోంచి గాలి ఆమె జుత్తును రేపుతూ వచ్చింది జోరుగా.

"మీరు కావాలంటే పడుకోవచ్చు" అన్నాడు రావు ఇంగ్లీషులో ఆమెను చూచి.......ఆమె కళ్ళు విప్పి క్షణంసేపు చూచింది. "ఫర్వాలేదు......." అంది క్లుప్తంగా సరిగ్గా కూర్చుని, ఇంగ్లీషులో.

"లేదులెండి.......నేను పై బెర్తుమీదికి పోతున్నాను........మీరు మీ హోల్డాలు వేసుకోవచ్చు...." అన్నాడు రావు మళ్ళీ......

ఆమె అసందిగ్ధంగా చూచింది. రావు తన పుస్తకం బెర్తుమీదికి విసిరి, జాగ్రత్తగా పై బెర్తుమీదికి ఎక్కాడు.......ఆమె హోల్డాలు విప్పింది....

మరి కాస్సేపట్లో అందరూ నిద్రాగతులయ్యారు...

రావు కళ్ళు మూసుకున్నాడే కాని, నిద్ర పట్టడం లేదు......ఇలా ఎన్నాళ్ళుని? రేపు మధ్యాహ్నంనుంచి మళ్ళీ తనూ, తన పనీ—సంవత్సరం పొడుగూతా అంతే—మళ్ళీ ఎప్పుడో వీలు చిక్కితే—మద్రాసుకు పోవడం, వారం రోజులు మళ్ళీ జీవితంలో కొంత శాంతి, హాయి. ఆమె అన్నట్లు 'అర్థం'—

కళ్ళు విప్పి చూచాడు ఆమె వేపు.

పుస్తకం చదువుతూందామె పడుకుని—పరిశీలనగా చూచాడు పుస్తకంవేపు—అంతగా కన్పించ లేదు. కళ్ళు మూసుకుని అటువైపు తిరిగాడు రావు.

# పాంథశాల

29 వ పేజీ తరువాయి

రైలు ధోండ్ వచ్చేసరికి పొద్దున ఏడయింది. అంతకుముందే లేచాడు రావు. లేవగానే అప్రయత్నంగా క్రిందికి చూచాడు. ఆమె కూర్చుని పుస్తకం చదువుతూంది......అలా చూస్తూ ఉండిపోయా డామెని. కాసేపయినతర్వాత తన ప్రవర్తనకి తానే సిగ్గుపడి, నెమ్మదిగా క్రిందికి దిగాడు. ఆమె తలెత్తి చూచింది.

"గుడ్‌మార్నింగ్" అన్నాడు మందహాసంతో. విని వినపడకుండా "గుడ్‌మార్నింగ్" అందామె.

హాండ్‌బ్యాగ్‌లోంచి బ్రష్షూ, టూత్‌పేస్టూ తీశాడు రావు.....సోపూ, టవలూ తీసుకుని లావెటరీలోకి పోయాడు.....మరి అయిదు నిముషాల్లో వచ్చాడు.

"హోల్డాల్ మడిచేయమంటారా?" అందామె లేచి.

"ఫర్వాలేదు ...... ఇలా కూర్చుంటానులెండి" అన్నాడు రావు.....

ఇద్దరూ మాట్లాడలేదు.

"మీరు ఏదో ఇంటర్వ్యూకు పోతున్నట్లున్నారు" అన్నాడు తర్వాత.

ఆమె తలూపింది.

"రాత్రంతా చదువుతూ కూర్చున్నట్లున్నారు?"

"అవునండి"

"మీరు—ఏ సబ్జక్ట్?" అన్నాడు మళ్ళీ.

"కెమిస్ట్రీ"—తలవంచుకుని చదువసాగిందామె..

రావు మాట్లాడలేదు......'లైఫ్ ఇన్టర్నేషనల్' చదువసాగాడు మళ్ళీ......

"పూనా ఎన్ని గంటల కొస్తుందండి?" అందామె కాస్సేపయిన తర్వాత—

"ఎనిమిదిన్నరవుతుంది—లేటు కొంచెం ఈవాళ" అన్నాడు రావు.

"హోటళ్ళలో గదులు దొరుకుతాయాండి" అందామె.

"మీరు హోటల్లో దిగుతారా? ఫ్రెండ్సెవ రారా?"

"నాకు ఇదే మొదటిసారి పూనా రావటం ఎవరూ తెలీదు కూడా."

"నే నుండేది పూనాలోనే" — అన్నాడు రా

ఆమె మాట్లాడలేదు...రావు హోల్డాలు చు సాగాడు.

కాస్సేపయిన తర్వాత రైలు పెద్దగా కూతవేసి రావు బయటికి తొంగిచూచాడు.....

"పూనా వచ్చేసింది......." అన్నాడు ఆమె ఆమె లేచి నిల్చుంది......పుస్తకం హాండ్‌బ్యాగ్‌లో ఉ దాన్ని మడవటం మొదలెట్టింది. బరువు కాబోలు బెల్టుతో కొంచం చికాకయింది.

"ఉండండి—నేను వస్తాను" అని రావు జా త్తగా బెల్టు లాగి హోల్డాలు చుట్టేసి తం రుగా ఉంచాడు.

పూనా స్టేషన్లో రైలాగింది......ఇద్దరూ దిగా కూలీ సామాన్లు బయటికి తీసుకుపోయాడు.

"మరి మీరు ఎక్కడికి పోతారు?" అన్నా రావు.

"ఏదయినా హోటలుంటే అక్కడికి పోవాలి"

"హోటళ్ళయితే ఉంటాయి. కాని, కొం 'కాస్ట్లీ'........"

ఆమె మాట్లాడలేదు.

రావు టాక్సీ పిలిపించాడు. తన సామాను డిక్కీ వేయించాడు. ఆమె అలాగే హోల్డాలూ, పె పెట్టుకుని నిల్చుని ఉంది. క్షణంసేపు ఆలో చాడు అతను.

"చూడండి — నేనూ తెలుగువాడినే—మీకే అభ్యంతరం లేకపోతే మా ఇంటికి రావచ్చు—నేను

దేశ రక్షణ నిధికై
ఉదారంగా విరాళాలు యివ్వండి



## పాంథశాల

గదిలో ఉండండి ఈ రోజుకి—సాయంత్రంలోగా వేరేగది చూచుకోవచ్చు—'' అన్నాడు.

ఆమె మౌనంగా నిల్చుంది.

అత నెవరో తెలీదు......ఆతిథ్యం స్వీకరించాలా? తనకా ఎవరూ తెలీదు ఇక్కడ—

''మీరేదో ఆలోచిస్తున్నారు......తెలిసీ తెలియని అపరిచిత వ్యక్తి ఆతిథ్యం ఎలా స్వీకరించటమా అని ఆలోచిస్తున్నారు మీరు! — మీరేం సంకోచించ నవసరంలేదని హామీ ఇస్తున్నాను ..... పదండి — తర్వాత తీరిగ్గా ఆలోచించవచ్చు — ''రావు తలుపు తీశాడు.

క్షణంసేపు అతని ముఖంవేపు— పరీక్షగా చూచిందామె......అతనూ అలాగే చూచాడు.

ఆమె లోపలికి వచ్చి కూచుంది; కొంచం ఎడంగా... సంకోచిస్తూ........అతను గ్రహించాడు.

బయటికి దిగి, సామాన్లు చూచి, ముందు సీట్లో డ్రైవరు దగ్గర కూర్చున్నాడు.

''శంభాజీ పార్క్'' అన్నాడు రావు.

టాక్సీ బయలుదేరింది ఒక్క కుదుపుతో.

వెనుక సీట్లో ఆమె మాట్లాడకుండా బయటికి చూడసాగింది.

* * *

టాక్సీ శంభాజీ పార్కు ఎదురు వీధిలోంచి పోయి, ఒక ఇంటి దగ్గర నిల్చింది. రావు టాక్సీ దిగి ఇంటి లోపలికిపోయి తలుపు తీశాడు. తర్వాత వెనక్కివచ్చి, సామాన్లు లోపల పెట్టించాడు...... టాక్సీ వెళ్ళిపోయింది.

''లోపలికి రండి.....ఇదీ మా ఇల్లు—నా భాగం.''

ఆమె నెమ్మదిగా రెండడుగులు వేసింది.

''మీరు ఆ గదిలో ఉండవచ్చు.......నా భాగంలో అదివేరుగా ఉంటుంది—ప్రస్తుతం 'గెస్ట్స్'కోసం''

గది తలుపులు తీశాడు రావు. సామాన్లు లోపలుంచా డామెవి—ఆమె అలాగే నిలబడింది గదిలో.

''చూడండి—మీకు చల్లటి నీళ్ళు కావాలంటే ఆ తలుపు తీసుకుని బయటికిపోయి తెచ్చుకోవచ్చు. వేడినీళ్ళయితే—ఇలా రండి.''

ఆమెను మరో గదిలోకి తీసుకెళ్ళాడు స్నానాల గది అని గ్రహించిం దామె.

''దీన్లోంచి వేడినీళ్ళు వస్తాయి — దీనికి స్విచ్ వేయండి. ఎర్ర దీపం వెలిగిన తర్వాత రెండు నిముషా లుండి కుళాయి తెరవండి — ఇలా — వేడినీళ్ళు వస్తాయి.''

'' కక్కూసు అదీ అవతల ఉన్నాయి. మరి నే నుంటాను — పది గంటలకి డ్యూటీలో చేరాలి— లేకపోతే సెలవు చీటీ లెక్కచేయరు''

ఆమె థాంక్స్ చెప్పేముందే అతను వెళ్ళిపోయాడు.

తన గదిలోకిపోయి, కాస్సేపు చుట్టూ చూచు కుంది. ఒక మంచం, రెండు కుర్చీలూ, టేబిలూ, పుస్తకాలూ ఉన్నాయి. చాలా రోజుల్నుంచి అందులో ఎవరూ ఉండడం లేదని గ్రహించడానికి అట్టే కాలం పట్టలేదామెకి.

హోల్డాల్ విప్పి, తనకు కావలసిన సరంజామా అంతా బయటకు తీసింది. స్నానాలగదిలోకి పోయి, స్నానం కానిచ్చింది. తల దువ్వుకుని, వేరే చీర కట్టు కుంది— కుర్చీలో కూచుని పుస్తకం తీసింది.

''లోపలికి రావచ్చాండి?'' అంటూ వచ్చాడు

కావు, ట్రేతోబాటు — ఆమె లేచి నిల్చుంది.

"ఆ పుస్తకం కాస్సేపు అవతల ఉంచండి— ముందు ఈ టిఫిన్ కానివ్వండి—"

"టిఫిన్ నా కక్కర్లేదండీ" అందామె.

అతను ట్రే టేబిలుమీద ఉంచాడు.... ఆమె వేపు చూచాడు.

"మొహమాటం భోజన విషయంలో మంచిది కాదు—కాకపోయినా మీ కోసం నేనేమీ 'స్పెషల్సు' తేలేదు—నాకు చేయటంరాదు అవన్నీ—రెండు ముక్కలు—బ్రెడ్ టోస్ట్, జామ్, స్పెన్స్‌కాఫీ ఇంతే. మీరు సంకోచిస్తున్నారు కాబట్టి, చెబుతున్నాను— వీటిల్లో దేనిలోనూ మత్తు పదార్థాలూ, బార్బిట్యురేట్సూ కలపలేదు నేను—" అన్నాడు నిటారుగా నిలబడి.

నవ్వకుండా ఉండలేకపోయింది ఆమె—అతనూ నవ్వాడు.......

"మరి, మీరు......" అందామె. అతనివేపుచూచి—

"ఇంతసేపా! ఆత్మారాముని సంతృప్తి ఎప్పుడో అయిపోయింది. — మీకంటే ముందుగా పూర్తిజేసి నందుకు అసలు మీకు నేను క్షమాపణ చెప్పుకోవాలి!"

"అదేమిటండీ—" అందామె.

"మీరు ఇది కానివ్వండి—నేను వస్తాను మళ్ళీ" అతను వెళ్ళిపోయాడు.

బ్రెడ్ టోస్ట్ అందుకుని, జామ్ వేసుకుంది దానిమీద—రాస్ప్ బెర్రీ జామ్.

అతనే చేశాడా ఇవన్నీ? ...... ఇంట్లో నౌకర్లెవరూ లేరా? అతని కుటుంబం అదీ.....

ఆలోచిస్తూ కాఫీ కానిచ్చింది ఆమె......ఇంతలో అతను వచ్చాడు.

"వెరీగుడ్—మీరు ఇక చదువు సాగించండి—వస్తాను" అన్నా డతను, ట్రే తీసుకు పోబోయి.

"ఆగండి" అందామె. అతను ఆగిపోయాడు.

"మీరు నన్ను చాలా ఇరుకున పెడుతున్నారు— నేను కడుగుతాను— మీరు వెళ్ళండి—" అందామె ట్రే అందుకుని. అతను క్షణంపాటు వేలవేపు చూస్తూ నిల్చుని, గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

మరి పది నిముషాల్లో అతను మళ్ళీ వచ్చాడు. అతన్ని చూచి, ఆమె లేచి నిల్చుంది — మొదటి సారిగా అతని ఎత్తూ, ముఖ వర్ఛస్సూ ఆమెకు తెలిసి నట్లయింది—దాదాపు ముప్ఫయి అయిదు సంవత్సరా లుండవచ్చు—అయిదున్నరడుగు లుంటాడు— బట్ట తల ప్రారంభిస్తున్నట్టు జుత్తు—పొడుగాటి ముక్కు. బ్లూ సూట్ వేశాడు. చేతిలో ఏదో ఫైలు ఉంది. అతను కోటు జేబులోంచి ఒక తాళం తీసి ఇచ్చాడు.

"ఇది ఇంటితాళం—డూప్లికేటు నా దగ్గ రొకటి ఉంది—మీరు బహుశా బయటికి పోవా లనుకుంటే మనం వచ్చిన దారినే పొండి— పార్కు వెంబడి వెడితే—'జింఖానా' వస్తుంది అక్కడ్నుంచి ఎక్కడికయినా పోవచ్చు బస్సులో— మంచి హోటళ్ళు రెండు ఉన్నాయి అక్కడే. నేను భోజనం అదీ ఇక్కడ చేయను—సాయంత్రం ఆరు—ఏడవుతుంది నేను వచ్చేసరికి—మీరు విశ్రాంతి తీసుకోవచ్చు— మీ ఇష్టం ఇక—"

అతను తాళం ఇచ్చి వెళ్ళిపోయాడు బయటికి.

తాళం పుస్తకం ప్రక్కనే ఉంచింది.

దూరంగా రోడ్డుమీద అతను ఆగి, బూటు లేసులు ముడి వేసుకోటం కన్పించిం దామెకు— పుస్తకం తీసుకుని మళ్ళీ చదువులో పడిందామె. పేజీలు తిరిగి పోసాగాయి......చాలాసేపు అలాగే చదివి భోజనానికి బయలుదేరిందామె ...... జింఖానా నిండా వచ్చేపోయే బస్సులూ, మనుష్యులు. అక్కడికి పోయి, రేపు ఇంటర్వ్యూ సమయానికి సరిగ్గా చేరుకునేందుకు బస్సు టైము కనుక్కుని వ్రాసుకుంది. భోంచేసి నెమ్మదిగా మళ్ళీ ఇల్లు చేరింది.

* * *

సాయంత్రం ఆరున్నరకంతా బాగా చీకటి పడింది—మధ్యాహ్నం అంతా చదవటంవల్ల తల నొప్పి రాసాగింది. ఎక్కడయినా రెండు ఆస్ప్రో మాత్రలుంటే బాగుండననిపించింది. గదిలో ఎక్కడా లేవు—తలుపుతీసి, గది బయట తోటలో నిల్చుంది. శుక్ల పక్ష చంద్రుడు అప్పుడే ఉదయించాడు. దూరంనుంచి బస్సుల సవ్వడీ, ప్రక్కనేఉన్న ఇళ్ళ నుంచి రేడియో పాటలూ విన్పించసాగాయి. కుర్చీ తెచ్చుకుని అక్కడ వేసుకుంది.

చల్లగాలితో మనస్సు తేలిపోసాగింది.

కాస్సేపు పుస్తకం అవతలఉంచి ఆలోచించ సాగింది. రేపు ఇంటర్వ్యూ ఎలా ఉంటుందో? తను బాగానే తయారయి వచ్చింది. క్రొత్త క్రొత్త విషయాలు కూడా చూచుకుంది. దాదాపు అరగంట సేపు అడుగుతారట ప్రశ్నలు—తలుచుకుంటే గుండె కొట్టుకోసాగింది. అయినా రేపుకదా.

ఒకవేళ తను సెలక్టు కాకపోతే?

మళ్ళీ కడప, మళ్ళీ అదే కాలేజీ, అదే విద్యార్థులూ, జీవితం—తన్ను చూచి విసుక్కునే వదిన, తను సంపాదిస్తున్నానని అవమానంగా భావించే నిరుద్యోగి తమ్ముడూ, తనకింకా పెండ్లి కాలేదని ఘోషించే తోటి అధ్యాపకులూ, వెక్కిరించే వాళ్ళూ.

ఒక్క రాజామాత్రం ఉంటాడు—తనకు తమ్ముడయినా, అన్నయినా, బంధువయినా, రాజా ఒక్కడే

ఒకవేళ సెలక్టయితే?

అందర్నీ వదిలి రావాల్సిందేనా?

తమ్ముడూ, అన్నయ్యా, అమ్మా ... .రాజా—?

"ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?"

రావు కంఠస్వరం విని ఉలిక్కిపడింది...... లేచి నిల్చుంది.ంది

"కూర్చోండి—కూర్చోండి ....." అన్నా డతను మరో కుర్చీ బయటికి తీసుకు వస్తూ.

"ఎంతసేపయింది మీరు వచ్చి?......." అందామె తడబడుతూ.

"అయిదు నిముషాలా ముప్ఫయి సెకండ్లు" అన్నాడు రావు వాచీ చూచుకుని ...

ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

"రేపు ఇంటర్వ్యూ పెట్టుకుని, ఇలా ఆలోచిస్తూ కూర్చుంటే ఎలా? ధైర్యంగా ముందుకు పోవాలి—మీ కర్తవ్యం మీరు కానివ్వండి—" అన్నా డతను.

"నేను ఆలోచిస్తున్నట్లు మీ కెలా తెలుసు?"— అందామె.

నవ్వా డతను చల్లగా, నెమ్మదిగా నవ్వాడు. ...

"మీ చేత్తో చెంపమీద తాకి చూచుకోండి" అన్నాడు చేతితో తాకింది ఆమె తన చెంపల్ని— వెంటనే సిగ్గుతో, అవమానంతో తలవంచుకుని, ఏమిటో కొంగుతో తుడుచుకుంది—కన్నీరు తనకు తెలియకుండానే ఎలా వచ్చింది?—

"క్షమించండి—మిమ్మల్ని ఇబ్బంది పెట్టానేమో"
అన్నాడతను. ఆమె అడ్డంగా తలూపింది.

"లోపలి బాధలు వెలికి చెప్పుకుంటే పోతాయి" అన్నాడతను మృదువుగా—ఆమె తలెత్తి చూచింది.

"ఎప్పుడో—కొన్ని కొన్ని విషయాలు బయటికి చెప్పుకుంటే కాని, ఆవేదన తగ్గదు. మీ బాధను తగ్గించుకోవచ్చు అలా— చెప్పండి! రేపటి ఇంటర్వ్యూ అంత ముఖ్యమైందా మీకు?" అన్నాడు రావు.....

ఆమె ఏమీ చెప్పలేక ఊరుకుంది.

"మీరు ఈ ఇంటర్వ్యూలో సెలక్టు అవుతారు. నేను చెప్పగల్ను" అన్నాడు రావు.

"మీ కెలా తెలుసు—?" అంది ఆమె. అతను నవ్వాడు.

"ఇంట్యూషన్ అనుకోండి—అలా అనిపిస్తుంది అంతే—"

కాస్సేపు ఇద్దరూ మాట్లాడలేదు.

"కడపలో మీతో మాట్లాడిన వ్యక్తి మీ తమ్ముడా?"

"కాదు—తోటి సహోద్యాయి! ఒకప్పుడు—ప్రస్తుతం స్నేహితుడు మాత్రమే— దురదృష్టవంతుడు—"

"ఏం?"

"అతనికి పెండ్లయిన సంవత్సరంలోనే భార్య కాన్పులో చనిపోయింది—ఎంతో మంచివాడు—"

అటునించి సమాధానం రాలేదు. తలెత్తి చూచిందామె........అత నక్కడ లేడు—

చుట్టూ చూచింది—తోటలో లేడు లోపలకి పోయింది—అక్కడ కిటికీలోంచి బయటికి చూస్తూ నిల్చుని ఉన్నాడు అతను—

"మీకు కష్టం కల్గించే మాటేదయినా అన్నానా" అందామె.

అతను అడ్డంగా తలూపాడు. తర్వాత ఆమెకు ఎదురుగా తిరిగి నిల్చున్నాడు—

"అతని పేరేమన్నారు—?"

"రాజు—"........అతను విషాదంగా నవ్వాడు. "భగవంతుడి 'సెన్స్ ఆఫ్' హ్యూమర్ ఇలాంటిది! రాజు—రావు!" అన్నాడు వింతగా.......

ఆమె ఆశ్చర్యంగా చూచింది!

అయితే అతను (రావు) వివాహితుడా? భార్య? వివునడానికి తోచక, అలాగే నిలబడిపోయిందామె. అతనే నిశ్శబ్దం భంగం చేశాడు.

"పదండి—భోంచేసివద్దాం—"

ఆమె మాట్లాడకుండా అతన్ననుసరించింది

హోటల్లో తింటూ, ఇద్దరూ తమ తమ కథల్ని చెప్పుకున్నారు—భోజనం కానిచ్చి, ఇంటికి వచ్చేసరికి దాదాపు తొమ్మిదయింది.

ఆమె నేరుగా తన గదిలోకిపోయి, చదువు మొదలెట్టింది.

రాత్రి పన్నెండు అయేవరకు అలాగే చదువుతూ కూర్చుంది. చదివినకొద్దీ భయం వేస్తోంది! అగాధంలాంటి సబ్జక్టు—పోయేకొద్దీ అంతు దొరకడం లేదు—

పన్నెండు గంటలయిపోయింతర్వాత పుస్తకం మూసేసి, కిటికీ దగ్గరకు వచ్చిందామె. అందులోంచి అతని గది కన్పిస్తోంది—అతను మూలగా టేబిలు మీద ఉన్న ఫోటో ఒకటి తుడుచి, దానిమీద ఉంచుతున్నాడు. దాన్ని అతను జాగ్రత్తగా టేబిలుమీద



ఉంచాడు. మళ్ళీ చేతుల్లోకి తీసుకున్నాడు. మృదువుగా దాన్ని చుంబించాడు. మళ్ళీ దాని వంకే చూస్తూ టేబిలుమీద ఉంచాడు తర్వాత అలాగే టేబిలు దగ్గర కుర్చీలో కూర్చుని, ముంజేతులమీద తల ఆన్చిఉండిపోయాడు.

చాలాసేపు అలాగే చూస్తూ నిల్చుంది ఆమె. తర్వాత దీపం తీసేసి పడుకుంది.

తలలో ఆలోచనలు ఉవ్వెత్తున అలల్లా రేగాయి. ఏమిటో ఆవేదన—తనొక్కతేకాదు—అందరూ ఇంతేనా? ఈ కొరవ, ఏదో అస్థిరత, ఏదో వెరపు, ఏదో దొరకని, చేయిజారిపోతూన్న ఇదమిత్థమనలేని వస్తువు అందరికీ ఒకటేనా?

* * *

మర్నాడు ప్రొద్దున్నే మళ్ళీ ఏడుకల్లా బ్రెడ్ టోస్టు, వెన్న, కాఫీలతో తయారయాడు రావు. ఇద్దరూ కలిసే టిఫిను కానిచ్చారు.

"అన్నట్లు మీ ఇంటర్వ్యూ ఎన్నింటికి?" అని అడిగాడు.

"రెండున్నరకి......." అంది ఆమె.

"అయితే మీరు ఒంటిగంటకే బయలుదేరి, భోజనం కానివ్వండి. నేరుగా బస్సెక్కి సమయా

గుర్రం కొనుక్కున్న రాముడు సోముణ్ణి అడిగాడు: "అయితే ఈ గుర్రం పేరూ?" అని "ఏమో మరి. నేమాత్రం 'ఎర్రి మొగమా' అంటా" నన్నాడు సోముడు.

నికి చేరుకోవచ్చు" అన్నాడు రావు..........లేవబోతూ.

"మీరు వెళ్ళాలా?" అంది ఆమె.

"అవునండి.......మీకు దోవ తెలుసా? రూట్ నంబర్ ఎనిమిది—"

"తెలుసులెండి" అంది ఆమె.

ఒంటిగంటకంతా డిగ్రీలూ, థీసిస్‌కాపీ, సర్టిఫికేట్లూ పట్టుకుని బయలుదేరింది ఆమె. ద్వారం దగ్గర కలిశాడు రావు క్షణంసేపు ఇద్దరూ మాట్లాడలేదు.

తను లెక్చరర్ ఉద్యోగానికి ఇంటర్వ్యూకు పోతున్నప్పుడు అమ్మకు నమస్కారంచేసి బయలుదేరింది. సెలక్టయింది—మొన్న బయలుదేరేటప్పుడు ఎందుకనో ఆ పని చేయలేదు.....

"వెళ్ళిరండి — ఏమాత్రం జంకు లేకుండా దంచేయండి—గుడ్‌లక్" అన్నాడు రావు.

అతని కంఠంనుంచి ఆ మాటలు ఉత్సాహంగా, ఆప్యాయంగా, ధైర్యం చెబుతున్నట్లు వచ్చాయి.

"థాంక్స్" అంది ఆమె బయటికి నడుస్తూ.

రోడ్డు వెంబడే నడుస్తూ పోతూ ఆలోచించసాగింది. ఎందుకింత గుండె దడ? ఇంటర్వ్యూవల్లనేనా ఈ ఆవేదన, లేక.........?

వెనుదిరిగి చూచింది ఇంటివేపు......

బయట గేటు దగ్గర నిలబడి తన వేపే చూస్తున్నాడతను.......తన్ని చూచి చేయి ఊపాడు......

* * *

ఇంటర్వ్యూకు దాదాపు పద్దెనిమిదిమంది వచ్చారు.......తను ఒక్కతే అందులో స్త్రీ. అందరూ తనవేపే చూడటం......హాల్లో కుర్చీలో కూర్చుని థీసిస్ చదవడం మొదలెట్టింది.

అయిదో ఏటినుంచి. పదహేడేళ్ళలో చదివి నేర్చుకున్నదంతా ఒక్క పావుగంటలో తూస్తారు—ఆ క్షణంలో అన్నీ జ్ఞాపకం రావాలి—సరిగ్గా జవాబీయాలి—తగ్గకూడదు—సందేహాలకు తావుండకూడదు. మొదటి అభ్యర్థి లోనికి పోయాడు. అందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు బయట......టి. ఏ. ఫారమ్ నింపి ఇచ్చేశారు......దాదాపు ఇరవయి నిముషాలకు అతను బయటికి వచ్చాడు. ముఖం వాడిపోయిఉంది ......అందరూ చుట్టూ మూగారు.

"బాబోయ్—దుమ్ము వదలగొడుతున్నాడు వాడెవడో! ఇక్కడి యూనివర్శిటీ రీడరుట—ఊరికే రమ్మన్నారుట— వాణ్ణి తప్పించుకోలేం!" అన్నాడు ముఖం కళలు మారాయి.

"ఆటామిక్ — ఎనర్జీనుంచి ఒకడు, ఇక్కడి అసిస్టెంటు డైరెక్టరూ, ఈ రీడరూ ఉన్నారు" అన్నాడతను.

దాదాపు అయిదున్నరకు అందరూ అయిపోయారు. ఆఖరున ఆమెను పిలిచారు— ఆమె గుండె కొట్టుకుంది— ఇంటర్వ్యూగదిలో అడుగుపెట్టింది — తలెత్తి చూచింది. కుర్చీలో కూర్చుంది— ఇంతలో ఎవరో వచ్చారు.. ..

"హలో— కూర్చోండి" అన్నాడు చేర్మన్ అతన్నుద్దేశించి. అతన్ని చూచి ఆమె ఉలిక్కిపడింది.

రావు నవ్వుతూ వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. ఆయనకు అక్కడేం పని? ఈయనేనా రీడర్ ! తనతన్ని అడగనైనాలేదు ఏంపని అని ! తన ఊరూ, పేరూ, ఉద్యోగం, జీతం వగైరాలన్నీ అడిగి అసలు సబ్జక్టు మీద ప్రశ్నలువేశారు....... రావుకూడా అడిగాడు. అతను అడిగిన ప్రశ్నలు చాలామటుకు తను చదివినవే— కాని సరిగ్గా, పూర్తిగా సమాధానం చెప్పడం చాలాకష్టమైనది—ఇంటర్వ్యూ అయిపోయింది— ఆమె బయలుదేరబోతూండగా చేర్మన్ అన్నాడు :

"ఉద్యోగమిస్తే వెంటనే చేరుతారా ?" అని.

"ఒక నెల టైము కావాలి" అందామె....

ఇంటర్వ్యూ కాగానే బయటికి నడిచింది.... తను ఎలా చేసిందో అని తర్కించుకుంది.... అన్నిటికంటె తనని అతను వేసిన ప్రశ్నలే చాలా చికాకు పెట్టాయి— కావాలనే అతను, తను ఇంటర్వ్యూ పానెల్‌లో ఉంటాడన్నసంగతి దాచి ఉంచాడా ? తనమీద అలా ప్రశ్నలు కురిపించడం ఎందుకు ?

తను బయటికి వచ్చి బస్సుకోసం కాచుకుని నిలబడింది

ఇంతలో అతను వచ్చాడు... కార్లో. అతనికి కారుందా? "రండి" అన్నాడు. ఆమె వెనక సీట్లో కూర్చుంది; అతని ప్రక్కగా...కొంచెం దూరంగా. కారు కదిలింది —

"మీరు చాలా బాగా సమాధానాలు చెప్పారు"— అన్నాడతను.

"మీరు అసలు పానెల్‌లో ఉంటారని చెప్పలేదే ? అందామె.

"నాకూ తెలియదు.... రెండు గంటలకి యూనివర్సిటీకి ఫోను వచ్చింది—నన్ను అర్జంటుగా రమ్మని. వెంటనే వచ్చాను...కాకపోయినా, వాడి ఫేవరెట్

ఇమిగ్రేష్ట—మీ దే బ్రాంచో నాకు తెలీదు—" అన్నా డతను....

"నాదీ అదే" అంది.

"ఇప్పుడు తెలుసుగా" అన్నాడతను.... కారు ఇంటిదగ్గర ఆగింది.... ఇద్దరూ దిగారు....

రాత్రి తొమ్మిదిన్నరదాకా మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఆమెకు తనమీద తనకే ఆశ్చర్యం కలుగసాగింది — ముక్కూ ముఖం తెలియని మని షితో ఈ పరిచయం ఏమిటి, ఈ మాటలేమిటి, ఈ వింత ఏమిటి అని.

అతనికీ అదే ఆలోచన. ఎన్నడూ లేనిది, ఇన్ని రోజులతర్వాత ఇప్పుడొక అపరిచిత యువతికి ఆతి ధ్యం ఇవ్వడం, ఇలా మాట్లాడడం— విచిత్రంగా ఉంది—

"మీకు సెలక్షన్‌వస్తే వచ్చి చేరుతారా ?" అన్నాడు.

"ఏమో !" అందామె.

"అంటే? మరి ఇంటర్వ్యూ కెందుకొచ్చారు?"

"ముందు ఎలాగో వచ్చేశాను... ఇప్పుడు అందర్నీ వదిలి రావడమంటే అదో బాధ అనిపిస్తుంది."

"అందరూ ఆలా అనుకుంటే దేశం ఏమవు తుంది ?"

ఆమె మాట్లాడలేదు. ఆమె అన్నది యదార్థమే. ఎంత ఆలోచించినా, అందరూ తనమీద ఆశలు పెట్టుకుని, ఆధారపడి ఉన్నప్పుడు, తను స్వార్థంతో తన బ్రతుకుదోవ తను చూచుకొని, గూట్లోంచి రెక్కలువచ్చిన పురుగులాగా ఎగిరిపోతే—వాళ్ళగతేం కావాలి ? తను ధర్మం నిర్వహించాలి కదా? బహుశా ఆ ధర్మనిర్వహణ భారంతోనే సుఖం ఉందేమో?

ప్రొద్దున్నే టాక్సీలో రైలుస్టేషనుకు బయలు దేరారిద్దరూ .... దారిలో ఇద్దరూ మాట్లాడలేదు. అతను గంభీరంగా, మౌనంగా కూర్చున్నాడు. కార్లో ఆమె ఉండి ఉండి అతనివేపు చూడ సాగింది. భావాలు లోపల ఎలా రేగుతున్నా బయటికి ప్రశాంతంగానే ఉంది.

"ఓ సంగతి అడగనా ?" అందామె అతనిని చూస్తూ.... గంభీరముద్ర తొలగి అతని ముఖంలో కొంచెంగా మందహాసం మొలిచింది.

"నిన్నరాత్రి మీరు తుడిచి టేబిలుమీద ఉంచిన ఫోటో ఎవరిది?" అంది. అతను కళ్ళార్పకుండా అలాగే చూడసాగా డామె వైపు....

ఆమె భయపడింది — తను అనుకున్నంతా అయిందా ? గతంలోని మధురస్మృతు లతన్ని వదలవా ? ఆ ఫోటో అతని భార్యదన్నమాట !

"చెప్పండి—" అంది మళ్ళీ, అలాగే చూస్తూ—

"బాబుది — మద్రాసులో తాతగారింట్లో ఉన్నాడు"

"ఎన్నేళ్ళు?" అందామె కుతూహలంగా.

ఆరేళ్ళు — మొన్ననే పుట్టినరోజు. అక్కణ్ణించే వచ్చింది మొన్న మీతోబాటు."

రైలుకోసం కాచుకుని, నిల్చున్నా రిద్దరూ... ఒకరికి ఏదో కావాలి—అదేదో తెలుసు— కాని అది లభిస్తుందా లేదా తెలీదు— మరొకరికి ఏదోకావాలి అదేదో తెలీదు—రైలు వచ్చేసింది. సెకెండ్ క్లాసులో కూర్చుందామె ... సామానంతా చేర్చాడతనులోనికి

"మీకు థాంక్స్ చెప్పాలి నేను—మీరే కనుక లేక పోతే—" మధ్యలో ఆగిపోయిందామె .... అతని కన్నుల్లోంచి ఏదో తీక్షణమైన భావం తన్ను ప్రశ్ని స్తోంది.....

క్షణమాత్రం మనస్సు స్వాధీనం తప్పింది — అతనికి. వెంటనే నిగ్రహించుకున్నాడు — ఛా ఏమిటీ బలహీనత! జీవితంలో ఇలా ఎన్నిరోజులు గడవలేదు — చీకటి నిండిపోయిన జీవితంలో ఇప్పు డీక వెన్నెల కురుస్తుందా ? ఇదేదో రాలిపోతూన్న చుక్కనుంచి అంతరిక్షంలో కరిగిపోయిన కాంతి— క్షణికం — రైలు కదిలింది నెమ్మదిగా — అతని గుండె కొట్టుకుంది— ఆమె అతన్ని నేరుగా చూడ లేకపోయింది — ఏమో చెప్పాలి—ఏదో ఎడదలోంచి కుతుక బిగించి మాట రానీదు—

"మీ పేరు నాకు తెలియదు" అంది వణికే పెదవుల్తో.

"రావు— మధుకరరావు" అన్నాడతను ఆశ్చర్య పోయి. రైలు వేగం హెచ్చించింది.

"నమస్కారం రావుగారూ— థాంక్స్—" అంది చేతులు జోడించి — "మళ్ళీ కలుద్దామని ఆశిస్తు న్నాను" అంది. గొంతు పెగిలిరాలేదు.

"మీపేరు చెప్పలేదు—" అన్నాడతను—

"లలిత" అంది .... కంట్లోంచి నీరు జారింది

అతనలాగే నిల్చుండిపోయాడు — అయితే ఆమె తిరిగి రాదు — లలిత అయితే ఆమె తిరిగ రాదు— తనకు తెలుసు. 

---

# శ్రీదేవి

19-వ పేజీ తరువాయి

ఉందనీ, శ్రీదేవికి జాకెట్లూ, పరికిణీలు కుట్టడం నేర్పుతానని చెప్పింది. శ్రీదేవి గదిని కొద్దిగా సర్ది, కొత్త అందం వచ్చేటట్లు చేసింది. మొత్తానికి ఆ ఇల్లువదిలి ఆమె వెళ్ళేసరికి ఆమె ఆ ఇంట్లో ప్రతి వ్యక్తి ప్రీతికీ పాత్రురాలైంది.

తన తల్లికి ఇలాంటివేమీ తెలియవు! పైగా అక్కర్లేకపోవడమువల్ల శ్రీదేవికి కుట్లూ, అల్లి కలూ మొదలైనవి ఎక్కువగా రావు. సుభద్రమ్మ తన కవన్నీ నేర్పుతాననడంతో, ఆమెలో ఎన్నో సర దాలు బయల్దేరాయి. ఏ వయసువారితో ఆ వయసు మాటలు మాట్లాడగల శక్తి సుభద్రమ్మకుంది. శ్రీదేవిని ఈ ఇంట్లో వాళ్ళెలా పెంచుతున్నారో ఆమె ఇట్టే గ్రహించింది. శ్రీదేవంటే సుభద్రమ్మకు ఎంతో ఇష్టం ఏర్పడింది.

ప్రస్తుతం ఆ ఇంట్లోఉన్న వాతావరణంలో సుభద్రమ్మలాటి వ్యక్తి ప్రవేశించడం శ్రీదేవి కెంతో ఆనందం కలిగించింది. ఎప్పుడూ తన తల్లి తండ్రులమధ్య జరిగే వివాదాలుతప్ప ఆమెకు ఆలోచించదగిన విషయాలే దొరికేవికాదు. అటు వంటిది సుభద్రమ్మ వచ్చి వెళ్ళాక, ఎన్నో కొత్త రకాల ఆలోచనలు ఆమె మనస్సులో ప్రవేశించాయి. ఎన్నో కొత్త విషయాలు తనకు తెలిసినట్లయింది. తన తెలివితేటల్నీ, కాలాన్నీ వినియోగించుకోవడానికి అనేక మార్గాలు స్ఫురించసాగాయి ఆమెకు. ప్రతి రోజూ సుభద్రమ్మకోసం ఎదురుచూడడం ఆమెకు పరిపాటయింది.

తరుచూ విశ్వేశ్వరరావుగారింటికి రావడానికి సుభద్రమ్మకు కూడా శ్రీదేవికి కుట్లూ, అల్లికలూ నేర్పడం ఒక సాకు అయ్యింది. ఆమెకు ఎనిమిదేళ్ళ కూతురూ, ఆరేళ్ళ కొడుకూ ఉన్నారు. తరుచూ తనతో వారిని కూడా తీసుకువస్తూండేది. అప్పు డప్పుడు తన ఇంటివద్ద మరిదిఉంటే అతనివద్ద పిల్లల్ని వదిలిపెట్టి వచ్చేది. కాని, అలా వచ్చినప్పుడు తొందరగా తిరిగి వెళ్ళిపోయేది. అందువల్ల శ్రీదేవి ఆమెను ఎప్పుడు వచ్చినా పిల్లల్ని తీసుకురమ్మని చెప్పేది.

లీలా, సురేష్, సుభద్రమ్మ కూతురూ, కొడు కూనూ. చాలా చలాకి అయినవాళ్ళు. వాళ్ళతో శ్రీదేవికి చాలా సరదాగా గడిచేది. వాళ్ళు బోలెడన్ని సినిమా పాటలు పాడేవారు. శ్రీదేవిని వీణమీద అవన్నీ వాయించమనేవారు. ఆమె వాయిస్తూండేది. తమ ఇంటికి రమ్మని శ్రీదేవిని అనేకసార్లు పిలిచారు. శ్రీదేవికి వెళ్ళాలనిఉన్నా, జయమ్మ ఒప్పుకోదనే భయంవల్ల అలాగే వస్తానని వాయిదా వేస్తూం డేది. సుభద్రమ్మకు కూడా జైలు జీవితంలాంటి ఈ ఇంట్లోంచి శ్రీదేవిని కాస్త ఊపిరి పీల్చు కునేట్లు చెయ్యాలని ఉండేది. ఆమెకు జయమ్మ ఊహలూ, అనసూయమ్మ మూర్ఖత్వం తెలుసు. వాళ్ళిద్దరికీ ఏ సరదాలూ అక్కరలేదు; వాళ్ళ ఉద్దేశం శ్రీదేవికీ అక్కరలేదనీ.

మూడు నెలలు తిరిగేసరికి సుభద్రమ్మ పొలం వ్యవహారాలు ఒక దారికి వచ్చాయి. శ్రీదేవి కుట్లూ, అల్లికలూ బాగా నేర్చుకుంది. జయమ్మకు, సుభ ద్రమ్మ చాలా ప్రీతిపాత్రురాలైంది.

అవాళ ఎలాగైనా శ్రీదేవి విషయం జయమ్మ దగ్గర కదపాలని సుభద్రమ్మ నిశ్చయించుకుంది. చాలాసేపు జయమ్మ తనకు చేసిన ఉపకారం గురించి జయమ్మను ఎంతో పొగిడాక, సుభద్రమ్మ, "రేపు లీల పుట్టినరోజు అత్తయ్యా! నువ్వొకసారి మా ఇంటికి రాకూడదా? మేం బీదవాళ్ళమైనా ఏదో—ఇంత నా చేత్తో చారూ అన్నం తిందువు గాని" అంది జయమ్మతో, తను అడగదల్చుకొన్న దానికి నాందిగా. శ్రీదేవి కూడా అక్కడే ఉంది. జయమ్మ మనస్సవాళ మంచిస్థితిలో ఉంది.

"నేనేం కదలగలనే సుభద్రా? నా వంట్లో ఈమధ్య మరీ బాగుండటంలేదు. లేకపోతే నీ ఇంటికి రావడంకోసం నీచేత ఇన్నిసార్లు అడిగించుకోవాలా?" అంది జయమ్మ.

"ఎప్పుడూ అలాగే అంటావు అత్తయ్యా! వదినె అసలే బయటికి రాదు. నీ వంట్లో బాగుండదు. అసలు మీ రెవరూ రాకపోతే పిల్ల పుట్టినరోజే చెయ్యను" అంది సుభద్రమ్మ కోపం నటిస్తూ.

"అదేమిటే అలా అంటావు. పోనీ శ్రీదేవిని పంపిస్తానులే; నీకు అంత సరదాగాఉంటే. కాని, నాకు తెలియకడుగుతాను! పోనీ పిల్ల పుట్టినరోజు మా ఇంట్లోనే చెయ్యకూడదూ. నే నన్నీ ఏర్పాట్లూ చేయిస్తాను" అంది జయమ్మ. సుభద్రమ్మ గొంతులో పచ్చివెలక్కాయ పడింది.

"అఁ! ఎందుకులే అత్తయ్యా బోలెడుమందిని పేరంటం పిలిస్తాను మరి. వాళ్ళందరూ వస్తే, ఇక్కడ మీకు నానా చికాకౌతుంది" అంది సుభ

ద్రమ్మ. జయమ్మకు పైవాళ్ళు ఈ ఇంటికి రావడం ఇష్టం ఉండదని తెలుసు. దుర్గాప్రసాద్ ఏ నిమిషంలో వచ్చి, ఏం రభస చేస్తాడోనని ఆ ఇంట్లో అందరికీ భయమే. ఈ విషయంలో ఆలోచించి జయమ్మ తన సలహాని ఉపసంహరించుకొంది.

"అయితే నీ ఇష్టం" అని ఊరుకుంది జయమ్మ.

"పోనీలే! శ్రీదేవినన్నా పంపిస్తానన్నావు. అదే పదివేలు" అంది సుభద్రమ్మ శ్రీదేవి రాకను నిశ్చయం చేస్తూ. జయమ్మ తప్పకుండా శ్రీదేవిని పంపుతానంది. తరువాత జయమ్మకు తనకోసం మనవరాలు కొత్తగా, మంచి రంగుదారాలతో ఎంబ్రాయిడరీ డిజైన్‌వేసి కుట్టిన దిండు గలీబు సంగతి జ్ఞాపకం వచ్చింది.

"శ్రీదేవికి నువ్వు కుట్లు నేర్పావుట. ఈ గలీబుమీద బాగా కుట్టిందే!" అంది జయమ్మ.

"అవునత్తయ్యా! ఈ రోజుల్లో పెళ్ళికావలసిన పిల్లలకు ఇవన్నీ వచ్చిఉండాలి. ఇవేకాక, మిషన్‌మీద బట్టలు కుట్టడం కూడా రావాలి. ఇప్పటి రోజుల్లో పెళ్ళి కొడుకులకు ఇవన్నీ కావాలి. నేను మద్రాసులో సంవత్సరం నేర్చుకున్నాను" అంది సుభద్రమ్మ.

"మా కాలంలో ఇవన్నీ లేవు. ఇప్పుడొచ్చిపడ్డాయి. ఏంచేస్తాం? వెనకటి పద్ధతులన్నీ మారిపోయాయి. అందుకే శ్రీదేవికి వీణ నేర్పిస్తున్నాం. స్కూలుకెళ్ళి చదువుకుంటానంది గాని, పెళ్ళీడు పిల్లని బయటకు పంపడం ఇష్టంలేక స్కూలు మాన్పించాను. అంతగా దాని అత్తవారికి చదువే కావలసివస్తే ఇంటిదగ్గరే ప్రయివేటు చెప్పిస్తాను" అంది జయమ్మ.

"చదువు కొంతమందికి కావాలి; కొంతమందికి అక్కరలేదు. కాని, ఈ చిన్న చిన్న విద్యలు వస్తే సంసారంలో ఎంతో ఉపయోగిస్తాయి. నా పిల్లల బట్టలన్నీ నేనే కుడతాను."

"ఆఁ! అది మంచి పద్ధతేనే. శ్రీదేవికి కూడా నేర్పిస్తూ ఉండు. నీకు వీలైనప్పుడు నీ చేతిలో దానికి కొంచెం శిక్షణ ఇచ్చావంటే అన్నీ అదే చేసుకోగలదు."

"అలాగే నత్తయ్యా! రేపు శ్రీదేవిని తప్పక పంపించు" అని సుభద్రమ్మ వెళ్ళిపోయింది.

## 2

ఆర్యాపురంలో ఒక చిన్న డాబాఇల్లు ఉంది. చుట్టూ పూల మొక్కలూ, ఒక చిన్న గేటూ, ఆ ఇంటిముందు చాలా ఆకర్షణీయంగా ఉంటాయి. ఆ డాబాకి ముందు గదిలో ఒక ఇరవై ఏళ్ల యువకుడు మంచంమీద ప్రొద్దున్న తొమ్మిదిగంటలైనా నిద్రపోతూనే ఉన్నాడు. చారల పైజామా, బనీనూ చిందరవందరగా పడిఉన్న జుట్టూ, అమాయకంగా కన్పించే మొహంతో అతన్ని చూసిన వాళ్లెవరైనా చాలా బుద్ధిమంతుడైన విద్యార్థి కాబోలు ననుకుంటారు. మంచంమీద అతని తలప్రక్కన ఒక పుస్తకం కూడా ఉంది.

"బాబాయ్! బాబాయ్! ఇంకా నిద్రలేవలేదా? లే! లే!" అంటూ ఒక ఎనిమిదేళ్ల అమ్మాయి అతన్ని లేపసాగింది. అతను కళ్ళు తెరిచాడు. అతనికి ఒళ్లంతా నీరసంగానూ, బద్ధకంగానూ ఉంది. విపరీతమైన దాహంవేసింది.

# శ్రీ దేవి

"ఓహో! లీలా! అప్పుడే తలంటి పోసుకొని, కొత్తబట్టలు తొడుక్కున్నావా! చాలా బాగున్నాయి. ఒక్క గ్లాసెడు మంచినీళ్లు తెచ్చిపెట్టు తల్లీ!" అన్నాడు ఆ యువకుడు.

"ప్రొద్దున్నే మంచి నీళ్లేమిటి వేణూ! తొందరగా లేచి, మొహం కడుక్కో! కాఫీ త్రాగుదువుగాని. అయినా రాత్రి రెండు గంటలదాకా స్నేహితులతో తిరిగితే, నీ ఆరోగ్యం పాడైపోదూ? ఇవాళ ఎలాగైనా నిన్ను ప్రొద్దున్నే బజారుకు పంపిద్దామనుకున్నాను. ఇంతవరకూ నీవు లేవకనేపోతివి. ఇవాళ విశ్వేశ్వరరావుగారి మనవరాలొస్తుంది భోజనానికి. కాస్త కూరలు తెచ్చిపెట్టు బజారుకెళ్ళి" అంది సుభద్రమ్మ, అప్పుడే లేచిన మరిది వేణుతో.

"ఓ! తప్పకుండా తెస్తాను వదినా. వందో. రెండువందలో నా మొహాన్ని పారేశావంటే, ఇంటికి కావలసిన సామాన్లన్నీ ఒకసారే తెచ్చిపారేస్తా" అన్నాడు వేణు.

"నీ చేతికి వందలిస్తే, సామాన్లబదులు వాటినే పారేస్తావు. నాకు తెలియదూ! నీకంత శ్రమ అక్కరలేదు. రెండు రూపాయలు ఇస్తాను. కూరలు తీసుకురా."

---

ప్రియుడు : నిన్ను హంసవనీ అందాల భరిణవనీ అంటున్నానే నమ్మకంలేదా కోపం ఎందుకూ?

ప్రేయసి : నాకు వుందిగాని ప్రక్కనే యీహోల్లో కూచున్నవారు నమ్మందే పైగా నవ్వాగు కూడా.

లక్ష్మణ్ (ఎమ్మార్)

---

వేణు ఆముదం తాగిన మొహం పెట్టాడు. "రెండు రూపాయలా? ఏం కూరలొస్తాయి వదినా? ఒక్క బంగాళదుంపలే వీసె అయిదు రూపాయ లుంటాయికదా......"

"అవునవును. నువ్వు వ్యాపారం చేసినప్పుడు అలా అమ్ముదువుగాని. ఇప్పుడుమట్టుకు వీసె ముప్పావలాయే" అంది సుభద్రమ్మ.

"బలే! బాబాయ్! బంగాళదుంపలు వీసె అయిదు రూపాయలా! బలే" అంటూ లీల కూడా నవ్వింది.

"ఆహాహ! మర్చిపోయా—వీసెకాదు—మణుగు అయిదు."

"ఇక్కడ మణుగు లెవరికి కావాలయ్యా? వీసె చాలు. నీ ఖర్చుకి ఒక రూపాయి ఇస్తానులే. ఇందులో కమీషన్ తీసుకోకు" అంది సుభద్రమ్మ కాఫీగ్లాసు మరిదికిస్తూ.

"థాంక్యూ! వదినా! ఆ మాట ముందరే చెప్పలేకపోయావా! ఇదుగో ఇప్పుడే మొహం కడుక్కొని వచ్చి, కాఫీ త్రాగుతాను" అని గబగబ పక్కమీదనుంచి లేచి, లోపలి కెళ్లాడు; కాఫీ గ్లాసు టేబిలుమీద పెట్టేసి. మరిదికి రోజుకి ఒకటీ, రెండూ రూపాయలిస్తేనే గాని, తన మాట వినడని సుభద్రమ్మకు తెలుసు. అందుకని అతనికి ఇవ్వవలసింది ఇచ్చేస్తుంది. సాధారణంగా డబ్బుతోకూడిన వ్యవహారాలేవీ, ఆమె మరిదికి అప్పగించదు. వేణు చేతిలోకి వెళ్లిన డబ్బు మరి తిరిగిరాదని ఆమెకు తెలుసు. అతనికి చాలా దురభ్యాసాలున్నాయి. గట్టిగా అతన్ని ఏమీ అనడానికి, ఎక్కడ ఎదురుతిరుగుతాడోనని, ఆమెకు భయం! తనమీద అతనికి గౌరవం చెడకుండా తను మెసలుకోవాలి. లేకపోతే అతను వేరైపోతే తనకు బొత్తిగా మగదిక్కుండదు.

సుభద్రమ్మ కార్యవాది. మరిది చెడు సావాసాలలోపడి పాడైపోతున్నాడు. తను ఆడది. ఇద్దరు పిల్లలు పసివాళ్లు. అయినా పెత్తనం తనే వహించి కుటుంబాన్ని జాగ్రత్తగా నడుపుకొస్తోంది. లోలోపల మరిది ఎలాటివాడైనా, పైకి 'మా మరిది చాలా మంచివాడు' అని చెప్తూ, అతనికొక మంచి పెళ్లి సంబంధం చెయ్యాలని ఆమె ఉద్దేశం. పెళ్లయితే, అతనికి బాధ్యత తెలుస్తుందని ఆమె ఆశ.

వేణు కాఫీ త్రాగి, రెండు రూపాయలిస్తానన్న వదిన దగ్గర నాలుగు రూపాయలు సంపాదించి, బజారుకు బయల్దేరాడు. కాఫీ హొటలుకీ, గోల్డుఫ్లేకు సిగరెట్టుపెట్టెకీ రెండు రూపాయలు ఖర్చు చేశాడు. కాలేజీ హాస్టలుకి వెళ్లి కొంతమంది స్నేహితులతో కొంతసేపు బాతాఖానీ చేశాడు. అతను కాలేజీలో చదవకపోయినా, టెన్నిస్ బాగా ఆడతాడు కాబట్టి, కొంతమంది విద్యార్థులతోనూ, లెక్చరర్లతో కూడా పరిచయముంది. అంతేకాక, నాటకాలలో కూడా బాగా వెయ్యగలడు. ఈ సంవత్సరం ఎలాగైనా తను కాలేజీ రంగస్థలం ఎక్కాలని నిశ్చయించుకొన్నాడు.

మధ్యాహ్నం పన్నెండు గంటలదాకా తను మామూలుగా తిరగవలసిన చోట్లన్నీ తిరిగాక, ఇంటికి వెళ్దామని అనుకున్నప్పుడు, తను బయల్దేరిన సంగతి జ్ఞాపకమొచ్చింది. తను అసలు కూరలు కొనడానికి బయల్దేరాడు. కాని, ఆ సంగతే మర్చిపోయి, ఊరంతా తిరిగేస్తున్నాడు. అప్పుడు కూరల బజారుకు వెళ్లాడు.

తొందరగా తనకు కనిపించిన కూరలేవో కొనేసి ఇంటిమొహంపట్టాడు. ఒక రిక్షాను పిల్చి, అందులో కూర్చున్నాడు. రిక్షా కదలబోతుంటే ఎదురుగుండ సైకిలుమీద, కళ్లకు గాగుల్సు పెట్టుకొని, నవనాగరిక పద్ధతిలో దుస్తులూ, జోళ్లూ ధరించిన ఒక పద్ధెనిమిదేళ్ల స్త్రీ కనిపించింది.

"హల్లో! మిస్టర్ వేణూ! ఎక్కడి కెళ్తున్నావ్?' అని, సైకిలు దిగి పలకరించింది. వేణు కూడ నవ్వుతూ, రిక్షా దిగి ఆమెతో మాట్లాడసాగాడు "హల్లో! మిస్ నళిని! ఇప్పుడే కాలేజీకి వెళ్ళి వస్తున్నాను. స్పోర్ట్సు సెక్రటరీతో మాట్లాడాను. మిక్సెడ్ డబుల్సు మాచెస్ ఏర్పాటు చేస్తానన్నాడు. అబ్బ! ఎండలో నీ ముఖం ఎర్రగా ఎలాకందిపోయిందో!"

"ఊహూ! నా ముఖం ఎండకు ఎర్రపడలేదు. నువ్వు ఇవాళ మా ఇంటికి వస్తానని ఎందుకు రాలేదూ?"

"అందుకు కోపంవచ్చి ఎర్ర బడిందా? సారీ! ఏవో చికాకులవల్ల రాలేకపోయాను. సాయంకాలం తప్పకుండా వస్తా. టెన్నిస్‌అయిపోగానే మీ ఇంటికి వస్తాగా" అని నళినికి సమాధానం చెప్పుకుని, తనొక అత్యవసర పనిమీద వెళ్తున్నానని ఆమెతో చెప్పి, రిక్షాను పోనిమ్మన్నాడు. నళిని సైకిలెక్కి కాలేజీకి వెళ్ళిపోయింది.

నళిని కాలేజీలో బి. ఏ. మొదటి సంవత్సరం చదువుతోంది. టెన్నిస్ ఆడుతుంది. అన్ని విషయాల

సమానంగా తిరుగుతుంది. ఆమెకు తండ్రిలేడు. తల్లి ఉంది. వేణు రాజమండ్రి వచ్చి కొద్దినెలలే అయినా, నళినితో అతను చాలా చనువుగా తిరుగ తాడు. ఆమెఇంటికి చాలాసార్లు వెళ్లాడు. నళినికి అతనంటే చాలా అభిమానం. అతని టెన్నిస్ ఆట లోని నైపుణ్యానికి ఆమె ముగ్ధురాలైంది. వేణు ఆమె మనస్సును చాలా సులభంగా హరించాడు. నళిని కళ్లు విశాలమైనవి. శరీరచ్ఛాయ కూడా తెలుపు. సినిమా తారలా అలంకరించుకొనే ఆమె రూపం, కాలేజి కుర్రాళ్ల మనసులలో చాలా కలవరం రేపేది. కాని, ఆమె ఎవర్నీ లెక్కచేసేదికాదు. వేణుమాత్రం ఆమె అభిమానానికీ, అనురాగానికి పాత్రుడయ్యాడు.

వేణుకి నళినిఅంటే చాలా ఇష్టం కలిగింది. అలాటి చలాకీ ఆడపిల్లతో సావాసం ఉంటే జీవితం కులాసాగా, సరదాగా గడిపేయ్యొచ్చునని అతని అభి ప్రాయం.

ఇంటికి చేరేటప్పటికి తన గదిలోంచి నవ్వులు వినిపిస్తున్నాయి. లోపలికి వెళ్లాడు. అక్కడ లీలా, సురేష్, మరొక కొత్తమ్మాయీ క్యారమ్సు ఆడు తున్నారు. తనని చూడగానే ఆ కొత్తమ్మాయి కొంచెం కంగారుపడి లేచింది. లీల ఆమెతో "మా బాబాయే" అంది. సురేష్, వేణు దగ్గరికి వచ్చి 'బాబాయ్! ఆవిడెవరో తెలుసా! శ్రీదేవి వదిన" అని చెప్పాడు. ఆమె విశ్వేశ్వరరావుగారి మనుమరాలు శ్రీదేవి అని గ్రహించాడు వేణు.

ఆమెవైపు రెప్పవాల్చకుండా కొద్దిసేపు చూశాడు వేణు. అతనిలో ఆశ్చర్యానందాలతో కూడిన ఒక భావం ఉదయించి, శరీరమంతా ఒకరకమైన తేలి పోతున్న అనుభూతి పొందింది. ఒక స్త్రీ ఇంత అందంగా ఉండడం అతను తన కళ్లతో ఇంతవరకూ చూడలేదు. యవ్వనం, సౌందర్యం, సంపదా—మూడూ కలిసి ఆమెలోంచి ఒక వింత వెలుగును ప్రసరింప జేస్తున్నాయి. ఆమె మెడలో ఒక రాళ్ల నెక్లెసూ, చెవులకు రవ్వల కమ్మలూ, చేతులకు రాళ్లగాజులూ ఆమె సహజ శరీరచ్ఛాయయైన బంగారపు రంగు మీద అద్భుతంగా మెరుస్తున్నాయి.

శ్రీదేవి వేణును చూసి కంగారుపడి లేచి, లోప లికి వెళ్దామనుకొంది. కాని, లీల, తమ బాబాయే నని చెప్పడంతో ఏంచెయ్యాలో తోచక, అలాగే నిలబడిపోయింది. తలమాత్రం వంచుకునేఉంది. వేణుకు తను ఆమెవైపు చూస్తున్నాననే భావం కూడా కలగలేదు. నీలిరంగు పట్టుపరికిణీ, వోణీ, రవికె వేసుకున్న ఆమె అందం వేణును స్తబ్ధుణ్ణి చేసింది. సురేష్, "అలా చూస్తావేం బాబాయ్, నువ్వు కూడా మాతో ఆడుదువుగాని రా!" అని పిల్చాక, అతను మామూలు ప్రపంచంలో పడ్డాడు.

ఇంతలో సుభద్రమ్మ వచ్చి, "వచ్చావా వేణూ! ఏదీ ఆ కూరలబుట్ట ఇలా తేవే లీలా! అన్నట్టు శ్రీదేవీ! ఇతను మా మరిది. మీరు నలుగురూ కాస్సేపు ఆడుతూఉండండి. వంటఅయిపోవచ్చింది" అని శ్రీదేవిని, సిగ్గుపడనవసరం లేదన్నట్టు వేణుతో పరిచయంచేసి, లోపలి కెళ్ళిపోయింది.

వేణుకి- వదినె ఆ నిముషంలో ఒక దేవతలా కన్పించింది. శ్రీదేవి మునపటిలాగే నుంచోడం చూసి, "మీరు బాగా ఆడతారా?" అని అడిగాడు ఆమె నుద్దేశించి. శ్రీదేవి జవాబియ్యలేదు.

కర్ తో ఎలా కొట్టాలో చాతకాదు. నేనే నేర్పు తున్నాను" అన్నాడు గర్వంగా.

"అలాగా! అయితే నేనూ, ఆమే ఒక పార్టీ; మీ రిద్దరూ ఒక పార్టీ. ఆడదాం రండి" అన్నాడు వేణు. లీల అలాగేనంది.

శ్రీదేవి, "ఉహూ! నే నాడను" అంది; ఎటు వైపో చూస్తూ. వేణు చాలా ఆశాభంగం చెందాడు. కాని లీలా, సురేష్ శ్రీదేవిని ఆడమని బ్రతిమాలడం వల్ల శ్రీదేవి ఆడక తప్పలేదు. ఆట ఆడుతున్నంత సేపు శ్రీదేవి, వేణువైపు చూడనేలేదు. వేణుమాత్రం నఖశిఖపర్యంతం ఆమెను పరీక్షిస్తున్నాడు.

ఆమె కను—ముక్కుతీరు, చక్కగా సరిదిద్ది నట్లుంది. ఆమె మాట్లాడితే ఎంతో మధురంగా ఉంది. వేణు ఆమె సౌందర్యానికి తన్మయుడవడమేకాక, ఆమె చూపిస్తున్న బెట్టుకు, ఎలాగైనా ఆమె పరి చయం వృద్ధి చేసుకోవాలనే కాంక్షతో బాధపడు తున్నాడు. శ్రీదేవి నాతని అనికిని కూడా గమ నించనట్లు కూర్చుంది.

> డాక్టరు: భార్య నీ మాట వినదూ అని అంటున్నావే బాగా బుద్ధి చెప్పక పోయావా?
>
> రాజారావు: సరి సరే! డాక్టర్! గట్టిగామాటాడితే అదే నాకు బుద్ధి చెబుతుంది. ఎందు కంటే దానికి చెప్పుడని నలు గురికీ తెలుస్తుందేమో!
>
> అప్పాజీ (బెజవాడ)

వేణు, ఆటమధ్యలో ఆమెకు స్ట్రయికర్ తో ఎలా కొట్టాలో ఒకటి రెండుసార్లు చూపించ బోయాడు. కాని, ఆమె అతనిని శ్రద్ధగా గమ నించనూ లేదు; అతను చెప్పినట్లు ఆడనూ లేదు. ఇంతకాలం తన మద్రాసు అనుభవంలోనూ, రాజ మండ్రిలోనూ ఇంత బెట్టుగా ప్రవర్తించిన అమ్మా యిలను అతను చూడలేదు. మద్రాసులో పలుగు రమ్మాయిలతో అతనికి బాగా పరిచయముంది. రాజమండ్రిలో, కాలేజీ అమ్మాయి లెవరైనా తను పలకరిస్తే, అందుకోసమే ఎదురుచూస్తున్నట్లు వాళ్లు చొరవగా మాట్లాడడం అతనికి అనుభవమే. నళిని అతనంటే వెర్రి అభిమానం చూపిస్తుంది. శ్రీదేవి తరహా కొత్తగా ఉంది.

ఆటయిపోయింది. భోజనానికి అంతా లేచారు. సుభద్రమ్మతో శ్రీదేవి చనువుగా మాట్లాడడం చూశాక, వేణుకు కొంత ధైర్యం వచ్చింది. శ్రీదేవికి అల్లికల గురించి, కుట్ల గురించి ఏవేవో వివరాలు సుభద్రమ్మ చెప్పసాగింది. శ్రీదేవి శ్రద్ధగా వింది. భోజనం చేస్తున్నంతసేపూ వేణు మౌనంగా ఊరు కున్నాడు.

అతని బుర్రలో అనేక ఆలోచనలు పరిగెత్త సాగాయి. మొట్టమొదట ఇంత అందమైన అమ్మాయి

అని ఆలోచించాడు. బహుశా గర్వమై యుంటుంది. తనేదో మామూలు మనిషనుకొంది. తనొక పెద్ద టెన్నిస్ ఆటగాణ్ణని, నటుడనని ఆమెకు తెలియదు. ఆమెకు గొప్పవాళ్ల బిడ్డననే అహంభావం ఉందేమో. కాని, సుభద్రమ్మతో బాగానే మాట్లాడుతోంది. వదినె ఆ అమ్మాయి మనసును బాగా కనిపెట్టింది. తనంటే శ్రద్ధ చూపించకపోయినా తను మాత్రం ఆమె యెడల శ్రద్ధ చూపించదల్చుకొన్నాడు. అదేమి విచిత్రమో, కొందరు స్త్రీలు మగవాళ్లని కాదని కసిరికొట్టినా, ఆ స్త్రీల వెనుకే ప్రాధేయపడుతూ తిరుగుతారు మగవాళ్లు. కాని, కొందరు స్త్రీలు తమకోసం ఆరాటపడుతూ తిరిగినా, వాళ్లని లక్ష్యం చెయ్యరు మగవాళ్లు. ఆడది బెట్టుగా ఉన్నంతవరకే కాబోలు ఆమెలో ఆకర్షణ! నిజానికి నళినిఅంటే వేణు కెంతమాత్రం ఆకర్షణలేదు. కాని, నళిని వేణుని మనస్ఫూర్తిగా ప్రేమించి, ఆమె సర్వస్వాన్నీ అతని కర్పించింది. నళినే మొట్టమొదట తనకు తానై వేణుతో పరిచయం చేసుకుంది. అతనిని తన ఇంటికి ఆహ్వానించింది. తన ప్రేమ నతనికి వ్యక్తం చేసింది. అయినా సందముంది నళినుకు ఒక్క శ్రీదేవి కాలిగోటితో పోలరని వేణు నిశ్చయించు కున్నాడు. ఈ కొద్దిసేపటిలోనూ తనలో సహ జంగా ఉన్న స్త్రీల నాకర్షించగల శక్తి, శ్రీదేవి మీద ఏమీ పనిచెయ్యలేదని తెలుసుకున్నాడు. కాని, అంతమాత్రంచేత అతను నిరుత్సాహం చెందలేదు. వేణు ఉద్దేశంలో ప్రణయం ఒక ఆటవంటిది. అందులో ఓడినవాడు నిరుత్సాహం చెందకుండా మళ్లీ మళ్లీ ప్రయత్నం చెయ్యాలి. ఎంత కష్టానికైనా వెనుదియ్యకూడదు. తొంభైతొమ్మిదిసార్లు ఓడిపోయినా, ప్రయత్నిస్తే నూరోసారి గెలవచ్చు. దానికి కావలసినది గట్టి గుండె. వేణుకి అది ఉంది. అతని హృదయం చాలా గట్టిది. నోరూ, నాలుకా మాత్రం బహు మెత్తనివి—అవి సమయానుకూలంగా ప్రవర్తిస్తాయి.

ఆవాళ కూతురు పుట్టినరోజుకోసం ప్రత్యే కంగా బాదంహల్వా చేసింది సుభద్రమ్మ. అంతే కాకుండా, మద్రాసువైపు వంటకాలయిన కూటూ, సాంబారూ చేసింది. అవి తింటూంటే శ్రీదేవికి జిహ్వలేచొచ్చింది. తమ ఇంట్లో వంటవాడు వండే పప్పు పులుసులో ఈ రుచి వస్తేరాదు. కూరల దగ్గర్నుంచి, పిండివంటలదాకా సుభద్రమ్మ వంటలో ఏదో ప్రత్యేకత కన్పించింది శ్రీదేవికి.

భోజనాలయిన తరువాత శ్రీదేవి వెళ్ళిపోతానంది కాని, సుభద్రమ్మ ఆవాళ పేరంటం అదీ ఉందనీ, సాయంకాలందాకా ఉండమనీ శ్రీదేవిని కోరింది. శ్రీదేవికి, తల్లిదగ్గరకన్నా అమ్మమ్మైన జయమ్మ దగ్గర చాలా భయం. అంతసేపు తనిక్కడ ఉంటే ఆమె ఏమంటుందోననే భయం పెళుబుచ్చింది. ఆమెకు మనసులో ఉండాలనే ఉందని పసిగట్టిన సుభద్రమ్మ తను సాయంకాలం శ్రీదేవితో కూడా వచ్చి, జయమ్మకు నచ్చ చెబుతానని హామీఇచ్చి, శ్రీదేవిని ఉంచేసింది.

వేణు తన గదిలో సిగరెట్టు కాల్చుకుంటూ, తన గది కిటికీలోనుంచి బయటకు చూస్తూ ఆలో చించాడు. తక్కిన విషయా లెలాఉన్నా, శ్రీదేవికి సుభద్రమ్మంటే చాలా ఇష్టంఅని గ్రహించాడు. సుభద్రమ్మ ఏం చెప్పినా శ్రీదేవికి నచ్చుతోంది.

సురేష్, "ఆట ఏమీ రాదు బాబాయ్! [illegible]

# శ్రీ దేవి

తను కూడా వదినెను పొగిడి, తద్వారా శ్రీదేవి దగ్గర్నుంచి ఒక మాటైనా రాబట్టుకోవాలనుకున్నాడు. ఇంతసేపై, తను ఎంత ప్రయత్నించినా తన మాటలకు ఆమెవద్దనుంచి తగిన ప్రత్యుత్తరం రాలేదు. తన నసలు ఆమె లెక్కే చెయ్యటంలేదు.

"అవన్నీ మా బాబాయి టెన్నిస్‌లో గెలిచిన కప్పులు" అని లీలా, సురేష్ తన గదిలో అల్మారు తలుపుతీసి, పై అరలోఉన్న కప్పుల్ని శ్రీదేవికి చూపించి చెప్పడం విని, వేణు వెనకకు తిరిగాడు. శ్రీదేవి దగ్గరనుంచి చిన్న సమాధానం వచ్చినా, ఆమె తనవైపు చూసినా, ఆమెవైపు తన సమ్మోహనాస్త్రంలాంటి మందహాసం ప్రయోగిద్దామనుకున్నాడు.

"అది డిజైన్ల పుస్తకమా? ఏదీ ఇలా తే!" అని రెండో అరలో ఉన్న ఒక పుస్తకాన్ని తీసింది శ్రీదేవి. ఆమెకు టెన్నిస్ ఆట అంటేనే ఇష్టంలేనట్లుంది. వేణుకు ఏమీ తోచలేదు.

"లీలా! మీ వదినెని ఒక పాట పాడమనవూ?" అన్నాడు వేణు దీనంగా, శ్రీదేవివైపు చూస్తూ. శ్రీదేవి అతని మాటల్ని వినిపించుకోలేదు. లీల మట్టుకు, "వదినా! ఒక పాట పాడవూ!" అని అడిగింది. అంతవరకూ లోపల పన్లు చేసుకుంటున్న సుభద్రమ్మ వచ్చి, శ్రీదేవి చూస్తున్న డిజైన్ల పుస్తకం గురించి, తాంబూలం వేసుకుంటూ శ్రీదేవితో మాట్లాడ నారంభించింది. వేణుకు, తన వదినె కూడా తనంటే నిరాదరం చూపిస్తోందనిపించింది.

"వదినా! ఆవిడ చాలా బాగా పాడ్తారుకదా. ఒక్కపాట పాడమనవూ!" అని మళ్లీ తన అభ్యర్థన తన వదినె ద్వారా శ్రీదేవికి విన్నవించుకోవాలని చూశాడు. సుభద్రమ్మ శ్రీదేవిని పాడమందామనుకొంది కాని, వేణు మాటలు విని, నుదురు చిట్లించి, మొహం ప్రక్కకు తిప్పుకున్న శ్రీదేవిని చూసి, పాట పాడడం ఆమె కిష్టంలేదని గ్రహించింది. మరిదియొక్క స్థితిని కొద్దిగా పసిగట్టింది.

"ఇప్పుడే భోజనంచేసి ఏం పాడుతుందిలే. ఈసారి వచ్చినప్పుడు పాడుతుంది" అని అతనికి సర్ది చెప్పింది. సుభద్రమ్మ, తరువాత శ్రీదేవివైపు తిరిగి, "మా మరిదికి పాటలంటే చాలా ఇష్టం. టెన్నిస్ చాలా బాగా ఆడతాడు. నాటకాల్లో వేస్తాడు. ఎన్నో ప్రైజులు వచ్చాయి. మద్రాసులో అతన్ని తెలియని వాళ్ళు లేరు" అంది.

శ్రీదేవి, "అలాగా!!" అంది. వేణు కూడా, ఆమె సుభద్రమ్మ మాటలు విని శ్రీదేవి ఒక్కసారి తనవైపు చూసి, మళ్లీ తల తిప్పేసుకోడం చూసి, మనసులో 'అలాగా' అనుకున్నాడు. చివరికి వదినెగారి మాటలవల్లనైనా తననొక మనిషిగా గుర్తించింది, ఈ అందాల రాశి! ఇదే అదను—తను ఉపయోగించుకోవాలి అనుకొని, "ఈనెలాఖరున కాలేజీలో ఒక డ్రామా వేస్తున్నాం, మీకు రావడానికి వీలుంటే తప్పక రండి!" అన్నాడు శ్రీదేవి నుద్దేశించి, ఈ అవకాశంలో ఆమె తోటి సరసాగా నాలుగు కబుర్లు చెప్పేద్దామని నిశ్చయించుకున్నాడు.

"ఉహూ! వీలుండదు. నాకు నాటకాలంటే ఇష్టంలేదు" అంది శ్రీదేవి. వేణు నీరుకారిపోయాడు.

అప్పటికే మధ్యాహ్నం మూడు గంటలు దాటటంవల్ల ఇక పేరంటానికి ఆడవాళ్లు వచ్చే సమయమైందని, సుభద్రమ్మ లేచి, హాలంతా సర్దడం ప్రారంభించింది. వేణు, ఇక మరి లాభంలేదని, బట్టలు వేసుకొని, టెన్నిస్ రాకెట్ చేతితో పట్టుకొని బయటికి వెళ్ళిపోయాడు. ఆడవాళ్లు ఒక్కొక్కరే రావటం మొదలెట్టారు. అందరికి ప్లాస్టిక్ సంచీలలో స్వీటూ, హాటూ, పంచిపెట్టి, లీలను కుర్చీలో కూర్చోబెట్టి హారతిచ్చింది సుభద్రమ్మ. వచ్చిన ఆడవాళ్లందరి దృష్టి శ్రీదేవిమీదే ఉంది. ఆ అమ్మాయి ఎవరో తెలుసుకొని, ఆమె అందాన్నీ, భాగ్యాన్నీ పొగడని వాళ్లు లేరు. ఒక వయసుమళ్లిన ఆమె, "ఎవడు తపస్సు చేస్తున్నాడో, ఈ బంగారు బొమ్మకోసం అంది, శ్రీదేవిని చూస్తూ. శ్రీదేవి సిగ్గుపడింది ఎందువల్లనో ఆ మాటలు విని. ఆమె కొద్దిగా చలించింది. ఎవరో ఒక అజ్ఞాత వ్యక్తి అదృష్టం గురించి వాళ్లు పొగడుతున్నారు. ఎదురుగా కన్పిస్తున్న తన కన్నా, వాళ్ల దృష్టిలో ఆ వ్యక్తే గొప్పవాడులాగుంది.

సుభద్రమ్మ తను మొదట అన్న ప్రకారం సాయంకాలమయ్యాక శ్రీదేవిని తను పిల్లలతో సహా వెళ్లి దిగబెట్టింది. జయమ్మ, శ్రీదేవి ఇంతసేపు పై ఇంట్లో ఉన్నందుకు చిరాకు చూపించబోయింది కాని, సుభద్రమ్మ తియ్యని కబుర్లూ, అంతకన్నా తియ్యని పసందైన బాదంహల్వా ఆమెనిట్టే శాంతపరిచాయి. ఒక పళ్లెంనిండా హల్వా, తమతోబాటు తెచ్చింది సుభద్రమ్మ. జయమ్మ అది ఆరగిస్తూ మెత్తబడిపోయింది.

"చాలా బాగానే చేశావే హల్వా, సుభద్రా! నీ కూతురు జీవితం ఇంత తియ్యగా గడవాలని ఆశీర్వదిస్తున్నా"నంది జయమ్మ.

"మీ నోటి వాక్యానికి తిరుగులేదు. ఏదో మామీద అభిమానముండబట్టి శ్రీదేవిని పంపించారు. నాకు చాలా ఆనందమైంది."

"అదేమిటే అలా అంటావ్? మీ ఇల్లు పరాయియిల్లా ఏమిటి? నా కటువంటి తేడాలు లేవు సుమీ. శ్రీదేవిని కావలిస్తే అడుగు."

"అబ్బే ఎంతమాట! నేనూ అదే అనుకుంటున్నాను. వారానికో, పదిరోజులకో ఒకసారి శ్రీదేవిని మా ఇంటికి తప్పకుండా పంపిస్తూండండి. మిషను మీద కుట్టడం నేర్పుతాను."

"అలాగేలే. దానికి ఎప్పుడు బుద్ధి పుడితే అప్పుడు మీ ఇంటికి వస్తూంటుందిలే" అని జయమ్మ సుభద్రమ్మ ప్రార్థనను మంజూరు చేసింది. అది విన్న శ్రీదేవికి చాలా ఉత్సాహం కలిగింది. తన మనస్తత్వాన్ని బాగా అర్థం చేసుకున్నందుకు సుభద్రమ్మ మీద శ్రీదేవికి చాలా గౌరవం ఏర్పడింది.

(సశేషం)

డదు. కాని ఆహార — గతికి ఆటంకం కలిగినప్పుడు, ఆహారంతా మండించే, పుల్లని ద్రవం వాంతి అయి ఆ నొప్పి కొద్దిగానో, పూర్తిగానో ఉపశమిస్తూ ఉంటుంది.

మలబద్ధకం యీ వ్యాధిలో సాధారణ లక్షణమనే చెప్పవచ్చును. ఆకలి బాగానే ఉంటుంది. అల్సరు మండుతున్నా, జీర్ణం జరుగుతూనే ఉంటుంది గనక, రోగి సాధారణంగా చిక్కిపోడు. కాని, ఆటంకంవల్ల తిన్నదల్లా వెళ్ళిపోతున్నప్పుడు రోగి కృశించిపోతాడు.

మొదట్లో ఈ ఆకలినొప్పులు, కొన్ని వారాలో, కొన్ని మాసాలో ఉండి, తరువాత కొన్నాళ్ళ కనబడకుండా పోవచ్చును. కొన్ని ఋతువుల్లో ఈ బాధ అధికంగా ఉండవచ్చును. బాధ నమసిపోయి బాగా ఉన్నవారిలోనే, ఆందోళన కాని, బాధ కాని కలిగే పరిస్థితులు ఏర్పడ్డప్పుడు, హఠాత్తుగా కడుపులోనూ శూల ఆరంభం కావచ్చును. అలాగే చలి గాలి తగిలినప్పుడు, గొంతులో క్రిమిదోషం ఏర్పడినప్పుడు, పడిశం పట్టినప్పుడూ అణగిఉన్న బాధ అధికం కావచ్చును. మద్యపానం ఈ బాధను అధికం చేస్తుంది.

అల్సరుతో బాధపడే చాలమందిలో మలిన రక్తము వారి మలంలో కనిపిస్తుంది. ఈ రక్తము కాఫీపొడరు రంగులో ఉంటుంది. సకృతుగా ఇటు

# మనమూ-మన దేహస్థితి

17—వ పేజీ తరువాయి

వంటి పదార్థమే వాంతి కావడమూ కద్దు. అల్సరు అంతకంతకు లోతై, రక్తనాళములను తిన్నప్పుడు ఇలా జరుగుతుంది.

డుయోడినంలో అల్సరు ఏర్పడినప్పుడు, జఠరాశయంలో ఆహారం ఎక్కువసేపు ఉండదు— కాని బాధ మరీ ముదిరినప్పుడు పైలోరస్‌లో ఉండే స్ఫింక్టరు దుస్సంకోచం పొంది బిగుసుకుపోయినందున కడుపు పెద్దదై సాగి, పెద్దది కావచ్చును. జఠరాశయ రసములను పరీక్షించి చూస్తే హైడ్రోక్లోరిక్ ఏసిడ్ అధికంగా ఉన్నట్లు తెలుస్తుంది.

జఠరాశయ వ్రణం కలిగించే బాధకూ, డుయోడిన — వ్రణం కలిగించే బాధకూ కొన్ని ప్రధాన భేదములున్నవి. జఠరాశయంలో అల్సరు బాధ ఆహారం తినగానేనో, తిన్న కొద్దిసేపటికో వస్తుంది. డుయోడినం — అల్సరులో కొన్ని గంటలు ఆలస్యంగా వస్తుంది. ఆ బాధ శరీర మధ్యరేఖకు దగ్గరగా ఉండక, కొంచెం కుడివైపున, ప్రక్కటెముకలకు రెండు మూడు అంగుళములు క్రిందుగా ఉంటుంది. జఠరాశయం — అల్సరుబాధ కొన్నాళ్ళుండడమూ కొన్నాళ్ళ లేకపోవడమూ అంటూ ఉండదు.

జఠరాశయం — అల్సరులో రక్తవాంతి తరుచ ఉంటుంది. కాని రక్తభేది, సాధారణంగా జరగదు. పిత్తాశయంలో ఇన్‌ఫ్లమేషను ఏర్పడప్పుడు ఇదే ప్రదేశంలో విపరీతమయిన బాధ ఏర్పడుతుంది. కాని ఆ బాధకూ, ఆహారానికీ ఏమీ సంబంధం ఉండదు. ఉదరంలో బాధ కలిగినప్పుడల్లా అల్సరే అని అనుకోకూడదు. పైలోరస్‌లో ఏర్పడే కేన్సరు వల్ల కూడా యీ లక్షణాలే ఏర్పడవచ్చును. అయితే ఆ బాధకూ విరామం ఉండదు. పేంక్రియస్ గ్రంథి వాచినా, కడుపులో శూల ఏర్పడుతుంది. కాని అప్పుడు తిన్నదంతా వాంతి అయి, ఆహారం జీర్ణంకాక, రోగి త్వరగా క్షీణిస్తాడు.

డుయోడినల్—అల్సరు బాధపెడుతూ బహుకాలం ఏ క్లిష్టపరిస్థితులూ ఏర్పడకుండానే ఉండవచ్చును. అది పెద్దదై, మాని, డుయోడినం ఆకారమును మార్చి ఆహార — గతికి ఆటంకం కలిగించి, తిన్నదంతా వెళ్ళిపోయి, శరీరంలో నిర్జలస్థితి, లవణ నష్టము (Depletion of Salt) ఏర్పడవచ్చును. క్షుద్రాహిత్యము, చికాకు, మాంద్యము ఏర్పడవచ్చును. లక్షణములు అల్సరు ఉన్న స్థితిని బట్టి, అది కలిగించే విషమ పరిస్థితులనుబట్టి మారుతూ ఉంటవి. కాని సాధారణంగా ఆహారానంతరం కొంతకాలానికి బాధ కలగడం, ఏమయినా తింటే ఉపశాంతి కలగడం డుయోడినల్ అల్సరుకు విశిష్ట లక్షణాలనే చెప్పవచ్చును. ★

---

వరద. ఏళ్ళు, సెలయేళ్ళు, రాళ్ళు, బొమ్మరాళ్ళు బండరాళ్ళు. ఏళ్ళ పొంగిన నీళ్ళు. ఊళ్ళు మునిగే నీళ్ళు. వాళ్ళు తడిసే నీళ్ళు. పొలాల్లో నీళ్ళు. వాకిట్లో నీళ్ళు. ఇళ్ళల్లో నీళ్ళు. కళ్ళల్లో నీళ్ళు. కాళ్ళు మునిగే నీళ్ళు. మోకాళ్ళ మునిగే నీళ్ళు. తొడలోతు నీళ్ళు మొలబంటి నీళ్ళు!!

సూర్యకాంతిలో ధగధగా మెరుపుతీగల్లా ఒరల్నించి తీసి గుంపులుగా నేసిన రత్నాలు తాపిన కత్తుల్లా నీళ్ళు. వెన్నెల కాంతుల్లో రత్నాశ్రయాలైన సంజీవి పర్వత సామువుల్లా మెరసే నీళ్ళు. చీకటిరాత్రుల్లో నిశాదేవి వేణీభరంలా నల్లగా, అజాతశత్రుని ఎదలా గంభీరంగా లోతైన నీళ్ళు.

కన్నీళ్ళు, మున్నీళ్ళు. ఇళ్ళు మునిగే నీళ్ళు. ముళ్ళు తిరిగే నీళ్ళు. కళ్ళు తడిసే నీళ్ళు. వళ్ళుమండే నీళ్ళు.

రాళ్ళ నీళ్ళ నల్లాల్లో నీళ్ళు, కళ్ళాల్లో నీళ్ళు. రాజులిళ్ళ నీళ్ళు. నాయులిళ్ళ నీళ్ళు. రాయుళ్ళిళ్ళ నీళ్ళు. ఆ యిళ్ళ వంటనీళ్ళు. సాపాలపంటనీళ్ళు.

సుళ్ళుసుళ్ళుగా నీళ్ళు. కాళ్ళల్లో ముళ్ళు. నోళ్ళల్లో మన్ను. కరువు. గంజినీళ్ళు.

మా ఎరికలో ఇంత వరద ఎరగమనేవాళ్ళు. నది చరిత్ర పరిశీలించి కట్ట ఎత్తు పెంచమని సవాళ్ళు. నిజానికి తల్లికి పరిమితి నిర్ణయించగల వాళ్ళెవళ్ళు.

ఎన్నాళ్ళీ నీళ్ళు. ఎన్నేళ్ళీ నీళ్ళు. వాళ్ళు నీళ్ళలవిన నీళ్ళు. ఊళ్ళూ వాళ్ళూ ఏకం చేసే నీళ్ళు. ఇళ్ళన్నీ పిచిక గూళ్ళు. వాళ్ళన్నీ గాజురాళ్ళు.

నతుల కంట నీళ్ళు. నతుల కంఠాలకు నీళ్ళు. కవుల కలాలకు నీళ్ళు. కవులు పాలాలకు కీళ్ళు.

నీళ్ళ కాళ్ళకు సంకెళ్ళు, నోళ్ళకి తాళాలు, ఇళ్ళకి గొళ్ళేలు.

ఏళ్ళు బయళ్ళూ ఊళ్ళూ బీళ్ళూ ఏకంచేసే నీళ్ళు.

# పన్నీరు-కన్నీరు

21-వ పేజీ తరువాయి

పరుగెత్తే నీళ్ళు. ప్రవహించే నీళ్ళు. పరవళ్ళు తొక్కే నీళ్ళు. విధి వదలిన నీళ్ళు.

అంతా జలమయం.

*　*　*

నీరు నీరు నీరు. చన్నీరు పన్నీరు కన్నీరు. త్రాగే నీరు. వాడే నీరు. కురిసే నీరు. మెరిసే నీరు. నీరు నీరు ఏటినీరు. కట్టకట్టేవారు. ఆనకట్టనీరు. గోదావరి నీరు నది నీరు వదలేరు.

పరుగెత్తే నీరు. ప్రవహించే నీరు. ధగధగ మెరిసే నీరు. భగభగమనే మంటల్ని చల్లార్చే నీరు.

భగీరథుని తపఃఫలం. తపన బాపే నీరు. పితృ దేవతలకి పుణ్యలోకాలికి దారినిచ్చేనీరు. దేవతలకిరీటాల్లా మిరుమిట్లు గొలిపే నీరు. ఇంద్రనీల కాంతుల్ని వెదజల్లే నీరు.

మిన్నుల నీరు. కన్నుల నీరు. ఇంట నీరు. పంట నీరు. కాటన్‌దొర కష్టఫలం. కృషీవలుల యిష్ట దైవం నీరు. పైరు తడిసే నీరు. పంట పండే నీరు. కరువు బాపే నీరు. ఎరువు కోరని నీరు. పరువు నిలిపే నీరు.

మానవాళికి మంచి కాలం. కూలీ నాలీ రైతూ ఆర్తిలొలిగే నీరు. ఆర్తత్రాణం నీరు. ఆనందదాయకం నీరు. ధాన్యరాశులకు నీరు. చెరుకువంటలకు నీరు. గోదావరీ మాత నీరు. తెలుగుతల్లి ఆనందబాష్పాల నీరు.

పెద్దకాలువ నీరు. చిన్నకాలువ నీరు. పంటకాలువ నీరు. పిల్లకాలువ నీరు. మడి తడిసే నీరు. కూడిచ్చే నీరు. దుర్భిక్షం దూరంచేసే నీరు. వెలుగురేనికి జన్మనిచ్చిన నీరు. ఆంధ్రశ్రీ అవతరించిన నీరు.

ఉన్నత పర్వత శిఖరాలపై ఋతుపవన ధారాపాతం. నాసికాత్రియంబకతీర్థం. మహానది గోదావరి మోక్షస్వరూప సాక్షాత్కారం. మహారాష్ట్రం విశాలాంధ్రం మందాకిని మాతృ దర్శనం గౌతమి అఖండగౌతమి. భీమా, ముచికుందా, శబరి కిన్నెరసానీ అఖండ గోదావరి. వశిష్ఠ, వైనతేయ కౌశిక గౌతమి తుల్యభాగ గోదావరి. గోదావరి తెలుగువారి బాధాహారి.

# 3
## వెనుకటి కథ

వెంకట శాస్త్రిగారంటే ఎరగనివాళ్ళెవరూ లేరు కూరపాడుగ్రామంలో. కలిమిలేములు రెంటినీ చూసి, ఆకళించుకుని నిలదొక్కుకుని గ్రామంలో నిజాయితీపరుడనీ, నిజం మాట్లాడేవాడనీ పేరు తెచ్చుకున్నారు. వారసత్వంగా లభించిన రామభక్తి ఆచారకాండ, బహుశ్రుతులతోడి సాంగత్యం ప్రసాదించిన వేదాంత దృష్టి ఆయన్ని లేనిరోజుల్లో హీనశక్తికి దిగజారకుండా కాపాడాయి. వోపికలో భూదేవివంటి గృహిణి సహాయంతో, సంప్రదాయ సిద్ధమైన పౌశల్య సంపత్తి కలిగిన కొడుకునీ, కూతుర్నీ పెంచుకుంటూ కాలం గడుపుకుంటూ ఉండేవారు.

ఊరు చిన్నదైనా, డబ్బున్నవాళ్ళు ఎక్కువ కావడం; వయస్సులో ఉన్నవాళ్ళ గ్రామానికి పెద్దలైన సమయం రావడంతో ఆయనకి ఒత్తిడి ప్రారంభమయింది. ఆయన చిరుగుల ధోవతిని చూసి హేళనచేసేవాళ్ళు వృద్ధిఅయ్యారు. ఆయన వృద్ధ మేధ అంతస్తునీ, సందుహృదయం పరిపక్వాన్నీ

చూసి గౌరవించి నమస్కరించేవాళ్లు క్రమంగా తక్కువయ్యారు. కొడుకూ, కూతురూ పెరగడం దీనికింకా తోడయింది. పట్టుమని పదేళ్లులేని కూతుర్ని పెళ్లి ఇంకా కాలేదని నలుగురూ నాలుగు విధాలా అనడం సాగించారు. ముసలాయన వెలి కిజడిసేటట్లు లేడనేవారు. కొడుకును ఆ ఎదిగే వయస్సులో పొరుగువాళ్ల ఎత్తిపొడుపులూ, హేళనలూ కుంగదీయడం మొదలెట్టాయి. అతనికింకా అలాంటివాటికి తట్టుకుని చిరునవ్వుతో ముందుకు సాగే మనస్థైర్యం రాలేదు. అక్కడికీ శాస్త్రిగారు రోజూ భగవద్గీత చదివి చెబుతూ, తామరాకుమీది నీటిబొట్టులా ఉండాలని బోధించేవారు. కాని బడికి వెళ్లి చదువుకుంటూ రోజూ సహాధ్యాయుల ఇకిలింతలతో గడపాల్సిన కొడుకుమాత్రం పూర్తిగా ఆ పద్ధతిలోకి రాలేకపోయాడు. అదికుళ్లు చూస్తే, వళ్లుమండే వయసు.

కూతురుపెళ్లి సమస్య రోజులు గడుస్తున్న కొద్దీ మెల్లిమెల్లిగా త్రివిక్రమావతారం దాల్చింది. గృహిణి రోజూ ఓపిగ్గా జ్ఞాపకంచేసేది సమస్య త్వరగా తీర్చవలసిన ఆవశ్యకతనిగురించి. ఆరోజుల్లో సమయం మించితే సంఘంలో వెలే. పాపం శాస్త్రిగారు చేతనైనంత ప్రయత్నం చేస్తూనే ఉండేవారు. కట్నాలూ లాంఛనాలూ లేకుంటే మానె, కడుపు నిండా భోజనమైనా పెట్టలేని వాళ్ల అమ్మాయి నెలా చేసుకుంటాం అనేవారు కొందరు. పిల్ల గుణగణాల్ని, రూపురేఖల్ని చూసి ఒక తండ్రి ఒప్పుకోడానికి సిద్ధమవుతుంటే, శాస్త్రిగారంటే పడని మరో శర్మగారు ఆయన్ని దారిలో అడ్డంకొట్టి "భిక్షమెత్తుకు తిరిగేవాడి కూతుర్ని మీ ఇంటి కోడల్ని చేసుకుంటారా" అన్నాడట. అంతటితో ఆ సంబంధం వెనకట్టింది.

ఇలా ఉండగా, ఒకనాడు జులాయిగా తిరిగే గ్రామమునసబుగారబ్బాయి అర్ధరాత్రివేళ ఇంటికొస్తుంటే పాము కరిచింది. నురగలు కక్కుకుంటూ పడిపోతున్న అతన్ని స్నేహితులు ఇంటిదగ్గరకు మోసుకొచ్చారు. మునసబుగారు ఖంగారుపడుతూ ఆ ఊళ్లో మామూలుగా మంత్రంవేసే రామయ్యకు కబురు పెట్టారు. ఆవేళ వాళ్ల ఖర్మంకాలి అతను ఊళ్లో లేడు. ఇంట్లో అందరూ గొల్లుమన్నారు. గొడవ దగ్గర్లో ఉన్న శాస్త్రిగారింట వినబడింది. శాస్త్రిగారికీ, మునసబుగారికీ చాలా ఏళ్లుగా మైత్రీ, గౌరవభావం ఉండేవి. అలాంటిది ఆమధ్య వారబ్బాయి శాస్త్రిగారమ్మాయిని ఏదో పోకిరిమాటలనటం, మునసబుగారు గారాబంగా పెరిగిన కొడుకుని వెనకేసుకు రావడంతో, వారిద్దరి మధ్యా సంబంధాలు తెగాయి. అయినా ఇలాంటి కష్టసమయంలో వెనకటి సంగతులు ఎందుకు అడ్డురావా లనుకున్నారు శాస్త్రిగారు. మీద కండువా వేసుకుని బయల్దేరి వచ్చారు. సంగతి తెలుసుకుని తొందర్లో స్నానంచేసి వచ్చి, వాళ్లబ్బాయి దగ్గిర కూర్చుని అతన్ని ముట్టకుండా ఏదో మంత్రపఠనం చేశారు. ఇది పాముల రామయ్య పద్ధతికంటె వేరుగా ఉంది. పది నిముషాల్లో ఏం జరక్కపోయేసరికి అందరూ బాపనోళ్ల మంత్రాలకి చింతకాయలు రాల్తాయా అంటం మొగలెట్టారు. ఇంకాసేపటికి శాస్త్రిగారు కళ్లు తెరచి లేవోయి అన్నారు. అంతే అప్పుడే నిద్రలేంచి

# పన్నీరు - కన్నీరు

లేచినవాడిలా లేచి కూచున్నాడు. మునసబుగారు శాస్త్రిగారి కాళ్లమీద పడ్డారు. వెనక జరిగిందానికి క్షమించమన్నారు. కాసేపాగి, "మీ పిల్ల పెళ్లి ఏర్పాట్లు చేయించండి. ఖర్చు సంగతి నేను చూసుకుంటాను." అన్నాడు.

ఆ పద్దత్తుమీద సంబంధం కుదర్చటం, పెళ్లి చేయటం అట్టే కష్టంకాలేదు. డబ్బు లేకున్నా బుద్ధిమంతుడూ, కాస్త చదువుకున్నవాడూ అయిన ఒక చిన్నవాణ్ణి చూసి పెళ్లి చేశాడు. మరి రెండేళ్లకి కూతురు అత్తవారింటికి వెళ్లింది. కొడుకు శ్రద్ధగా పంచశాస్త్రాలూ, వేదాలూ, వ్యాకరణం, తర్కం బాగా చదువుకుని దిట్ట అయ్యాడు.

శాస్త్రి దంపతులు వృద్ధులయ్యారు. తల్లి మంచాన పడ్డదంటే చూడ్డానికి వచ్చింది కూతురు. నాలుగురోజులు పుట్టింట నిలిచింది. ఒకనాడు సాయంకాలం ఇంకా పూర్తిగా చీకటి పడకముందే ఆ అమ్మాయి చెరువునించి ఇంటికి వస్తుంటే ఇద్దరు పోకిరీలు అడ్డంకొట్టి బలాత్కారం చెయ్య



గొప్పవారి అబ్బాయి ఉత్తరం తడబడుతూ చదువుతుంటే పక్కింటి కామాక్షి అడిగింది. వాడికి పెద్దయితే యిలా అవాటు అవుతుందేమోనని. వాడి తల్లి.

"అక్కరలేదు. నాకు సెక్రటరీని పెట్టుకుంటాడు గల్లీ." అంది.

ఏడుకొండలు, (మద్రాసు)



బోయారు. ఆమె కేకలు విని ఎవరో వస్తే, పారిపోయారు. ఆమె ఏడుస్తూ ఇంటికి జేరుకుంది. భార్యని తీసికెళ్లడానికి అల్లుడు వస్తే, ఎవరో ఊదారు ఆయన చెవుల్లో ఈ సంగతి. ఆమె కొంచెమేనా ఇష్టం చూపకపోతే వాళ్లామె వెనకెందుకు పడతారన్నారొకళ్లు. అంతా అయ్యాకే కేకలేసిందన్నారింకొకళ్లు. ఆయన అత్తవారింటికి వెళ్లకుండానే అక్కడినించే వెళ్లిపోయాడు. తరువాత వాకబుచేస్తే తన ఊరు కూడా వెళ్లలేదని తెలిసింది. జందెం తెంపుకుని సన్యాసుల్లో కలిసి వెళ్లిపోయాడన్నారు కొందరు. శాస్త్రిగారి కూతురు అవమానం భరించలేక చెరువులో పడి ఆత్మహత్య చేసుకుంది. అసలే జబ్బుతో ఉన్న తల్లి ఆరోజునే భగవంతుణ్ణి చేరుకుంది. శాస్త్రిగారి సంగతి మరీ అధ్వాన్నం. ఆయన బ్రతికిఉన్నా అంతకంటె లేకుంటేనే నయం అనేట్టుంది పరిస్థితి. మామూలు మనుష్యులకంటె ఉన్నతస్థాయిలో ఉంటూ, మనస్థైర్యం, స్థితప్రజ్ఞతా కలిగిన మహానుభావులు కూడా ఒకప్పుడు పరిస్థితుల్నిబట్టి చెలరేగిపోతారు. ఎప్పుడూ కోపంరాని అజాతశత్రుని కోపంలాగా అలాంటివాళ్ల దైన్యం వాళ్లకీ, చూసేవాళ్లకీ కూడా భరించరానిది. ఆయన అరవై ఏళ్ల జీవితంలో ఎప్పుడూ మానని సంధ్య, జపం పూర్తిగా మానేశారు. కన్నార్పకుండా ఎటో శూన్యంలోకి అలా చూస్తుండేవారు. "ఏమి న్యాయమయ్యా ఇది" అని భగవంతుణ్ణి ఆయన ప్రశ్నిస్తూ ఉండచ్చు.

అప్పటికి కొడుక్కి పాతికేళ్లు దాటి ఉంటాయి. అతనికి తన యింట జరిగిన ఈ సంగతులు విపరీత ఆవేశం కలిగించాయి. కొన్నాళ్లు దీనికంతకూ కారకులైన దుర్మార్గులెవరోనని వాకబు చేశాడు. అప్పుడు కనక వాళ్లు దొరికితే తన జన్మసంస్కారం, తండ్రి నేర్పిన అహింసా సూత్రాలు — అన్నీ మరచిరక్తం కళ్లజూసేవాడే. అయితే ఊళ్లోవాళ్లు కొంతమంది తెలియకా, కొంతమందికి తెలిసి, తమవాళ్లని కప్పుకునేటందుకూ అతనికేమీ ఆచూకీ ఇవ్వలేదు. ఇంతలో శాస్త్రిగారికి కాలం సమీపించి వెళ్లిపోయారు. కొడుకులో ఒక విధమైన నిరస్తభావం, స్తబ్ధత కలిగాయి. ఎవరితోనూ మాట్లాడ్డం మానివేశాడు. తండ్రికి కర్మ యధావిధిగా చేశాడు. మర్నాడు వాళ్ల పూరి కొంప అంటుకుంది. అందరూ వచ్చి ఆర్ప ప్రయత్నము చేసేటప్పటికి పూర్తిగా దగ్ధమైపోయింది. శాస్త్రిగారబ్బాయి అందులో దహనమైపోయాడనుకున్నా రందరూనూ.

## 4

## నరసింహంగారు

ఒకనాడు పొద్దున్నే సూరపరాజుగారు ఊరి బయటకు వెడుతూంటే ఒక వ్యక్తి ఊళ్లోకి వస్తూ కనబడ్డాడు. కొత్తమొహం పసిగట్టి ఆయన్ని నిలబెట్టారు. పేరేమిటన్నారు. నరసింహం అని పిలవండి అన్నాడా వ్యక్తి. ఎక్కడికి వెడుతున్నారు, ఏం పనంటే ఏదో దారిలో ఈ ఊరు తగిలిందన్నాడు. మిగిలిన మామూలు ప్రశ్నలకేమీ సమాధానం ఇవ్వలేదు. ఆ ముఖంలో కనబడే వర్చస్సు సూరపరాజుగార్ని ఆకర్షించింది. ఆ కళ్లల్లో కనబడే పేరుకుపోయిన దైన్యత, స్తబ్ధత ఆయన గుండెల్ని కదిలించాయి. "రండి మా యింటికి; తరువాత చూద్దాము" అని తీసుకెళ్లారు. ఇంటికి వచ్చిన మనిషి అలా మాదన్నగారింట్లో అక్కన్నలా, 'భడదీది'లో సురేంద్రుడిలా అలా జడుడిలా ఉండిపోయాడు. స్నానం, సంధ్య, తోచినంత భోజనం; మిగిలిన సమయంలో అలా చూస్తూ శూన్యంలోకి, ఉదాసీనంగా ఉండటం, ఇది ఆయన కార్యక్రమం. రెండు మూడు సార్లు ఆయన సంగతి కనుక్కోవాలని కదిలించి చూశారు సూరపరాజుగారు.

"మందేఊ రన్నారు?"

"ఏం చంటారు ?"

"మీ ఊరేదని అడుగుతున్నాను."

"ఏ ఊరూ లేదం డిప్పుడు."

"అహా ! అసలే ఊరని?"

"ఏం లేదండి."

"మీ నాన్నగారు . . . ?"

"లేరండి."

"పేరేమి టన్నారు ?"

. . . . . . . . . .

"మీ ముఖం చూస్తే మంచి వంశంలో పుట్టినవారిలా తోస్తున్నారు."

"మా నాన్నగారు మంచి పండితుడండి."

"ఏ ఊళ్లో ఉంటూ ఉండేవారు ?"

. . . . . . . . . .

. . . . . . . . . .

"మీ బంధువు లెవరైనా ఈ ప్రాంతంలో ఉన్నారండి ?"

"లేరండి."

"ఏదో బాగా దెబ్బతిని ఉన్నట్టు కనబడుతున్నారు. ఏదో సంగతి, మరోలా భావించకపోతే ..... ?"

నరసింహంగారు ఒక క్షణం ఊరుకుని లేచి బయటకు వెళ్ళిపోయారు. నరేనని సూరపరాజు గారు ఊరుకున్నారు; సద్బ్రాహ్మణుడు; ఇంట్లో ఉండనీ; ఎప్పటికేనా మనుష్యుల్లో పడకపోతాడా అని.

రోజులు గడిచిపోతున్నాయి. ఏ శక్తులు నడిపిస్తే, రెండు జిల్లాలు దాటి ఈ ఊరు వచ్చాడో, ఏ ఆకర్షణ ఆయన్ని ఈ ఊళ్లో సూరపరాజుగారింట్లో ఉంచిందో ఇతరులకే కాదు; ఆయనక్కూడా తెలియదు. నలుగురూ నాలుగు విధాల అనుకునేవారు కాని, సూరపరాజుగారంటే ఉన్న గౌరవంకొద్దీ ఎవరూ పైకి ఏమీ అనలేదు. నరసింహంగారు మెల్లిగా కొంచెం మారడం మొదలెట్టాడు. సంధ్య, జపం యథావిధిగా ఆచరించడం, కొంతవరకూ వేదాధ్యయనం సాగించాడు. పెద్ద బామ్మగారు "రావో ఓరేయి మనవడా ఆఁ" అని ఆప్యాయంగా పిలిచి దగ్గిర కూర్చోమని కబుర్లు చెప్పేది. తన పాత గాథని విడిచి, అన్ని విషయాలూ మాట్లాడేవారు.

ఒకనాడు బాబాయిగారు ఎవరో ఇంకో ఆశ్రితునితో అంటున్నాడు: "ఉన్నవాళ్లందరూ చాలక ఈ పిచ్చి బ్రాహ్మణ్ణి నెత్తిమీద కెక్కించుకున్నాడేమి టీయన. ఎక్కడేనా చుట్టమా పక్కమా ? ఏదో అభ్యాగతిగా వచ్చినవాడు రెండురోజు లుండి పోక" అని తనకి పెట్టేదేదో దీనివల్ల తగ్గిపోయినట్టు. సాయంకాలం నరసింహంగారు సూరపరాజుగార్ని సమీపించి "ఇంతవరకూ నన్ను దయతో చూశారు. ఇంక సెలవిప్పిస్తే వెడతాను" అన్నారు. ఆయన ఏమీ అనే లోపుగానే వెనకనించి లక్ష్మమ్మగారు "అదేమిటోయి అప్పుడే వెడతా నంటున్నావు. మా యింటి కొచ్చినవాళ్ళు వెడతా ననడం మాకు పరువు—తక్కువ కాదూ ?" అంది. పెద్ద బామ్మగారు "ఎందుకో పాపం పిచ్చినాయన వెళ్లిపోతా నంటున్నాడు. ఉండమని కాస్త నచ్చ చెప్పరా రాజా" అన్నారు. సూరపరాజుగారు కొంచెం కబుర్లలో దించి కూపీ లాగారు. "ఇంక ఫరవా లేదు. మనిషిలో ఈమాత్రం చలనం కలిగింది, మనుష్యుల్లో పడతాడు" అనుకున్నారు. ఆయన కింకెవరూ లేరన్న విషయం స్పష్టమైంది కనక ఎలాగైనా వెళ్లనివ్వకూడ దనుకున్నారు. మెల్లిగా అలా షికారుకి తీసుకెళ్లి కబుర్లలో దింపారు. లేదు. పిల్లలికి రెండు ముక్కలు చెప్పి, ఏదో బ్రాహ్మణకుర్రాళ్లకి వేదాధ్యయనం చేయిస్తూ ఇక్కడ ఉండకూడదూ ?" అని అడిగారు. నరసింహంగారు ఒక క్షణం ఆగి "అలాగైతే సరే" నన్నారు, అప్పుడింక ఇంకొకళ్లమీద ఆధారపడక్కర్లేదుకదా అని. మర్నాడే తమ యింట్లోనే వీధరుగుమీద పాఠశాల ప్రారంభం చేయించారు సూరపరాజుగారు.

నరసింహంగారికి మంచి వాక్శుద్ధి, వాగ్ధాటి ఉన్నాయి తెలుసుకుంటే. పిల్లల్ని పోగేసుకుని పాఠాలు చెప్పడం, వేదం చదివించడం మొదలెట్టాక, వెనకటి సంగతులు కొంతవరకూ మరచి, పిల్లలలో కలిసి కాలం గడుపుతున్నారు. సూరపరాజుగారి మొదటి అబ్బాయి సుబ్బారావు ఆయన ప్రథమ శిష్యుడు. పిల్లల్ని బాగా ఆకర్షించాడాయన. ఊళ్లో చాలామంది పిల్లల్ని ఆయనదగ్గరికే పంపడం సాగించారు. అదివరకు కునికిపాట్లు పడుతూ పిల్లల్ని చింత బరికెతో చావమోదుతూ చదువుచెప్పే వీధిబడి పంతులు రామశర్మ గిరాకీ తగ్గిపోయింది. ఆ ఊరి పురోహితుడి దగ్గరికి ఎవరూ వేదపాఠాలకి వెళ్లడంలేదు.

రామశర్మ సూర్యనారాయణగారి దగ్గరికిపోయి మొరబెట్టుకున్నాడు. సాటి నియోగపాడి కడుపు కొడుతూంటే ఊరుకుంటారా అన్నాడు. ఆయనక్కూడా ఎక్కణ్ణించో వచ్చిన ఆ వైదీకిని నెత్తినెక్కించుకుని ఊరున్నమ్ముకున్న వానవాణ్ణి అధోగతి పాలుచెయ్యట మేమిటనిపించింది. ఊళ్లో కొందరు పెద్దల్ని కదిపి చూశాడు. రాయుడన్నాడు:

"ఏంటయ్యా! సూరప్పరాజుగారు పిచ్చి బ్రాహ్మడి గొడవలో పడి, పాతోళ్లని ఒదిలేశాడు. ఊరే గ్యాపకం లేనట్టుంది."

"అయినా, ఆ "సీతారామాభ్యాన్నమః" గాడితో ఈయన కేమిటి చెప్పండి" అన్నాడు సూర్యనారాయణగారు. పెద్దలు కొందరు వెళ్లి సూరపరాజుగార్ని "ఇదేం న్యాయమండీ" అని అడిగేశారు. ఆయన "వాక్శుద్ధి ఉన్న నరసింహంగార్ని కాదని, మనవాడని రామశర్మకే అప్పచెబితే, వాళ్లకి మన చదువులసాటే అవుతుంది. ఎలాగా ఊళ్లో పిల్లలు చాలామందున్నారు కదా. మనమంతా వేసుకుని ఒక చిన్నపాక వేయించి అందులో బడి పెట్టిద్దాము. అందులో ఇద్దరు పంతుళ్లుంటారు. మనమంతా వసూలుచేసుకుని వాళ్లకి జీతాలియ్యచ్చు." బాగానే ఉంటుందని అందరూ ఒప్పుకున్నారు. నరసింహంగారు బాగా చదువుకున్న వ్యక్తి గనక పెద్ద పంతుల్ని చేసి ఎక్కువ జీతమివ్వాలన్నారు సూరపరాజుగారు. ఆయన కెదురు చెప్పలేక ఒప్పుకున్నా, సూర్యనారాయణగారికీ, ఆయన అనుయాయులు కొందరికీ ఇది నచ్చలేదు. గ్రామాధికారులం మేం ఉండగా, ఈయనకీ పెత్తనం చెలామణీ ఏమిటని అనిపించింది. మనస్సులో కార్పణ్యాలు ఆరంభమయ్యాయి.

(ఇంకావుంది)


'దేవ్' (హైదరాబా

[illegible] "మా ఊళ్లో [illegible]"

# కఠినాత్మురాలు

14 వ పేజీ తరువాయి

ఏడుపెందుకూ ? ప—లే—లే .... జరిగింది చెప్పు. నీ కోడలు విన్నదిరిస్తే నీ కొడు కేం చేశాడే?'

'ఏం సేశాడా ? సిన్నబ్బాయి గోరిలా మంచో మంటే మంచుని, కూకోమంటే కూకుని ఓటం గాదు మరి. ఎక్కడ్నుంచో యింత పొడుగువ సింత బరి కొట్టి వట్టుగొచ్చేడు. 'ఏటే! ఏటే! మా అమ్మతో పేలావుట ? మళ్లీ పేలు' అని సావగొట్టేసినాడమ్మ గోరూ .... ఒళ్లు వూనంపేశాడనుకోండి. కొట్టివ పోటు నేదు, కొట్టనిసోటు నేదు .... గొడ్డుని బాది వట్టు బాదేసినాడు .... బొట్టి ఏటయిపోతుందో నానెందుకు సెప్పేన్రా బగువంతుడా అని ఎంత గిం గిల లాడిపోయిందో నా పేనం .... ఎంత సెపటికీ ఆగడే, ఎవరు సెప్పినా యినుకోడే .... 'అయ్యో! సచ్చి పోతుందిరా బాబూ' అని నానే అడ్డుకున్నాను.

'పావనీ .... ఇది సస్తే దీని బాబు అమ్మమ్మ మొగుడులాంటిది మూడోసాటికి ఇంకోర్తి ..... పెళ్లాం పోతే మరోర్తి వస్తుంది. తల్లి పోతే రాదు కదా !' అన్నాడు.

రుక్మిణమ్మ కళ్లు మిల మిల మెరిశాయి. అంత కంటె ప్రియమైన మాక్కీ, మధుర ప్రవక్తీ మరొకటి ఆమె కా క్షణాన తోచలేదు.

'అమ్మా! ఇంట్లో పాత కోటు ఏదయినా ఉంటే యిప్పించండి తల్లీ! బిడ్డడు సలిలో పాలంలోకి ఎళ్ల లేకుండా ఉన్నాడూ !'

'బాగుందే. రామాయణంలో పిడకల వేటలా వెధవ సొదా నువ్వూనూ ... సరే. దానికేంలే. వెళ్లేటప్పుడు మరిచిపోకుండా అడుగు. పడేస్తాను గాని....ఏమిటే, ఏమిటి నీ కొడుకన్నది ... ఏదేదీ, సరిగ్గా చెప్పూ. నేను సరిగ్గా వినేలేదే ......'

'అమ్మ కడుపు సలప తెలిసిన బిడ్డ తల్లీ! వాడు.... నా మాటే అడికి సచ్చె పెమాణం .... నామీద ఈగ వాల్తే సాలు; ఇరుసుకు పడిపోతాడు. కట్టు కున్నది పోతే మూడ్నెలసాల్లో మరోర్తిని సిరాయింపు సేసుకోవచ్చు .... కన్నతల్లి పోతే మరి రాదుకదా ?'

'కామలగా!.... ఎంతదృష్టవంతురాలివే నువ్వూ... ఏ కుల మయితేనేం, ఏ గుడిసెలో ఉంటేనేం .... ఏ బంగారు పూలతో పూజ చేశావో దేవుళ్లాంటి కొడు కుని కన్నావు. నవమాసాలూ మోసి కన్నందుకు నీ కొడుకు తల్లికి చెయ్యవలసిన గౌరవం చేసి రుణం తీర్చుకున్నాడు ..... పెద్ద పెద్ద చదువులు చదువు కున్నామనీ .... వందలకి వందలు నెలకి కుమ్మరిస్తు న్నామనీ మీసాలు మెలేసే ఆడంగిరేకుల చవట లందరికీ ఒక్కమాటలో—సరిగ్గా ఒక్కటంటే ఒక్క ముక్కలో బుద్ధివచ్చేలా ఎంత చక్కగా చెప్పాడే కామలా! నీ కొడుకు !'

రుక్మిణమ్మ రెచ్చిపోయింది. చూస్తుండగానే ఆమె కంఠస్వరం హెచ్చిపోయింది. పాపాయికి పాలు కలుపుదామని వసారాలోంచి వంటింట్లోకి అప్పుడే వెళ్లింది గౌరి. 'ఇవాళ్టి పేపరేది ?' అంటూ మొహం కడుక్కుని అప్పుడే పెరట్లోంచి ఇంట్లోకి వస్తున్నాడు శివగిరి. వాళ్ళు ఆ చుట్టుపక్కలే ఉన్నారని తెలియగానే రుక్మిణమ్మకి మరీ పట్టు పగ్గాలు లేకపోయాయి.

'ఊరుకోండి. వాళ్లు వినగలరు' అన్నట్టు సంజ్ఞ చేసింది కామలు.

'విననియ్యవే .... ఏం తలకొట్టి మొలేస్తారా ? మలమల మాడిపోతున్న, భగభగ మండిపోతున్న మాతృహృదయమనే అగ్నిపర్వతాన్ని ఎవరు ఎన్నా ళ్లని ఆపగలరే ? కష్టాలతో, రోగాలతో చివికి పోయిన మనసు ఎన్నాళ్లని ఆగగలదే ! రక్తంలో రక్తంగా, కండలో కండగా ఎన్నో ఆశలతో, ఎంతో వేదనతో తొమ్మిది నెలలు మోసి .... చీమూ, నెత్తురూ ధారపోసి కని .... పెంచి, పెద్దచేసి .... మంచీ, చెడూ చెప్పి, మనిషిని చేసి, తల్లి కొడుకు కోసం ఎంతో త్యాగం చేసి అష్టకష్టాలు పడేది ఇందుకోసమే గదుటే ? 'అమ్మా, నాకోసం ఎన్ని కష్టాలు పడ్డావమ్మా' అనే మాటమాత్రం కృతజ్ఞతయినా చూపనివాళ్లు వాళ్లూ కొడుకేనుటే?

పెళ్లాం అన్నది ఒకర్తి జతపడగానే .... ఇహ ప్రపంచంలో తన కొడుకికే పెళ్లయినట్టూ, మరెవరికీ పెళ్లామే లేనట్టూ దానిలో లీనమయిపోయి, దాని కన్నెర్రకే గడగడ లాడుతూ కామాంధకారంలో కన్నతల్లిని కనిపెట్టనివాడు—వాడూ మనిషేనుటే ?

'కానులూ ! ఎంత వివేకవంతుడే నీ కొడుకు ! ఎంత చక్కగా చెప్పాడే ! పెళ్లాం పోతే మరొర్తి ఒస్తుంది. తల్లి పోతే రాదుకదా ! తెలిసే అన్నాడో, జన్మజన్మల సంస్కారం వాడిచేత అలా పలికించిందో ఇంతకంటె సరియైన మాతృస్తవం లేదు. కేవలం కామతృప్తి కోసం నిర్దేశించబడిన భార్యకీ, నిష్కాముర్రాలైన తల్లికీ ఎంత చక్కగా తేడా చూపించాడు నీ కొడుకు !'

* * *

గారికి యిక ఆ తరువాత మాటలు వినబడ లేదు. ఆమె సహనం దెబ్బతినింది. ఆమె హృదయం గాయపడింది. ఆమెలో అతి సున్నితమైన భాగం ఏదైనా ఉందీ అంటే అది ఆనాటితో ముక్కలయింది.

అలా అని రుక్మిణమ్మగారినీ తప్పు పట్టలేం. ఆమె పెరిగిన వాతావరణమూ, ఆమె నమ్మిన విశ్వాసాలూ అటువంటివి. అన్నిటినీ మించి అందరి ఆడవాళ్లలాంటిదే ఆమె. మొగవాళ్లు ఆడవాళ్ల మంచి కొన్ని ఆశించి పొందలేక ఎలా బాధ పడతారో, అలాగే ఆడవాళ్లు కూడా తమ అధికారాన్ని సుస్థిరం చేసుకుందామని ప్రయత్నిస్తారు. అనురాగ మనేది అతి సున్నితమైన, సహజమైన అనుబంధమనీ దాన్ని 'క్లెయిమ్' చేసి రచ్చకీడుస్తే అందులో ఉన్న సరసతా, సొగసూ నాశన మవుతుందనీ వాళ్ల ఊహకి అందని విషయం.

రుక్మిణమ్మగారికి వరసకి పెత్తల్లి అయిన మహాలక్ష్మమ్మగారు ఆమెకి ఒకసారి చెప్పిన సలహా అలాటిది మరి. 'చూడు రుక్కు తల్లీ ! .... నీకా ఒక్కగా నొక్క కొడుకూ .... నీ ఆశలన్నీ వాడివల్ల తీర వలసిందే. మరి .... కాస్త మెత్తగా ఉండేదీ, చెప్పిన మాట వినేదీ చెయిలోకువ బాగా ఉన్నదాన్ని నీ కోడలుగా ఎంచుకో. కొడుక్కి అందంలో, చదువులో, పనిపాటలలో, వయసులో ఈడూ, జోడూ అయిందా, లేదా అనే మాటకంటే తను చెప్పిన మాట వినేదా, కానిదా అనే మాటే అత్తకి ముఖ్యం .... చెయిదాటి పోయిందో ఇహ నీవల్ల కాదు .... '

నిజమే .... మహాలక్ష్మమ్మగారి కోడలు కూడా చెయిదాటిపోయిన మనిషే. అయితే ఆవిడ ఆ సంగతి చివరి రోజుల్లోనే గ్రహించగలిగింది. ఎప్పుడు గ్రహిస్తే ఏం గాక, ఆవిడ తన పగ తీర్చుకుని గాని కన్ను ముయ్యలేదు.

ఓసారి మహాలక్ష్మమ్మగారి కోడలు వెంకట్రత్నాన్ని చూడ్డానికి ఆమె స్నేహితురాలు సీతారావుడు వచ్చింది. మాటలో మాటొచ్చి ఆ పిల్ల అడిగింది.

'అదేమిటే రత్నం, యింకా చెవుల్ని ఆ రాళ్ల దుద్దులు పెట్టుకు తిరుగుతున్నావ్—మీ ఆయనకి తాసిల్దారు అయిందిటగా. ఈపాటికి రవ్వల దుద్దులు చేయించమనూ .... '

'ఎందుకూ? మా అత్తగారి చెవుల కున్నవి వజ్రాలివే.'

'మీ అత్తగారు నీ కెందు కిస్తుందే, కూతురుండగా !'

'బాగుంది .... నీకంత బాగా తెలుసన్నమాట .... ఆవిడ సవితి కూతురు తెలుసా ? అదికాక, ఆవిడకీ ఈవిడకీ మధ్య వచ్చిగడ్డేస్తే భగ్గుమంటుంది ...'

'అలాగా ! ఓహో అందుకా, ఈమధ్య మీ అత్తగారికి జ్వరం వచ్చిం దగ్గర్నుంచి మరీ నువ్వు కంటికి రెప్పలా చూస్తున్నావనీ చెప్పుకుంటూంటే ఏమో అనుకున్నానే .... '

'లేకపోతే ? మిలమిల మెరిసే ఆ వజ్రాల మొహం చూసిగాని .... నల్లగా మసిబొగ్గుతో సమాన మయిన ఆ కోతి మొహాన్ని చూసే నేను మోజు పడ్డాననుకున్నావా ? ఎంత వెర్రిదానివే !'

ఈ చివరి మాటలు మహాలక్ష్మమ్మ చెవిలో పడ్డాయి. అయితే దానికి తగ్గట్టు కోడల్ని కోడం ప్రటేకం పెట్టకుండానే ఆమె మంచం ఎక్కేసింది. వాతం కమ్మి ఆమెకు మాట పడిపోయింది. అతి తొందరలోనే అవసానకాలం వచ్చేసింది. అయితే ఆమె ప్రాణం మాత్రం ఒక పట్టాన పోలేదు. బంధువులందరూ మంచంచుట్టూ చేరారు.

'మనస్సులో ఏదో కోరిక ఉండిపోయింది.... అది తీరుస్తే గాని ఆ జీవుడు పోడు' అన్నారు ఎవరో. ఆ కోరిక ఏమిటో ఎవరికీ అర్థంకాలేదు. ఆవిడ కళ్ళువిప్పి చూస్తూనే ఉంది. ఆఖరిదాకా ఆవిడకి తెలివి ఉండనే ఉంది. కాని ఆవిడ మాటాడనే లేదు.... కాళ్ళూ చేతులూ కదల్చలేదు. ఏం చేస్తేమన్నా ఆవిడ కళ్లలో తృప్తి కలగలేదు.

'ఒంటెడు బంగారమూ కొడుకు చదువుకే పెట్టేంది .... వెర్రితల్లి ఎంత రుణపడిందో .... ఇంక ఒంటిని ఒక్క దుద్దుల జత మిగిలింది .... దాన్ని గురించే కాబోలు' అంది ఒకావిడ.

'వజ్రాల దుద్దులు తియ్యమన్నావా ?' గట్టిగా చెవిలో నోరెట్టి అరిచారు. ఆమె కళ్లలో అంగీకారం కనపడింది. దుద్దులు తీశారు.

'ఇలా ఇవ్వండి .... అవి నాకోసమే .... అదే ఆవిడ ఉద్దేశం .... పాపం మా అత్తగారు ఎంత మంచి వారో' అని ఆ దుద్దుల్ని ఆప్యాయంగా అందుకుంది వెంకట్రత్నం. కాని మహాలక్ష్మమ్మగారు అయిష్టంతోనూ, అసహ్యంతోనూ ఉన్న శక్తి నంతటినీ కూడతీసుకుని ఒక్క మూలుగు మూలిగింది. దాన్తోనే ప్రాణం పోతుందనుకున్నారు అంతా.

'అదేమిటే ? చచ్చేదాకా ఒళ్లు హూనం చేసుకుని చాకిరీ చేసిన కోడలికి కాదూ ఆ దుద్దులూ ? మరెవరికీ ?' అమ్మలక్కలందరూ బుగ్గలు నొక్కుకున్నారు.

దిగింది. ఆమెను చూస్తూనే మహాలక్ష్మమ్మ కళ్లల్లో కొత్త ధైర్యం వచ్చింది.

'ఆవిడకి దగ్గిరవాళ్లు యింకెవరున్నారు ? వజ్రాల దుద్దులు నీకోసమేనేమో చూడ అన్నారు ఎవరో. ఆవిడ పిన్ని కళ్లలోకి చూసిం అందులో 'పెట్టుకో తల్లీ' అన్న భావమే ఆమె కనిపించింది.

'పిన్నీ, ఈ దుద్దులు నేను తీసుకోనా ?' ఆమెకు వినపడేలా అరిచింది. అవునన్నట్టు చూసి మహాలక్ష్మమ్మగారు. ఆవిడ సవితి కూతురు దుద్దు తీసి పెట్టుకుంది. పదిహేనేళ్లయి కాపురం చేస్తు ఆడపిల్లని సవితి కూతురని గుమ్మంలోకి పి యింత పసుపూ, కుంకుమా యివ్వడం ఎర మహాలక్ష్మమ్మగారు ఆ నాడు ఆపిల్ల దుద్దులు పెట కుంటూంటే తృప్తిగా చూసింది. వెలవెలబోతు వెంకట్రత్నం మొహంవైపు చూచి మొహం చిట్లి చింది.

అంతే.

ఆమె కాంక్ష తీరింది. ఆమె కన్ను మూసిం

అదిగో అంత పట్టుదల గలది ఆ మహాలక్ష్మమ గారు. ఆవిడ ఓసారి రుక్మిణమ్మగారి యిం కొచ్చిన సందర్భంలో యిచ్చిన సలహా యిదీ :

'చూడు రుక్కుతల్లీ .... ఇంటి తాళాలే కా ఆఖరికి వంటింటి తాళాలయినా కోడలికి అ చెప్పకు. అధికారం చేతిలో పెట్టావా, బతికు న్నాళ్లూ ఏడ్చి మొత్తుకున్నా యిహ లాభంలేదు అది సబబు అయినా, కాకపోయినా కోడలు నీ మా వినవలసిందే. ఆవిడ మనవల్నెత్తే అంత వ సొచ్చిందయినా 'అత్తగారూ! ఏంకూరొండమన్నారూ అని రోజూ విన్నడుగవలసిందే. కూరలవాణ్ణి పిల [illegible] దిగవలసివచ్చినా సరే, నీ 'అనుజ్ఞ పొందితీరవలసిందే. ఈ నిబంధనలు ఈనాడ నువ్వూ, నేనూ పెట్టినవి కావు ... ఈనాడు త కట్టుదిట్టాలు మనిద్దరం కూచుని నిర్ణయించిన కావు .... ఏనాడో మన 'ఋషులు' ఇవన్నీ రా పెట్టేశారు.'

ఇలాంటివి ఉగ్గుపాలతో నేర్చుకుని అక్షరాల ఆచరణలో పెట్టింది రుక్మిణమ్మగారు. కళ్లు తె వని పిల్లిపిల్ల తల్లి కడుపులో తలదాచుకున్నట్లు ఆవిడ తను నమ్మిన సిద్ధాంతాల్నే సత్యంగా భగ త్స్వరూపంగా నమ్మింది. అందుకనే ఆవిణ్ణి తప్పు పట్టలేం.

* * *

ఇంట్లోకి రాబోయిన శేషగిరి పెరట్లోకి వెళ్లి నూతి చప్టామీద కూచున్నాడు. అతని మనస్సంతా ఆదోలా అయిపోయింది. అతని కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. 'అమ్మా, నా కెందుకు పెళ్లి చేశావు ?' అని బావురు మన్నాడు. చెంపలమీద కన్నీళ్లు చొక్కాతో అద్దుకున్నాడు.

'నేను కాల్చిన సిగరెట్టుమీద సిగరెట్టుపొగ మేఘాలలా, నేను కొట్టిన బ్యాట్‌మెంటెన్‌బాల్ అంత స్పీడుగా, నా జీవితం హాయిగా వెళ్లిపోయేది. నే నేం పెళ్లి చెయ్యమని నిన్ను ప్రార్థించానా ? అవసరం మాట దేవుడెరుగు; అదుర్దా అయినా ప్రకటించానా ? నేను ఒంటిగా, హాయిగా ఉంటే, కన్న తల్లివే, నీ కన్నే కుట్టిందా అమ్మా ?'

కారులో వెళ్లే అలవాటు వుందన్న పెద్దమనిషి యీ మధ్య నడిచివస్తున్నాడని చూసిమిత్రుడు కారణమడిగాడు. కారులో నేను యిద్దరి కాళ్లు విరిచాను. నా కాళ్లు వాళ్లు విరిచేస్తాము నడవకపోతే నన్నాడు.

రాజు (రాజాం)

'బాబూ! ముసల్దాన్ని .... కాటికి కాళ్లు చాచు కున్నదాన్ని .... నువ్వు ఓ యింటివాడివయితే చూసి, మరీ కన్ను మూయ్యాలనుందిరా నాన్నా ... అన్నావు .... నువ్వూ, నీ పెళ్లామూ చిలకా గోరింకల్లా కాపురం చేస్తుంటే చూచి ఆనందించాలని ఉందిరా తండ్రీ అన్నావు ....

'నిజమేనా ? గుండెమీద చెయ్యి వేసుకు చెప్పు అమ్మా .... మేం కాపురం చేస్తుంటే నువ్వు చూచి ఆనందించావా ? కఠినమైనా, సత్యాన్ని బయట పెట్టవలసిందే .... నన్ను ఆ లా మమ్మల్ని ఒకనాడయినా ఆనందించ నిచ్చావా ? నిజం చెప్పు... నిన్ను ప్రార్థిస్తున్నాను .... నిజం చెప్పు తల్లీ !

'ఇవాళ మాటే అడుగుతున్నాను .... వచ్చినంత శికార్ను అయిందనిపించి అన్ని శక్తులా అమ్ము కుని అలసిపోయి ఆఫీసునుంచి ఇంటికొచ్చాను. అదీ పనిపాటలతో విసిగుంటుంది; ఇద్దరం కలసి అలా ఏ షికారుకో వెడదామనుకున్నాను .... '

'.... ఎందుకొచ్చావా అని యిప్పు డనుకున్నట్టు లేశావు !

'కన్న కొడుకుల సుఖానికి యింతగా అడ్డొస్తున్నామనీ, అడ్డు తెస్తున్నామనీ మీరు కలలో నయినా అనుకోడంలేదా ? మీరు లేకపోతే ఇల్లు చల్లగా ఉంటుందన్న భయంకరమైన భావం మీరు మీ కొడుకులకు కలుగజేస్తున్నారనే విషయం మాటే నిజంగానే తెలియదా తల్లుల్లారా !'

ఎదురుగుండా తల్లిని అనలేనివి, అడగలేనివి కొండలకొద్దీ ప్రశ్నలు శేషగిరి తనను తనే—తన లోనే వేసుకున్నాడు. తన ఉద్దేశం ప్రకారం నిజానికి గౌరి నెమ్మదైన మనిషి. పది మాటలకు ఒక్క మాటయినా జవాబు చెప్పదు. ఆ మాటయినా అవున నో .... కాదనో .... అంతే .... తన పనేదో తను చేసుకుపోతుంది.

'పైకలా ముంగిలా ఉంటుంది కాని .... అమ్మో అలాంటివాళ్లే కొంపలు తీసే రకం' అంటుంది అమ్మ. ఇంకెలా చావడం ?

'పోనిద్దూ నిన్నెదిరించలేదుకదా, నీతో వాదించ లేదుకదా, పెద్దదానివి నువ్వే ఊరుకోరాదుటే' అని తను ఉండబట్టలేక ఎప్పుడేనా అంటే ....

'వేరే యింకెలా ఎదిరించాలి నాయనా. ఆ కళ్లు చిట్లించడం, ఆ మూతి విరవడం అంతకంటే వేరే ఏం కావాలి నాయనా ? అయినా పెళ్లాన్ని దార్లో పెట్టుకోలేని నాజెమ్మవి నువ్వూ నాకు చెప్పడమే మళ్లా ?' ఇదిగో ఇదే వరస.

'అవుననదూ, కాదనదూ. ఎంత లోతున్న మనిషయినా అవును. ఎంత గోతులు తీసే రకమయినా అవును .... ఇలాంటి కోడల్నిచ్చి నా కొంప తీశావా భగవంతుడా ! అయినా నిన్నని ఏం లాభంలే. మన బంగారం మంచిది కాకపోతే .... '

'ఏం చెయ్యమంటావమ్మా నీ కోడల్ని ? ఎంత సేపూ 'పెళ్లాం గీసిన గిరిని దాటలేని సన్యాసి' అనుకుంటారే కొడుకుల్ని, పెళ్లా మన్నది పశువు కాదనీ, దాన్ని బందిలి దొడ్డిలో పెట్టడం అంత సుళువు కాదనీ, పెట్టినా సుఖంలేదనీ మీకు తెలియదా ? ....

# కఠినాత్మురాలు

'ఇందులో నా తప్పు ఏముంది ?' అనుకున్నాడో శేషగిరి. అందుకనే శేషగిర్ని తప్పు పట్టలేం.

*  *  *

పోనీ గౌరిదేమో తప్పనుకుంటే ఆమె మనసులో అయినా అత్తగారికి అపకారం తలపెట్టేది కాదు. ఆమెను కంటికి రెప్పలా పెంచిన ఆమె తండ్రి నేర్పిన బుద్ధులు అటువంటివి. 'గౌరీ ! పుట్టింట్లో ఆడపిల్ల తప్పు చేసినా ఏమీ అనరు. అత్తింట్లో ఒప్పు చేసినా మెచ్చుకోరు. నీ అత్తగార్ని అత్తగారిలా కాక, నీ యిష్టదైవాన్ని ప్రసాదించిన మాతృమూర్తిగా చూసుకో తల్లీ ...., భర్త స్త్రీలకు దైవమే. అయితే ఆ దైవాన్ని కన్నతల్లి దయ్యం కాబోదు కదా ! పుట్టినింటికీ, మెట్టినింటికీ కీర్తి తే తల్లీ.'

నాన్నని తల్చుకుని వెక్కివెక్కి ఏడ్చింది గౌరి.

'నే నింక ఆ మాటలు పడలేను .... ఆ క్షోభ భరించలేను .... భరించి బతకలేను నాన్నా' అని పరితపించింది గౌరి.

'కన్నతల్లి పోతే మరి రాదు ! పెళ్లాం పోతే మరొకర్తె వస్తుంది !'

సినిమాకి వెళ్తూ ఒక సుందరాంగి కుక్కపిల్లను వెంటపెట్టుకుని వెళ్లింది. "కుక్కలు సినిమాలోకి రాకూడదు" అన్నాడు బుకింగ్ క్లార్క్. "అది సినిమా చూడదు లేవయ్యా! పుస్తకం చూస్తూ కూచుంటుంది" అన్నదావిడ కోపంగా.

ఎస్. బాలాజీ, (విజయవాడ)

ఆమె అభిమానం దెబ్బతింది .... తన స్థానాన్ని అంత తక్కువగా నీచంగా చూసుకోలేక ఆమె మనసు తిరగబడింది.

అంతేనా ? కట్టుకున్న ఆడదాని స్థానం అంత వరకేనా ? భార్య అనేది కేవలం భోగ్యకరమైన వస్తువేనా ? భార్యాభర్తల సంబంధం జన్మజన్మల అనుబంధం కాదా ? చక్కగా, చల్లగా చూడ ముచ్చటగా జరిగే సంసారంలో పవిత్రతా, పరమార్థమూ లేవా ? సంస్కృతములైన మంత్రాలతో అగ్నిసాక్షిగా భర్త భార్యను స్వీకరించేది నీచమైన కోరికలను తీర్చుకునే వరకేనా ?

'ఇది పోతే దీని బాబు లాటిది మరొకర్తె' ఇంత అల్పప్రాయమైనదా అర్థాంగి స్థానం ?

అంతకుముందు గౌరి అత్తగారి మాటలు పడ లేదని కాదు. కాని ఆ మాటలతో మాత్రం ఆమె లోని మార్దవం అంతా కరిగిపోయింది.

'ఈ మాటల్ని ఇక పడలేను.... ఈ ఇంట్లో ఇక ఉండలేను .... ఈవిడ మొహం ఇక చూడలేను' అనుకుంది గౌరి. అనుకుంటూ నాలిక కరుచుకుంది.

'ఆయనకు తల్లిసేవ విధాయకం. ఆయనతో పాటు ఆయన యిల్లాలినైన నాకూను. కాని ఎంత కాలం భరించగలను ? ఇలా ఎన్నాళ్లు బతుకుతాను ? గౌరి చీర చెరగుతో కళ్లద్దుకుంటూంటే శేషగిరి లోపల కొచ్చాడు.

'నీకంత కష్టంగా ఉంటే నీకు తోచిందేదో జవాబు చెప్పకూడదూ ? ఏ మాటా తేల్చవ్ .... నీతో ప్రాణం విసుగెత్తి పోతోంది.'

మొగుడు కూడా తప్పే అనడం గౌరి భరించలేక పోయింది.

'అవునండీ. తప్పంతా నాదే ... నేను బతకడమే తప్పు .... మీ అమ్మగారు నన్ను అనరాని మాట అనడం బాగుంది. మీకు అమ్మ ఒక్కర్తే.... నాలాటిది చస్తే, నాల్గో రోజుకి మరొకర్తె మీకు.'

శేషగిరి ప్రాణం అప్పటికే విసిగెత్తి ఉంది. తల్లి అన్న మాటలను గౌరి తనమీద ప్రయోగించడంతో అతనికి మరీ ఒళ్లు మండింది. ఏమంటున్నాడో అతనికే తెలియలేదు.

'నిజమే .... నా బాధలన్నీ నీలాటి తెలివితక్కువదానివల్లనే .... నీలాటిది లేకపోయినా నాకు విచారం లేనిమాటా నిజమే .... మరో గడుసుదాన్ని మరుక్షణంలో కట్టుకుంటాను' అనేసి ఆ గదిలోంచి వెళ్లిపోయాడు. ఇంకా పట్టు ఏదయినా ఉందీ అంటే అదీ తెగిపోయి హృదయం పూర్తిగా బద్దలవగా గౌరి కుప్పగా కూలిపోయింది.

ఆమె మనసు మరి కోలుకోలేదు !

ఇక ఆమెను ఏమని తప్పు పట్టగలం ?

*  *  *

ఇంట్లో అందరూ ఇలా బాధపడుతుండగా 'ఏదీ తప్పు చూపించమ్మా' అంటే చూపించేలాగా ముక్కుమీద వేలేసుకుని ఉయ్యాల్లో పాపాయి మాత్రం కేరింతాలు కొడుతున్నాడు !

*  *  *

మర్నాడు సాయంకాలం శేషగిరి ఆఫీసునుంచి వచ్చి బట్టలు మార్చుకుని గదిలో కూచుని ఉండగా గౌరి కాఫీ తెచ్చి యిచ్చింది. అతను వేరే పనిలో ఉండి వెంటనే గ్లాసు అందుకోలేదు. ఆమె అలా చెయ్యెత్తి ఎక్కువసేపు నిలబడలేక అక్కడ బల్లమీద గ్లాసు పెట్టి చూస్తూండగానే పక్కనున్న కుర్చీ మీదకు ఒరిగిపోయింది. శేషగిరి ఆదుర్దాగా ఇటు తిరిగాడు. భార్య గెడ్డం పట్టుకుని పైకి ఎత్తాడు. కొనప్రాణంతో ఉన్నట్టుంది మొహం... నోటిలోంచి వస్తున్నట్టుంది స్వరం.

'అదేం? అంత నీర్సంగా ఉన్నావ్ ? ఒంట్లో బాగులేదా ?'

'కొద్దిగా తల నొప్పిగా ఉంది. అంతే !'

శేషగిరి భార్య చెంపమీద చెయ్యేసి చూశాడు. చెంప కాలుతూ ఉంది.

'అయ్యో, జ్వరం తగిలినట్టుందే .... బాగా ఎక్కువగా ఉన్నట్టుంది కూడాను .... జ్వరం ఎప్పుడొచ్చింది ? .... అమ్మా, అమ్మా !'

# కఠినాత్మురాలు

'ఏం బాబూ' అంటూ రుక్మిణమ్మ అక్కడి కొచ్చింది.

'గౌరికి జ్వర మొచ్చినట్టుందే .... '

'ఏమో బాబూ! ఏమయినా చెప్తుందా చేస్తుందా. నువ్వు రాగానే నీతో 'ఓ ఏనాటి టపా ఆవాడు అందిం చెయ్యకపోతే.... పోనీ సాటి ఆడకూతుర్ని ఇంట్లో ఒక్కర్తినీ దిక్కుదిక్కు మంటూ ఉన్నాను. నాతో చెప్తే కాలు కదపనిస్తానా ? తనకి ఒంట్లో కాస్త నలతగా ఉంటే నన్ను అసలు ఏపనీ ముట్టుకోనీయదు. ఒంట్లో బాగులేకపోయినా కోడలిచేత నానా చాకిరీ చేయిస్తోంది ఈ అత్తగారు అని అందరూ అనుకో వద్దూ....'

తల్లిని పిలిచినందుకు శేషగిరి తనమీద తనే విసుక్కున్నాడు....ఒంట్లో బాధ ఏమిటి ? కొంప లేచరు ఎంతుంది ? ఇలాంటి ఒక్క ప్రశ్న ఆమెనోటి వెంటరాదు. పైగా ఇదీ ధోరణి. తనేమైనా జవాబు చెబితే, మరింత వాగ్వాదంతప్ప కలిసొచ్చేది ఏమీలేదు. తల్లిని మింగెయ్యాలన్నంత కోపం తనలోనే దిగ మింగి, శేషగిరి అక్కణ్ణుంచి లేచి వెళ్లిపోయాడు.

ఏడుస్తున్న పిల్లాణ్ణి ఉయ్యాల్లోంచి పైకి తీసింది రుక్మిణమ్మ.

'నీ ఏడుపూ' నా ఏడుపూ ఈ ఇంట్లో వినే వాళ్లెవరున్నార్రా వెర్రివెధవా ! ఉన్నమాటకూడా పైకి గట్టిగా అనుకోడానికి లేదు. పాడుకొంప. పద' అంటూ వాణ్ణెత్తుకుని ఎదురింటికి పోయి కూచుంది. ఆవిడ వెళ్లగానే శేషగిరి లోపలికొచ్చాడు. పంచం వాల్చి అందిమీద పరుపు పరచాడు. మెల్లిగా గౌరిని లేవనెత్తి దానిమీద పడుకోబెట్టాడు.... శాలువ కప్పాడు. కొంత సేపటికి ఆమెకు నిద్రపట్టి నట్టు తోచి వంటింట్లోకి వెళ్లాడు; పీటా, కంచం వేసుకుని వడ్డించుకున్నాడు. అతి దీనమయిన గౌరి మొహం అతనిముందు ప్రత్యక్షమైంది. కడుపు దేవేసి నట్లయింది.

'గౌరీ ! ఎవరో కాదు నేనే వేటగాణ్ణి. ఎవరో కాదు నువ్వే లేడిపిల్లవి. నీకంటె రెట్టింపు వయ స్సున్న మా అక్కలిద్దరూ వేరింటి కాపురాలు హాయిగా వెలిగిస్తున్నారు. తనదీ అనిపించుకున్న ఇంట్లో తన చేత్తో మొగుడికీ, పిల్లలికీ యింత వండి వడ్డించడంకన్నా—ఆవిడ కోరే స్వర్గమూ, సౌఖ్యమూ లేదు.... ఎవరి ఆధిక్యతా, అధికారమూ లేని స్వేచ్ఛామయ జీవితం కట్టుకున్నదాని కనీసపు కోర్కె.... నాకు తెలుసు గౌరీ, నాకు తెలుసు....కాని నేనేం చెయ్యను ? ఏం చెయ్యలేనుకూడా....నాలాంటి 'అడకత్తెరలాంటి అడకత్తెరలో చిక్కుకున్న వాళ్లు' యింకా ఎంతమందో ఉన్నారనికూడా నాకు తెలుసు. అలా చేయడం నా కేమీ ఉపశమనం కాదు కూడా....పందొమ్మిదికూడా నిండలేదు నీకు. పాపిష్ఠివాణ్ణి నేను !'

శేషగిరి కంచంలో కన్నీటి చుక్కలు పడ్డాయి. చెయ్యి కడిగేసుకున్నాడు.

ఓ రాత్రివేళ గౌరికి తెలివొచ్చింది. శేషగిరి ఆ అలికిడికి లేచి బత్తాయిపళ్ల రసం తీసి ఇచ్చాడు.

'గౌరీ! నిజంచెప్పు.... నిన్న అమ్మ అన్నమాటల్ని నువ్వు పూర్తిగా మనసులో పెట్టుకు కూర్చున్నావు కదూ ? పిచ్చిదానివి కాకపోతే యిదేమైనా నీకు కొత్తా, చెప్పూ? అయినా ఆ యిచ్చకాలముండ కాసులో కర్తి.... దాన్ని మారు గుమ్మంలోకి రానియ్య కుండా కట్టుదిట్టం చేస్తానుండు....'

'బాగుందండీ, మధ్య అదేం చేసింది ? నేనే, లేని పోనివన్నీ మనసులోపెట్టుకుని ఒంటికి తెచ్చుకున్నాను. అనవసరంగా మీకు లేనిపోని యిబ్బందితెచ్చి పెట్టాను.... అక్కడ ఆఫీసులో ఆ చాకిరీయేకాక యింట్లోకూడా మీ రన్నీ చేసుకోవలసివచ్చింది. పైగా నా చాకిరీ ఒకటీ....' ఇలా పైకి గౌరి ఏదో మామూలుగా అలవాటయిన మాటలన్నీ మాటాడే స్తోంది. కాని లోపల మనసు అంతకుముందురోజున అత్తగారు అనిన అక్షరాలన్నీ నెమరు వేసుకుం టోంది.

'మీరు మీ అమ్మని విడిచి ఉండలేరు. అలా నేను ఉండమనను. అది ధర్మవిరుద్ధం.... కాని, గృహిణిగా నా స్థానాన్ని మీ అమ్మగారు ఆవంత యినా గుర్తించలేదు. పైగా ఏ నేరమూ ఎరగని నన్ను, ఏ పాపమూ చెయ్యని నన్ను.... ఇది ఉన్నా లేక పోయినా ఒకటే అన్నంత నీచంగా బహిరంగంగా

"ఇంతకీ నువ్వు వంట నేర్చు కున్న కారణం చెప్పావు కాదూ?" మిత్రుడు వండినవంట రుచిచూస్తూ అడిగాడు శేఖరం. "మా ఆవిడ కందకూర, బచ్చలి కూరా తప్ప మరోటి వండటం రాదని చెప్పేసింది" అన్నా డాయన.

రామారావు (రాచకొండ)

దూషించారు. ఆవిడ మాటలను సహించే శక్తి, క్షమించే శక్తీ, పోనీ, వినీవిననట్టు ఊరుకునే శక్తి నాలో చచ్చి పోయాయి.... ఆవిడే కాదు... అంతటి మాటలు అకారణంగా, అన్యాయంగా ఆవిడ నన్నంటూంటే మీరు అదేమని అడగలేదు. ఆవిడ లేనప్పుడయినా నన్ను పిల్చి అమ్మ తరఫున క్షమాపణ చెప్పుకో అక్క ర్లేదు; అంతవరకు నేను ఆశించను గాని.... ఆవిడ చేసిందేమీ బాగులేదన్న మామూలు మాటయినా నాతో అనలేదు.... తప్పు నాదే అన్నట్టు మాట్లా డారు.నాతో మీకు ప్రాణం విసుగెత్తి పోతోందన్నారు. మీ బాధలన్నీ నా వల్లనే అన్నారు.... నేను లేక పోయినా మీకు విచారంలేదన్నారు— క్షణంలో మరోదాన్ని కట్టుకుంటానన్నారు !.... ఉన్న ఊరినీ కన్నవారినీ ఒదిలి ఆడది భర్తదగ్గరకొచ్చేది యిలాంటి మాటలు పడ్డానికేనా ? కట్టుకున్న మొగుడే కసిరి కొడితే మానుషంగల ఆడది భరించగలదా ?.... ఆఖరి ఆశకూడా అడుగంటిపోయింది.... లేదు. మీ గౌరి మీ కిక లేదు.... మీకు కావలసినది అదే కదా !'

* * *

రాత్రి తెల్లవార్లూ అయిదునిముషాలయినా గౌరికి నిద్రలేదు! తెల్లవారేసరికి ఆమె జ్వరం నూట నాలుగు ఉంది !

వారం రోజుల్లో గౌరిస్థితి ప్రమాదస్థాయి చేరుకుంది. ఎన్ని మందులిచ్చినా ఆమె కొంపరేచ కొంచెమైనా తగ్గలేదు సరిగదా ఇతర 'కాంప్లికేషన్లు' కూడా వచ్చాయి. ఈ వారంరోజులూ శేషగిరి సెలవు పెట్టి యింటి పట్టునే ఉన్నాడు. ఇంట్లో వంట చాకిరీమాట అలా ఉంచి, పాపాయిని పట్టుకోవడ మరీ కష్టమయిపోయింది. వాణ్ణి చాలావరకు రుక్మిణమ్మగారే చూసేది.

వారం రోజుల్లో తల్లి, కొడుకులమధ్య అంతర మరీ ఎక్కువై పోయింది. శేషగిరి మాట్లాడి తల్లిమీద ఖస్సున లేస్తూఉండేవాడు.

'ఎలా ఉందిరా బాబూ దానికి ?'

'దాన్నే అడక్కూడదూ, ఏం నీకూ, దానికీ మాటల్లేవా ?'

'ఇవాళేమయినా కొంచెం నిద్రపట్టిందా ?'

'ఇన్నాళ్లకయినా ఆ మాత్రం కనుకో్కనాలి పించిందన్నమాట... మెచ్చుకోవలసిందే.'

'ఇక అది బతికే ఆశ లేదా నాయినా ?'

'ఎందుకూ ? బతికి ఏం సుఖపడాలి గనక !'

ఇలాంటి జీతితంలో ఎప్పుడూ ఎరగని జవాబులతో రుక్మిణమ్మ మనస్తత్వం మారకపోయినా ప్రవర్తనమాత్రం చాలావరకు మారింది. ఆవిడకు లోపలికి వెళ్లి కోడలికి సేవచేద్దామని మనసొకోరిక గలిగిననాడు కొడుకు ఆమెకు లోపలికి ప్రవేశమే లేకుండా చేశాడు. కోడలికి ఒంట్లో ఎలాఉందో తెలుసుకుందామని ఆవిడకి నిజంగా బుద్ధిపుట్టిన నాడు కొడుకు మళ్లీ మాటాడకుండా నోరు మూశాడు. వంటింట్లో పని అతి త్వరగా ముగించు కుని, పాపాయీ, పాలబుడ్డీ, తనూ ఆ గుమ్మంముందు హాజరయ్యేది. డాక్టరు బూట్లచప్పుడు వింటూనే ఆమె గుండె దడదడ కొట్టుకునేది. అతడు యివతలికి వచ్చేదాకా కళ్లన్నీ ఆ గుమ్మంమీదే ఉండేవి. ఇవతలికి రాగానే కూడావచ్చిన కొడుకుమొహం వెయ్యి కళ్లతో చూసేది. ఏమిటో అర్థంకాక గిలగిల కొట్టుకునేది. అయితే ఆ ముసిలిదాని మనోవ్యధని భగవంతుడు ఆట్టేకాలం ఉంచలేదు. చీమ చిటుక్కు మనని ఒక కాళ రాత్రి సమయాన గౌరి మరి రాని చోటికి నడచిపోయింది !

* * *

గౌరి మరణవార్త మొదటిసారి విన్నప్పుడు రుక్మిణమ్మ ప్రతి రక్తబిందువూ చలించిపోయింది. తల దించి పాపాయిని గాని, దించిన తలఎత్తి కొడుకుని గాని ఎలా చూడ్డమో ఆమెకి అర్థంకాలేదు. అక్కర్లేదు. ఆమె తల ఎత్తకుండానే క్షోభించిన హృదయం పిడుగులు రాల్చింది.

'అమ్మా ! ఇప్పుడు యిల్లంతా నీది ! యీ ఇంటికి ఏక ఛత్రాధిపత్యం నీది! ఏలు తల్లీ, తనివి తీరా ఏలు ! ఇక నీ ఆజ్ఞకి ఎదురులేదు....నీ మాటకి తిరుగులేదు.... కళ్లు చిట్లించడాలూ, మూతి విరుపులూ ఇక నీకు అడ్డం అగలవులే.... అంతా నాశనమయిపోయిన తరువాత ఈ శ్మశానానికి సర్వాధి కారణివి నీవేలే ...'

సర్వస్వం కోల్పోయిన సంక్షోభంలో శేషగిరి తల్లిని అనకూడని మాట అంటూ లేకుండా దులిపి

## కఠినాత్మురాలు

మూళ్ళగొట్టేశాడు. రుక్మిణమ్మ మనసులో ఎన్ని తుపానులు చెలరేగాయో గాని, వంచిన తల ఎత్తలేదు. కంటచుక్క కార్చలేదు.... ఉన్నచోట కదలలేదు.

'అమ్మా ! నువ్వు కఠినాత్మురాలవమ్మా ! పెళ్ళాం పోతే మరొకర్తె వస్తుంది. తల్లి పోతే రాదు కదా !' అని నువ్వే అన్నావు. నీ కోడలు ఒకడికి పెళ్ళాం. ఆ మాట నిజమే.... మరొకర్తెని, మరో మందభాగ్యురాల్ని మరుక్షణంలో నా మెడకు కట్టినా కట్టగల సమర్థురాలివి నువ్వు. కాదనను. కాని ఆ మాట అన్నప్పుడు నువ్వు ఒక్కమాట మరచిపోయావు. నీ కోడలు మరొకరికి తల్లికూడాను.... ఆ తల్లి మరి రాదు కదా, నువ్వన్నమాటే... నీ ఒళ్ళోనే ఉన్నాడు. మనవడు.... వాడికి తల్లిని తెచ్చి ఇవ్వగలవా ? మాట్లాడవేం అమ్మా ? నీ గుండె రాయి అయిపోయిందా అమ్మా ?'

'లేదు; మా అమ్మగుండె రాయి అయిపోయింది అనుకుని ఉండును; పాపాయికి కనుక మనసంటూ ఉండిఉంటే. నిజమే, వాడి మాట కూడా కాదనడానికి లేదు. గౌరికి మనస్సు విరిగిపోయినదగ్గర్నుంచి తన గురించే తప్ప మరొకటి ఆలోచించాలన్న జ్ఞానం కూడా కోల్పోయింది. పాపాయికి కాస్త నలతగా ఉంటే చాలు; పంచప్రాణాలూ పోయినట్టు గాబరా పడిపోయేది. వాడు ఏ మంచం కిందైనా పాకి, ఒక నిముషం కనబడకపోతే చాలు; యిల్లంతా ఓ పంద మార్లు వెతికేది. వాడు కడుపునిండా పాలు తాగనట్టు ఏమాత్రం అనుమానం తగిలినా చాలు; ఒక్క ముద్ద నోట్లో పెట్టుకోలేకపోయేది. ఎంతసేపూ పిచ్చి వెధవ ! ఏ తలుపుసందున వేలెట్టేస్తాడో అని బెంగ.... ఎంతసేపూ కుర్రకుంకకి ఎవరు దిష్టి పెట్టేస్తారో అని బాధ.... నిజానికి అమ్మ అన్నీ దగ్గరుండి చెబితే గాని ఈ వెర్రి నాగమ్మలకి ఏం తెలుసునని ? బోర్లా పడదామని ఎడంచెయ్యి మడచి ముందుకు పడేసుకుని పనసపండులాంటి ఒళ్ళు దాని మీద చేరుస్తారు. ఆ చెయ్యి తీసుకోలేరు. 'క్యారు క్యారు'మని ఇల్లెగరగొట్టేస్తారు. అమ్మొచ్చి ఆ చెయ్యి తియ్యాలి.... జానెడు దూరంలో ఉన్న 'దొండకాయని' అందుకోలేక ఆర్తనాదాలు చేసేస్తాడు. అమ్మొచ్చి అభయ ప్రదానం చెయ్యాలి.

ఆ బుగ్గలే బూరెలు. ఆ పెదములే రసగుల్లాలు. ఆ కన్నులే కాజాలు. అమ్మ ముద్దెట్టుకోని జాగా అబ్బాయి శరీరంలో లేదు.

'అంత అపూర్వ పదంగా లాలించిన, అంత అల్లారు ముద్దుగా పెంచిన నన్ను విడిచి ఎలా వెళ్ళగలిగావుఅమ్మా ? అసలు పదిరోజులనుంచీ ఓ రోజు కోరోజు నీ కొక పాపాయినంటూ నేనున్నాననే ఆలోచనే నీనుంచి దూరమయిందా అమ్మా? అయిదు నిముషాలు నన్ను వదిలేదానివికాదు....నేను గట్టిగా ఏడుస్తేకూడా వినిపించుకోనంతగా నీ మనసు అన్యాక్రాంతం అయిందా అమ్మా !

'అవును.... నాన్నమ్మను అనుకోడం దేనికి ? నీ గురించితప్ప మరొకరి గురించి ఆలోచించలేనంతగా నువ్వు మారిపోయావు. నువ్వూ ఆడదానివే. నీ స్వార్థమే నిన్ను కాటువేసింది !'

పాపాయికి మనసంటూ ఉంటే, తప్పక ఈ మాటలు తల్లినడిగి ఉండును. అవును, గౌరి, కఠినాత్మురాలు ! ★



# శోభన్ బాబు

(9వ పేజీ తరువాయి)

అతనికి మిత్రులు కొందరు 'హీరో' ముద్రకూడా వేశారు. అప్పుడు అతను ఫిజిక్స్ అసోసియేషన్‌కు ఉపాధ్యక్షుడుకూడా అయ్యాడు.

శోభన్‌బాబు బి. ఎస్. సి. డిగ్రీ తీసుకున్నాడు. తర్వాత ఏం చేయాలి ? ఉద్యోగమా—పై చదువా? ఇవేవీ కాకుండా—అతని దృష్టి ఇంకెక్కడో పడ్డది. సినిమా తెరమీద నటులూ, హీరోలూ అతని దృష్టిలో కదలాడేవారు. తనకు సినిమా ఛాన్సు ఉన్నట్టు ఒక జ్యోతిష్కుడు కూడా చెప్పాడు. వెళ్లి కొన్నాళ్లు ప్రయత్నిస్తే సాధ్యం కావచ్చునేమో ! ఐతే ఇంట్లోవాళ్లు మాత్రం ఆ మాట చెబితే పంపరు. ఒక రాత్రి అంతా కూచుని శోభన్‌బాబు ఆలోచించి ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చి, తెల్లవారగానే "నేను లా చదువుతాను—మద్రాసులో" అన్నాడు. పై చదువులకు అభ్యంతరం పెట్టని అతని పెద్దవాళ్లు సరే నన్నారు.

మద్రాసు లా కాలేజీలో చేరిన శోభన్‌బాబు, సినిమా నిర్మాతలనూ, దర్శకులనూ కలుసుకోవటం తోనే కాలం వెళ్లబుచ్చసాగాడు. కాలేజీకి బయ ల్దేరుతున్నా ననుకొని — సినిమా స్టూడియోలకు వెళ్లేవాడు. కొన్నాళ్లకు అతనికి నిరుత్సాహం కూడా కలిగింది. ఇటు చదువూ లేదు, అటు చిత్రాలూ లేవు. రెంటికీ చెడిన రేవడల్లే తయారయ్యానా అని అతను మథనపడుతున్న సమయంలోనే— అతనికి మంచి 'ఛాన్సు' తగిలింది. 'భక్తశబరి' చిత్రంలో—మంచి పాత్రను ఇచ్చారు—ఆ చిత్ర నిర్మాత బి. ఆర్. నాయుడుగారు, దర్శకుడు నారాయణమూర్తిగారూ.

శోభన్‌బాబుకు కొంత ధైర్యం కలిగింది. ఆ ధైర్యంతోనే అతను ఇంకా తీవ్రంగా కృషి చేశాడు. ఆ కృషిలోనే అతను 'సీతారామ కల్యాణం', 'భీష్మ', 'మహామంత్రి తిమ్మరుసు' చిత్రాలలో నటించాడు. భక్తశబరి చిత్రం అర్ధశత దినోత్సవం చేసుకోగా—మిగిలిన చిత్రాలన్నీ శతదినోత్సవాలు జరుపుకున్నాయి. శోభన్‌బాబుకు ఈ మాట తలుచుకున్నప్పుడల్లా గర్వం కలుగుతుంది. అదంతా తన అదృష్టమే—అని భావిస్తాడు.

అతను నటిస్తున్న 'లవకుశ', 'ఇరుగుపొరుగు', 'సీమంతిని కల్యాణం' చిత్రాలు—త్వరలో విడుదల కాబోతున్నాయి. అన్నపూర్ణవారి ప్రస్తుత చిత్రంలో శోభన్‌బాబు మంచి పాత్రను ధరిస్తున్నాడు. ఈ అవకాశాన్ని కల్పించిన—ఆ సంస్థవారికి అతను ఎప్పుడూ కృతజ్ఞతలు చెప్పుకుంటూనే ఉంటాడు.

శోభన్‌బాబుకు హాబీలు లేకపోలేదు. ఒకటి ఏమిటంటే—ఇతరుల 'మానరిజమ్స్' ను అనుకరించటం ! ఈ అనుకరణ కూడా అతను తన ఇంట్లోనే, భోజనాల సమయంలో చేస్తూ ఉంటాడు. వాళ్లు నవ్వితే, తను ఆ విద్యలో రాణించినట్లే నని అతని భావం.

శోభన్‌బాబు 1937 వ సంవత్సరంలో సరిగా సంక్రాంతి పర్వదినాన, కృష్ణాజిల్లా చిననందిగం గ్రామంలో జన్మించాడు. పర్వదినాన పుట్టిన వాళ్లకు పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయని పెద్ద లంటారు. అందువల్ల ఈ యువ నటుడు ముందు ముందు ఇంకా మంచి పేరు తెచ్చుకుంటాడని, మంచి నటుడవుతాడని మనం ఆశించవచ్చును. శోభన్‌బాబుకు వివాహమైంది — ఇద్దరు పిల్లలు.

'సు' ★

## వార్తలు

### లక్షాధికారి ప్రారంభోత్సవం

రవీంద్ర ఆర్ట్సు ప్రొడక్సన్సువారు 'లక్షాధికారి' అనే చిత్రానికి డిసెంబర్ 16 వ తేదీ వాహినీలో ప్రారంభోత్సవం జరుపుకున్నారు. శ్రీ గోగినేని వేంకటేశ్వరరావు కామిరా స్విచ్ ఆన్ చేశారు. శ్రీగుమ్మడి 'క్లాప్' కొట్టారు.

ఈ సందర్భంలో పెద్దలూ, డిస్ట్రిబ్యూటర్‌లు, నటీ నట సాంకేతిక బృందమూ హాజరయ్యారు. వీరి చిత్రంలో ఎన్. టి. రామారావు, రేలంగి, గిరిజా, కృష్ణకుమారి, బాలయ్యా మొదలగువారు నటిస్తున్నారు. వి. మధుసూదనరావు దర్శకత్వంలో నిర్మించబోయే ఈ చిత్రం నిర్మాతలు డి. వి. రెడ్డి, తమ్మారెడ్డి కృష్ణమూర్తి. ఈ చిత్రం వాణీద్వారా విడుదల కాగలదు.

### డబ్బింగ్ కళాకారుల, నిపుణుల సంఘం

దక్షిణ భారతదేశంలో, డబ్బింగ్ చిత్రపరిశ్రమలో పనిచేసే వివిధ భాషలకు చెందిన, కళాకారులు, కవులు, సంగీతదర్శకులు, ఎడిటర్లు నిన్న త్యాగరాయ నగర్‌లోని జయంతీ స్టూడియోలో, ప్రఖ్యాత రచయిత శ్రీశ్రీ అధ్యక్షతన ఒక సభ జరిపారు. మొదట శ్రీ అనిసెట్టి యీ మహాసభ జరుపవలసిన ఆవశ్యకతను గురించి ప్రస్తావిస్తూ ముడిఫిల్ము, పర్మిట్లు జారీచేసే అడ్వైజరీ కమిటీవారు, డబ్బింగుచిత్రాల పట్ల ప్రదర్శిస్తూన్న పాక్షికదృష్టిని గురించి, దాని వలన డబ్బింగు కళాకారులు, నిపుణులు అనుభవిస్తున్న కష్టనష్టాలను గురించీ వివరించి డబ్బింగ్ కళాకారులందరూ ఒక సంఘాన్ని స్థాపించుకొని తమ ఆశయ సాధనకోసం, కృషిచెయ్యాలని విజ్ఞప్తి చేశారు. ★

# రాజధాని కబుర్లు

11 వ పేజీ తరువాయి

ఇవన్నీ ఒకఎత్తు; మద్యనిషేధ సమస్య ఒక యెత్తుగా పరిణమించింది. ఆంధ్రప్రదేశ్‌లో అమోదింపబడిన చట్టాలు రాష్ట్రాని కంతటికీ వర్తిస్తాయి. మినహాయింపులంటూ ఉండవు. అయితే మద్యనిషేధచట్టం అలాంటిదికాదు; కేవలం పరిమితమై తెలంగాణా మినహాయించిన, ఆంధ్రప్రదేశ్ అంతా అమలులోఉంది, కారణం, ఆంధ్ర రాష్ట్రంగా ఉన్నప్పుడు ఆమోదించబడింది కాబట్టి, గాంధీజీ నాయకత్వంలో విదేశీయుల పరిపాలన అంతమొందించటానికి సలిపిన శాంతియుత పోరాటంలో, అంటరానితనం నిర్మూలించాలి; మద్యపానాన్ని నిషేధించాలి అనే కేకలు బాగా వినిపిస్తూ ఉండేవి. ఐక్యతకు చిహ్నం, అంటరానితనం నిర్మూలించట మనేది. మద్యాన్ని సేవించకుండా ఉంటే, మత్తు తగ్గి, మనుష్యులు మానవరూపంగా కనిపిస్తారు. దేశస్వాతంత్ర్య పోరాటంలో ధీరులుగా నిలబడకలుగుతారు. స్వాతంత్ర్యానంతరం, యీ రెండూ కూడా దేశమంతా చట్టరూపంగా, ఆమోదింపబడి అమలుపరచబడ్డాయి. అంటరానితనం పాటిస్తే నేరం; మద్యాన్ని సేవిస్తే, అదీ నేరమే! ఈ రెండు చట్టాలుకూడా పవిత్రమనీ, గాంధీజీ ఆత్మకు శాంతి లభిస్తుందని హృదయపూర్వకంగా విశ్వసించి కాంగ్రెసు ప్రభుత్వంవారు ప్రవేశపెట్టినవి. ఖద్దరు ధరించటం యెంత అవసరమో యీ రెండుచట్టాలు కూడా అమలు పరచటం, అంత అవసరమని, ప్రతికాంగ్రెసువాది నమ్మేవారు; నమ్మాలనికూడా, ఓ శాసనం ఉంది! ఇదీ మద్య నిషేధ చట్టంయొక్క స్థూలమైన స్వరూపం. అయితే మన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు శాసనసభ్యులు, సుమారు 120 మందిదాకా యింకోవిధంగా అభిప్రాయ పడ్డారు. ఈ చట్టాన్ని 'ఆంధ్ర' ప్రాంతంలో కూడా తీసెయ్యాలని సంతకాలు సేకరించి, ముఖ్యమంత్రికి సమర్పించారు. కాంగ్రెసువాదులు చేసే చిత్ర విచిత్రాలలో, యిది మహా చిత్రమయింది. ఈ చట్టాన్ని తీసెయ్యమనటంలో ఆదర్శమైన ఒక ఆంతర్యం లేకపోలేదు. డబ్బుకు మహా గిజాటుగా ఉంది. దేనిమీద పన్నువెయ్యాలన్నా, కుదరటం లేదు. అన్నింటిమీద కంఠందాక పన్నులు ఉండనే ఉన్నాయి. నోరుపెట్టుకుని అరవలేని రైతుమీదకూడా పన్ను వెయ్యటం అయిపోయింది. ఇక డబ్బు రావాలంటే యెట్లాఅని ఆలోచించి, యీ చట్టాన్ని తీసేస్తే, మన రాష్ట్రానికి అయిదారు కోట్లు పాలినా మిగులుతాయికదా అని. ఇది వారి అభిప్రాయం! కమ్యూనిస్టుచైనా తెచ్చిపెట్టిన, ఈ అత్యవసర పరిస్థితికి యెంత డబ్బు వచ్చినా తక్కువే! దీన్ని ఆధారంగా పెట్టుకుని యెన్నైనా వాదనలు అల్లుకుపోవచ్చు. మొదటిది బహుశా, ఈ మద్యపాన నిషేధచట్టం, సమర్థవంతంగా అమలు కావటంలేదు. 'తీర్థాన్ని' సేవించేవాళ్ళు సేవిస్తూనే ఉన్నారు. పైగా, దీన్ని అమలుపర్చటానికి యేర్పాటుచేసిన సిబ్బంది ఖర్చులు యింకో దండగ; నీరా రూపంలో సారా వచ్చిపడి ఆరోగ్యాన్ని భంగం కలిగించటంతప్ప యింకో ప్రయోజనం లేదు. 'వ్రతంచెడ్డా ఫలం దక్కాలిగా,' ఇలాంటి వన్నమాట? ఏ మాట కా మాట చెప్పుకోవాలి!

కాంగ్రెసువాదులు యింత సాహసానికి దిగేవారు కాదు. అయితే ముఖ్యమంత్రిగారు ఓ చిన్న ప్రకటనచేసి తమాషా చూద్దామనుకున్నారు! ప్రజాభిప్రాయంకనక, యీ చట్టాన్ని తీసెయ్యాలిఅంటే, నాకేమి అభ్యంతరంలేదు అన్నారు. కాంగ్రెసు శాసనసభ్యుల్లో మెజారిటీకనక కోరేటట్లయితే, అట్లాగే చేస్తామన్నారు. 'ఈ విషయంలో వ్యక్తిగతాభిప్రాయానికి వదిలేశాను' అన్నారు. మరి యిలాంటి ప్రజాస్వామిక సూత్రాలను అదనపు భూమిశిస్తు బిల్లును ప్రవేశపెట్టినప్పుడుకూడా పాటించివుంటే ఎంత బాగుండేది! ఇప్పుడుమాత్రం యేమయిందని; ముఖ్యమంత్రిగారు చెప్పారుకదా అని సంతకాలుసేకరించి, తీరా బైటపెట్టేటప్పటికి, యీ చట్టాన్నిరద్దుచేసేఆలోచనలేదన్నారు, సరిపోయింది.

కాంగ్రెసు శాసనసభ్యులు ఎప్పుడయితే 120 మంది దాకా సంతకాలు పెట్టారో, అమ్మయ్య! బ్రతికిపోయినాంరా, దీనికోసం గోటికిమాటికి హైదరాబాదు రావాలసివస్తోంది. ఇక దొంగచాటు వ్యవహారం అక్కర్లేదులే అని కొంతమంది నిట్టూర్చారు. పాపం! అలాటి వాళ్ళందరికీ భంగపాటు అయిపోయింది. ఇంతకూ ఓ చట్టం, శక్తివంతంగా అమలుచేయలేక పోయినంత మాత్రాన, ఆ చట్టాన్నే తీసెయ్యాలా, దాన్ని సమర్థవంతంగా అమలుపరచే విధానాన్ని ఆలోచించాలా! ఈ చట్టం ప్రవేశపెట్టిన తర్వాత, కొన్ని సమస్యలు ఉత్పన్న మయిన మాటవుతే నిజమే! గీత పనివారలకు ఎలాంటి ఉపాధి కల్పించారు? వారి శ్రేయస్సుకు ఏమి సదుపాయాలు కలిగించారు? మద్యాన్ని సేవించటం వలన కలిగే అరిష్టాలను అరికట్టగలుగుతున్నారా! ఈ చట్టం అమలుకాక పోవటానికి గల కారణాలేమిటి! ప్రజల సహకారం లేకపోవటమా! సమర్థవంతమైన పరిపాలనా యంత్రాంగం లేకపోవటం వలనా! లంచగొండితనం, అవినీతి హెచ్చుగా పెరిగిపోవటం వలనా! ఇవన్నీ సమగ్రంగాఆలోచించి నిర్ణయాలుతీసుకోవలసిఉంటుంది.

దీన్ని గురించిన గాలి—దుమారం తగ్గిపోయింది. కాలనిర్ణయం లేకుండా శాసనసభ వాయిదా వేయటం జరిగింది. ఈ సమావేశంలో యిద్దరు ప్రతిపక్ష నాయకులు హాజరు కాలేదు. ఒకరవుతే జైలులోనే ఉండిపోయారు. మరొకరు అస్వస్థత కారణంగా రాలేకపోయారు.— ఐ ఎల్. ఎన్.

---

## కుమారి కళ-17 బొమ్మల కథ- 'దేవిక'


















# న్యూఢిల్లీ లేఖ

7-వ పేజీ తరువాయి

శాఖల్లో గత దశాబ్దంగా దారుణంగా పెరిగి పోయాయి. అసలింకా ఆ ధోరణి అలాగే ఉంటోంది. కాని దేశంలోని అత్యవసర పరిస్థితి అనేది యివాళ, రేపూ తీరేది గాదు గనుక ముమ్ముందు చాలా రోజులు మనం ఈ యుద్ధోన్ముఖ ఉద్యమం సాగించాలి. ఆదా చాలా ముఖ్యం. 20 శాతం ఆదా చేసినా 180 కోట్ల రూపాయలు లభ్యమౌతాయి.

ఈ కమిటీ ముఖ్యంగా అస్సాం, పశ్చిమ బెంగాలుల్లో యింతవరకు అత్యవసర పరిస్థితులు కలిగించిన పరిస్థితులను ఆలోచించారు. వాణిజ్య—పరిశ్రమలు రెంటికీ యిక్కడ యిబ్బందిగానే ఉంది. అంచేత సరఫరాను సాఫీగా చూడటమే గాక, అదనంగా స్టాకు కూడా ఉంచుకోడం అవసరం. అంటే అదనపు సొమ్ము కావాలి, అదనపు సౌకర్యాలు కావాలి. అంచేతనే యీ విషయాలు, యిబ్బందులు అన్నీ ప్రభుత్వం దృష్టికి తేవాలి అని యీ కమిటీ నిర్ణయించుకుంది. ఇది చాలా అవసరమైన అభ్యర్థనే! ఎంచేతనంటే ప్రభుత్వ శాఖలలో కొంత తమందం ఎక్కువ.

కమ్యూనిటీ శాఖ (ప్రాంతీయాభివృద్ధి శాఖ) ఉదాహరణకు దేశాన్ని 5149 బ్లాకులుగా విభజించి 70,000 మనుష్యులకు ఉపాధి కలిగించింది.

లేబర్ బ్యాంకులనే వాటిని నిర్మించాలనీ, ప్రతి గ్రామంలోనూ రక్షణ నిధిపై శ్రమదాన బ్యాంకును ఒకదానిని తయారుచేయాలని ఆ మంత్రిత్వశాఖ ఉద్దేశం దీనికి సంప్రదింపుల సంఘాల సమావేశంలో పార్లమెంటు సభ్యులందరి అంగీకారం లభ్యమైందని తెలుస్తోంది. సహకార సంస్థల సమావేశం కూడా దీన్ని అంగీకరించింది. అంటే ఈ ప్రతిపాదన యిలా ఉంటుంది దేశంలో: "ఒక రక్షణ నిధి బ్యాంకు" ఉంటుంది. దీనికి ఈ బ్యాంకుల ద్వారా నెలకు కనీసం ఒక రోజు వంతున శ్రమదానం చేసి, తద్వారా లభ్యమైనదాన్ని నిధికి కడతారు. అంటే గ్రామాల్లో గల పనిచేసే పెద్దల సంఖ్య ప్రకారం ఇది సాధింపబడితే, కనీసం 200 నుంచి 300 కోట్ల వంతున సాలీనా 'నిధి' లభ్యం కాగలదు.

ఈవిధంగా శ్రమదానంవల్ల లభ్యమైనదానిని ప్రాంతీయంగా, వెంటనే ఫలితాలు వచ్చే విధంగా వాడుతారు.

ప్రతీ గ్రామానికి ఒక వ్యవసాయిక ఉత్పత్తి కార్యక్రమం ఉండే నిర్ణయం, అందుకు అవసరమైన పథకాలు తయారవుతున్నాయి. వ్యవసాయమైన ఏ వనరునైనా నిరర్థకంగా వదలకూడదు అనే ఉద్దేశంతోనే 5 కోట్ల ఎకరాల పొలంలో మెట్ట సాగును సాగించాలని పథకాలు వేస్తున్నారు.

అంతేగాక 1962—63 సం. లో ఎరువు పెంట ఉత్పత్తిని 90 మిలియను టన్నుల నుంచి 132 మిలియను టన్నుల మేరకు పెంచాలని ఉద్దేశమున్నది. ఎకరం కంటే హెచ్చు పొలమున్న ప్రతీ రైతు కనీసం రెండు ఎరువు పెంట గుంటలేనా ఉంచుకుని 2 టన్నుల "ఎరువు పెంట" నేనా తయారు చెయ్యాలని కోరుతారు. దానిద్వారా కాయగూరల ఫలసాయం బాగుచేయ

వచ్చును. కోళ్ళు, చేపలు, పళ్ళూ వంటి వాటి ఉత్పత్తిని దోహదించవచ్చును.

గ్రామీణ పారిశ్రామిక కేంద్రాలన్నీ యుద్ధావసర వస్తువులనే అవకాశ మున్నంత మేరకు చేస్తూయి చేయాలి.

4000 ప్రాథమిక కేంద్రాలు గల టోకు దుకాణాల పథకానికిగాను 200 కోట్ల రూపాయాల పథకం ఒకటి మంజూరైంది. ఈ టోకు దుకాణాలు నగరాలకు, పట్నాలకు అంటే 50,000 పైబడిన వాటికి ఉపయోగిస్తారు. దీనికైన వ్యయమంతా కేంద్రం భరిస్తుంది. కేంద్ర ఆధ్వర్యంలోనే ఇది జరుగుతుంది. వీటికి అని రకాల మందులు, తిండిగింజలు మొ. వస్తుసమ్మదాయం ఖచ్చితమైన ధరలకు సరఫరా అయ్యేలా చూస్తారు. ఇటువంటి సహకార దుకాణాల ఉపయోగాలను వెంటనే అమలుచేయడం సముచితం.

ఇక విద్యామంత్రిత్వశాఖ ప్రయత్నాలు ఇలా ఉన్నాయి: మాధ్యమిక, ఉన్నత తరగతి విద్యార్థులంతా దేశ అత్యవసర కార్యక్రమం క్రింద ప్రత్యేక ఫిజికల్ ట్రైనింగు పొందుతారు. ఈ జాతీయ శిక్షణ పథకం సుమారు కోటి మంది విద్యార్థులకు వర్తిస్తుంది. కాలేజీ విద్యార్థుల ఎన్. సి. సి. పథకం ఉండనే ఉంది. 1962—63 లో సుమారు 17 సుహృద్భావ యాత్రా బృందాలు, సాంస్కృతిక బృందాలు విదేశాలకు వెళ్ళాయి. రచయితలు, నటులు, వక్తలు, శాస్త్రకారులు, నాట్యకారులు అందరూ ఉన్నారీ బృందాలలో. అయితే వారి జాబితా అంతా చేస్తే శ్రమ మిగులు తప్ప, వీరి ద్వారా సాధించిన ఫలితం మాత్రం అంతంత మాత్రమే. అయితే దేశాల మధ్య సత్సంబంధాలకు యివి తోడ్పడతాయనేది ఒక మాట ఉంది.

ఈ వారంలో మద్యనిషేధంమీద మనం చాలా ప్రకటనలు విన్నాము. ఒకటి శ్రీ మొరార్జీదేశాయి చేశారు. రెండోది ప్లానింగు కమిషన్ సభ్యుడు శ్రీ శ్రీమన్‌నారాయణ్ చేశారు.

ఆర్థికమంత్రి "మనం డబ్బుకోసం ఆత్మను అమ్ముకోరాదు" అన్నారు. శ్రీమన్‌నారాయణ్ కొన్ని రాష్ట్రాలు మద్యనిషేధానికి వ్యతిరేకంగా పని చేయబూనడం పట్ల విచారం వెలిబుచ్చారు. కాని, ఆమాట కొస్తే మద్యనిషేధం అనేది కూడా కొన్ని రాష్ట్రాలే కదా ప్రవేశపెట్టాయి. అదీగాక శ్రీయుతులు మొరార్జీ, నారాయణ్ లిరువురు ఒకసారి నేఫా రంగంలోనికి వెళ్ళివస్తే బాగుణ్ణు. అక్కడ సైనికులకు 'రమ్' లేకుండా ఎలా యుద్ధం చేయాలో వీళ్ళు చెప్పగలిగినా బాగుణ్ణు.

అదే మద్యనిషేధానికి అవసరమైన ఉద్యమం!! అదీగాక వేలకొలదీ 'రమ్' బుడ్లను కొన్నగా ఎవరు తీసుకున్నారో, ఎవరు నేఫాకు పంపారో తెలియకుండా ఉంది.

ఇక, చైనా దాడివల్ల దేశంలో రగిలిన ఉద్యమం చల్లారిపోగల ప్రమాదం లేకపోలేదు. ప్రజలకు వారి త్యాగ నిధి సరిగ్గా వినియోగిస్తామనే హామీ, నమ్మకం రెండూ లభించాలి. అప్పుడే ఇది నిలబడుతుంది, సార్థక మవుతుంది.

ఆర్థికమంత్రి యీ మార్గంలో 'ఆదా' కి కొంత మార్గదర్శకులయ్యారు. ఆదాయ వ్యయ శాఖల రెండిటికీ ఒకే కార్యదర్శిని ఆయన వుంచుకున్నారు. ★

# గమనిక

ఆంధ్రసచిత్ర వారపత్రికకు పంపే రచనలు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక పేరమాత్రమే పంపాలి. వ్యక్తుల పేర్లు వ్రాయవదని మనవి.

చేస్తున్నానని బర్మా అధికార్లు నన్ను పట్టుకున్నారు. ఖైదీగా ఓడమీద భారతదేశానికి పంపేశారు. లోపల ఎంత అవమానంగా ఉన్నా, నాకు ఆనాడు రాజుతో చేసిన ప్రయాణంకన్నా, ఖైదీగా చేస్తున్న ప్రయాణమే ఎంతో హాయిగా, సౌకర్యవంతంగా కన్పించింది. వాళ్ళు నన్ను మద్రాసు పోలీసులకు అప్పజెప్పి పోయారు.

మళ్ళీ వెనకటిచోటనే నా జీవితం యథాప్రకారంగా ప్రారంభమైంది. నాలో ఆ వ్యక్తిమీద భక్తిభావం పోయి తీవ్రమైన ప్రతీకార వాంఛ ఏర్పడింది. ఈ తడవ రాజు కన్పిస్తే ప్రతీకారం సాధించాలనీ, అతని మాటలకు లొంగి, దాసురాలను కాగూడదనీ నిశ్చయించుకున్నాను. ఇలా కాలం దొర్లిపోతోంది.

సుమారు పదేళ్ళ తర్వాత రాజు ఓరోజున మా యింటికి రానే వచ్చాడు. వస్తూనే క్షమాపణలు చెప్పుకోవటం మొదలుపెట్టి తప్పులు మన్నించమని ప్రాధేయపడ్డాడు.

"నాలో ఈ పదేళ్ళుగా పేరుకున్న పగ, ద్వేషం ఇట్టే నీరు కారిపోయింది. ఈ తడవ రాజు మంచి దుస్తుల్లో వచ్చాడు. ఎన్నో విలువగల వస్తువులు బహుమానాలుగా ఇచ్చాడు. తన మాజీ యజమాని కుమారుడు బోర్నియోలో మరణించటంవల్ల యజమాని, తనమీది ప్రేమకొద్దీ ఇంజనీరింగ్ చెప్పించారనీ, ఇప్పుడు తను రు. 1000 ల జీతంమీద ఇంజనీర్‌గా సింగపూర్‌లో పనిచేస్తున్నానని, తన మేనకోడలు బోర్నియోలో ప్లేగు వల్ల చనిపోయిందనీ, ఇంక తమిద్దరు సింగపూర్‌లో ఏ అడ్డంకి లేకుండా జీవించవచ్చునీ, ఆమె కిక ఏ లోటూ రానీయననీ చెప్పాడు.

"ఇద్దరం ఓడలో మొదటి తరగతిలో ప్రయాణము చేశాం. సింగపూర్‌లో అన్ని సదుపాయాలు గల ఓ పెద్ద భవనంలోకి తీసుకువెళ్ళి ఇదే మన ఇల్లని చూపించాడు రాజు. అన్ని సదుపాయాలతో పాటు, నౌకర్లు, కారు కూడా ఉండటంలో నా కష్టాలకు ఈనాడైనా కాస్త సుఖం అనుభవించమని భగవంతుడు వ్రాశాడా అనిపించింది. ఐదు నిముషాలు ముందుగా చెప్తే చాలు, ఏ పనైనా ఇట్టే అయిపోయేది.

"కానీ, ఆ ఆనందం ఎన్నాళ్ళో సాగలేదు. మళ్ళీ నా దురదృష్టం నన్ను వెంబడిస్తూనే వచ్చింది.

"మేం సింగపూర్ చేరిన మూడు నెల్ల తర్వాత ఓరోజున రాజు ఇంట్లో లేని సమయంలో 'సరస్వతి' అనే అందాల బరిణ మా యింటికి వచ్చింది. అదివరక్కూడా రాజు తరచు ఈ అమ్మాయిని ఇక్కడకు తీసుకువస్తూ ఉండేవాడు. అది నాకు భరించరానిదే ఐనా, మద్రాసులో కూలిపనికన్నా ఇక్కడ ఈయన దగ్గర ఉండటమే ఎంతో క్షేమం అనిపించింది. ఇన్నాళ్ళు ఎలాగో సర్దుకున్నాను. కానీ ఈరోజున ఆ అమ్మాయి రావటంలో ఏదో కొంత విశేషం ఉందనుకున్నాను.

'రాజు ఉన్నారా' అని సరస్వతి అడిగింది. 'లేరని' సమాధానం చెప్పాను. అప్పుడా అమ్మాయి ఏమనుకుందో ఏమో (రాజు ఇంట్లో పనిమనిషి ననుకుందట నన్ను), తన మనస్సులో ఉన్న రహస్యాలన్నీ చెప్పుకోవటం మొదలుపెట్టింది. రాజు—తాను పరస్పరం హృదయాలు ఇచ్చి పుచ్చుకున్నామని, పెద్ద ప్రభుత్వోద్యోగంలో ఉన్న తన(అమ్మాయి) నాన్నగారు తనను రాజుకు ఇచ్చి వివాహం చేస్తా మన్నా

# విచిత్ర వివాహం

8 వ పేజీ తరువాయి

రనీ, రాజుకూడా సమ్మతించాడనీ చెప్పింది.

"ఏదో పుస్తకాల్లో చదివినట్టు, కవిత్వం చెప్తున్నట్లు అమాయికంగా మాట్లాడుతున్న ఆ బంగారపు బొమ్మను చూస్తే నాకు ఎంతో ఆశ్చర్యంతో పాటు జాలికూడా వేసింది. నా చేతనైనంతవరకు ఉపకారం చేద్దామనుకున్నాను.

"నే నెవర్నైందీ, రాజు నన్ను ఏవిధంగా బాధలు పెట్టిందీ, వివరంగా చెప్పాను. చదువు, సంపద ఉన్న సరస్వతిలాటి వ్యక్తి ఇలాంటివాళ్లను నమ్మితే ఊబిలో దిగటమే అవుతుందని చెప్పాను. ఎంతో ఉత్సాహంగా ఆనందంగా వచ్చిన ఆ పిల్ల నా ఒళ్ళో తలదాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ బాధ చూస్తుంటే ప్రపంచంలో ఆడదానికి ఏడుపే బ్రతుకేమో అనిపించింది. నా చేతనైనంతవరకు ఆమెను ఓదార్చాను.

---

ఒకడు : "అయ్యో పాపం జేబు కొట్టేశారా! పోయి పోలీసు స్టేషన్‌లో రిపోర్టు చెయ్యి.

అతడు : సరి లే! నేనే పోలీసు యిన్‌స్పెక్టర్ని...

సత్యం (మన్నడి)

---

"మద్రాసులో నే నెక్కడ ఉంటున్నదీ, ఒక కాగితంమీద రాసుకుని సరస్వతి వెళ్ళిపోయింది. మళ్ళీ నేను ఆమెను చూడలేదు. ఓ పదిరోజులు గడిచిపోయాయి.

"ఈ పది రోజుల్లోనూ సరస్వతి వచ్చి వెళ్ళిన విషయం చెప్తే, నన్ను ఇంటినుండి వెళ్ళగొడ్తాడేమోనన్న భయంతో ఆ విషయం రాజుతో చెప్పలేదు.

"రాజు ఒకరోజున హడావుడిగా ఇంటికి వచ్చి, 'ఇక్కడో ప్రమాదం ముంచుకొచ్చింది. మనం వెంటనే బయల్దేరాలని' ఖరీదుగల వస్తువులు మాత్రం తీసుకుని నన్ను బయల్దేర మన్నాడు. ఎక్కడికో ఏమో, చెప్పలేదు. ఈ మనిషికి ఎదురు చెప్పటంకన్న వెంబడి వెళ్లటమే మంచిదని నేనూ బయల్దేరాను. రాజు తన దగ్గరున్న కారును (అది కార్పొరేషన్‌వాళ్లదని తరువాత తెలిసింది) వచ్చిన డబ్బుకు అమ్మివేశాడు.

ఇద్దరం విమానంలో మద్రాసు చేరాం.

"మద్రాసులో మంచి ఇల్లొకటి ఇదివరకు నేనున్న ప్రాంతంలోనే చూసి అందులో మకాం పెట్టాం. మద్రాసు చేరినప్పటినుండి రాజు ప్రవర్తన మళ్ళీ మామూలుగా మారిపోయింది. రెండు మూడు రోజుల కొక తడవ ఇంటికి వచ్చేవాడు. ఒకరోజున వెళ్ళిపోయాడు. ఈతడవ ఏడాది దాటిపోయింది. ఇంతవరకు నే నతన్ని చూడలేదు. ఈ ఏడాదిలోపలా నేను ఆ యిల్లు మార్చి ఇదివరకున్న మురికి కొంపలోనే ఎలాగో తలదాచుకుని కాలం గడుపుతున్నాను. మామూలు కూలిపనియే మళ్ళీ చేసుకు

"ఇటీవలనే నాకు మూడు ఉత్తరాలు వచ్చాయి. అందులో మొదటి ఉత్తరం చూడగానే నాకు మా ఆయన రాజుమీద చెప్పలేనంత అసహ్యం వేసింది. రాజు ఏ మేనకోడలైతే ప్లేగు వచ్చి చనిపోయిందని చెప్పాడో ఆ మేనకోడలే ఉత్తరం వ్రాసింది. ఇంజనీరుకు బంట్రోతుగా తన యజమానితో బయల్దేరిన రాజు, బోర్నియో చేరాడనీ, బోర్నియోలోనే తనను వివాహం చేసుకున్నాడనీ; 8 సంవత్సరాలు సాఫీగా గడిచాయనీ, తర్వాత పట్నంలో ప్లేగు రాగా, ఇంజనీర్‌ను, తనను, రాజును ఆరోగ్య సంరక్షక కేంద్రాలకు తరలించటం జరిగిందనీ వ్రాసింది. ఆ కేంద్రంలో రాజు తన యజమానికి విషంపెట్టి చంపాడనీ, అదే విషాన్ని తనను కూడా త్రాగమని బలవంతపెట్టగా ఎంతో కష్టం మీద తప్పుకున్నాననీ, తన ముగ్గురు పిల్లలు, తల్లితో కలిసి రంగూన్‌లో వెనక ఉన్న ఆ మురికి పేట గుడిసెలలోనే ఉంటున్నట్టు ఉత్తరంలో రాజు మేనకోడలు వ్రాసింది. ఒకవేళ రాజును చూడటం తటస్థిస్తే అతనిపై ఏమాత్రం సానుభూతి చూపకుండా, పోలీసులకు అప్పగించాల్సిందనీ, లేకపోతే చాలా జీవితాలు నాశన మవుతాయనీ ఆ ఉత్తరంలో ఆమె మరీమరీ ప్రార్థిస్తున్నట్లు వ్రాసింది.

రెండో ఉత్తరాన్ని సరస్వతి (సింగపూర్‌లో రాజును ప్రేమించి పెళ్లిచేసుకుంటానన్న పిల్ల) సింగపూర్ నుంచి వ్రాసింది. నన్ను వదిలి (రాధాబాయిని) వెళ్లింతర్వాత, ఈ విషయ మేమిటో తేల్చాల్సిందని పట్టుపట్టగా రాజు తనను వివాహం చేసుకునేందుకు నిరాకరించాడనీ, ఈ విషయాన్ని పోలీసులకు, సింగపూర్ ప్రభుత్వానికీ తెలియపర్చటంవల్ల రాజు సింగపూర్‌నుంచి పారిపోయాడనీ, సింగపూర్ ప్రభుత్వం అతనికోసం వెతుకుతోంది గనుక అతడు పట్టుబడితే జరగబోయే విచారణలో సాక్ష్యం ఇవ్వాల్సిందనీ కోరుతూ వ్రాసింది.

ఇక మూడో ఉత్తరం—ఏ వ్యక్తిమీద కసి తీర్చుకోవాలనీ, ఇలాగా ఏ ఇతర స్త్రీ ఈ వ్యక్తి బారిపడి నాశనం కాకుండా ఉండాలనీ మేం ముగ్గురం అనుకున్నామో (మనస్సులోనే) ఆ వ్యక్తి —ఆ రాజు వ్రాసిన ఉత్తరం అది. ఆ ఉత్తరంలో రాజు—తను ఒక బ్రాహ్మణ యువతిని వివాహమాడినట్లూ, మామగారి పలుకుబడివల్ల, తనకు మళ్ళీ రంగూన్‌లో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ పదవి దొరికిందనీ, తను ప్రస్తుతం కొంచెం ఇబ్బందుల్లో ఉన్నాడనీ, నేను తన తప్పులను క్షమించి కాస్త ఆశ్రయం కల్పిస్తే, ఈ కొత్త పెళ్లికూతురుతో సహా నన్ను కూడా విదేశాలకు తీసుకుపోతాడనీ, అప్పుడు అందరూ హాయిగా కాలం గడపవచ్చనీ— ఈ ఉత్తరంలో వ్రాశాడు. ఏంచెయ్యాలో ఇంకా నేను ఏమీ నిర్ణయించుకోలేక ఆలోచిస్తుంటే మీరు వచ్చేశారు" అని సుమారు మూడు గంటలకు పైగా తన పూర్వగాథను వివరించింది రాధాబాయి.

తన దగ్గర ఉన్న మూడు ఉత్తరాలు కూడా నాకు ఇచ్చివేసింది. అందులో రాజు వ్రాసిన ఉత్తరంమీద శాస్త్రిగారి ఊరి ముద్ర ఉంది.

రాధాబాయి ఇచ్చిన ఉత్తరాలు ఆధారంగా, రాజు బర్మా, సింగపూర్‌లలో చేసిన నేరాలను బుజువు చెయ్యటం సాధ్యమయ్యేపని కాదని తేలిపోయింది. బర్మా, సింగపూర్‌లలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా తప్పుడు ప్రచారం చేసుకున్నందుకు భారత దేశంలో రాజును శిక్షించేందుకు వీల్లేదు. పైగా చాలామంది నమ్మేటట్లుగా కూడా చేసుకున్నాడు రాజు తన తెలివితేటలవల్ల. అందువల్ల స్వయంగా శాస్త్రిగారి ఊరు వెళ్లి పరిశోధించటమే మంచి దని నాకు తోచింది.

* * *

మొదట చెప్పిన కథావృత్తాంతం అంతా నేను రాజును గూర్చి, శాస్త్రిగారి ఊళ్లోను, రావు





(కామజ్యోతి తండ్రిగారి), తదితర్ల దగ్గర, చాలా ముఖాముఖి సంభాషణల్లోను ఆరాతీసిందే. వీళ్ల సంభాషణలో చెప్పింది, రాధాబాయి తెల్పిన విశేషాలు చేరిస్తే ఈ నేరం సమగ్రరూపం బయట పడింది.

వాళ్లకు నచ్చచెప్పి వాళ్ల సాక్ష్యాలు ఆధారంగా, శాస్త్రిగారి ఊళ్లోనే రాజుపైన అభియోగం మోపాం. మారుపేరుతో వ్యవహరించటం, అక్రమంగా రోజ్‌ను వివాహం చేసుకోవడమనే నేరాల పైన రాజుకు 4 ఏళ్లు కఠినశిక్ష విధించటం జరిగింది.

*　　　*　　　*

తర్వాత ఎవరెవరేం చేశారనేదేది మన కనవసరం. వయఃప్రభావంవల్ల మానం పోగొట్టుకున్న కామజ్యోతి తనకు పడిన 15 రోజుల శిక్ష అనంతరం, ఇంటికి చేరేందుకు ముఖంచెల్లక, వేరే బ్రతుకు తెరువులేక, వ్యభిచార వృత్తికి దిగింది. కొంతకాలం తర్వాత ఒక కామోన్మత్తుని కత్తిపోటుకు బలియై చిన్నతనంలోనే తీరని బాధలతో దుర్మరణం పాలైంది. ఈ దుర్మరణానికి, ఈ జీవితం ఇలా దుస్థితితో అంతం కావటానికి కారణం ఎవరూ! రాజు మాత్రమేనా ! కట్టుత్రాళ్లు లేకుండా తమ బిడ్డలను పెంచిన రావు దంపతులు మాత్రం బాధ్యులు కారా ?

రోజ్ జీవితంలో సౌఖ్యం లేకపోవటానికి కారణం ఆమె తండ్రి కాదా ! మిగిలిన వ్యవహారాల పట్ల ఆయనకున్న శ్రద్ధ, కుమార్తె పెండ్లి విషయంలో చూపిస్తే, ఈ 'పత్రికా ప్రకటన' వివాహానికి ఇంత లొంగిపోయేవాడూ కాదు;రోజ్ తనకొడుక్కు తండ్రి (రాజు) పోలిక రాకుండా చేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కూర్చునేదీ కాదు.

నిందితుడు రాజు విషయం కూడా అంతే ! ఎంతో తెలివి, చాకచక్యం, అందరి మనస్సులను ఇట్టే ఆకర్షించగల సామర్థ్యం, మహోపత్సవయాల్లో కూడా చలించని మనోస్థయిర్యం గల వ్యక్తి ఇలా దుర్నీతికి, సమాజ ద్రోహానికి పాల్పడ్డాడంటే బాధ్యులెవరూ! అక్రమమో—సక్రమమో తనకు కల్గిన సంతానమనే దృష్టితో ఆతని తండ్రి సరియైన విద్యాబుద్ధులు, క్రమశిక్షణ చిన్నతనంనుంచి నేర్పించి ఉంటే, రాజు ఈ దుస్థితికి బదులు ఎంతో ఉన్నత స్థానంలో ఉండేవాడు. ఇందరు అమాయక స్త్రీలు తమ మానాన్ని పోగొట్టుకోవలసిన దౌర్భాగ్య స్థితి కల్గి ఉండేది కాదు.

ఇదంతా నా గొప్ప కోసం చెప్పుకోవటంలేదు. మామూలాన ఉద్యోగానికి, స్నేహితుడైన పోలీస్ ఇన్‌స్పెక్టరు తిలోదకా లిచ్చే పరిస్థితి ఏర్పడుతున్నదే అని, నా మిత్రునికి తోడ్పడి నా బాధ్యత నేను నెరవేర్చుకోవాలనే ఉద్దేశ్యంతో నేను చేసిన కొద్దిపాటి పరిశోధనవల్ల ఈ విషయాలన్నీ వెల్లడయ్యాయి.

ఈ కథంతా చెప్తే నన్నేదో చాలా గొప్పవాడని పొగడ్తారని కూడా అనుకోటంలేదు. అనుకోను. ఏనాడైనా ఎవరి జీవితంలోనైనా ఇలాంటి వ్యక్తులు—రాజులాంటి వ్యక్తులు, సంఘద్రోహులు జొరబడితే వారినుండి తప్పించుకుని తమ సంసారాలను చక్కబరచుకుంటారనే నా ఆకాంక్ష. శలవ్!

**అయిపోయింది.** ★

తుము విజాతీయమును గాని స్పర్శ యేదో తన్ను సోకి నట్లు అతడగడువడెను. అంతలో విచిత్రముగ నవ్వెను. "భగవన్! నీవు మాయావు. నేను నిన్ను జయింతు నంటినిగదా! ఇదిగో సర్వ సంసారమును దాటి అంత ర్హితుడ నగుచున్నాను" అనెను.

అతడు యున్నచోట నేదో వెలుగు పొడగట్టెను. ఆ వెలుగులో వామాక్షి, ఛిన్నయు, అఛిన్నయు, మఖియు, దుఃశీలయు, కృష్ణవక్త్ర అన్న మినాటి

# హరివంశము

12-వ పేజీ తరువాయి

వెన్నెలవలె భాసించెను.

దూరమున మహాకాళనాథుని దేవాలయమున ఎవరు మ్రోయించిరో గంటను, నందిరంకెల ప్రతి ధ్వనులవలె, ఆచార్య సాందీపని ఆశ్రమముమీదుగ క్షిప్ర తరగలమీదుగ, అనంతమైన ఆకాశమునందలి మహా శబ్దమయ ప్రపంచములో పరమశివుని అర్ధ నారీశ్వరావతరణ వేళను దక్షిణ వామపాదార్పి తంబు మంజీర కణాకణ నినాద మంథరములై ఒకసారి ఉద్ధతముగ, మరియొకసారి మంజులముగ, ఒక్కసారి యుగపదానంద తాండవ సంవేల్లితారక్త బంధుర లాస్య సుందర మంథరముగ ఘల్లు రన్నవి. శ్రీకృష్ణదేవుని వేణు దండమునకు చివర ఒంచు లలో బిగించిన చిరు మువ్వలను పోలి [illegible] ములు చిందినవి. — హరీ శివశర్మ. ★
















Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty S
Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

